# నవ్య వీక్లీ

ఆంధ్రజ్యోతి ప్రచురణ

www.navyaweekly.com

26-7-2017

₹:20

- 'అన్వేషణ' సీరియల్ ప్రారంభం
- ఇక వేళ్ళమీద విద్యే!

# అల్ట్రా వేరియోకు అప్‌గ్రేడ్ చేసుకోండి!

## ఎలక్ట్రానిక్ స్పీడ్ సెన్సార్ మరియు స్లో స్పీడ్ ఫంక్షన్‌గల ఏకైక మిక్సర్ గ్రైండర్




Perfectly made









**స్లో స్పీడ్ జ్యూసింగ్**

ఇందులోని గింజలను తీసి, గట్టి అయిన పోషకాలుగల పళ్లరసం పొందడానికి తగిన వేగం

**గోధుమ పిండి కలపడం**

150 గ్రాం/8 చపాతీలు చేయడానికి తగిన పిండి ఒత్తడానికి తగిన వేగం



**కాయగూరలు తరగడానికి**

కేరట్, ఉల్లిపాయ, క్యాబేజి, బీట్‌రూట్ లాంటివాటిని తరుగుతుంది

మనం వండే ప్రతి ఆహార పదార్థానికీ ప్రత్యేకమైన పక్వత, రుచి కావాలి! అందువలననే వేరియో మిక్సర్ గ్రైండర్లు 4 ప్రత్యేకతలుగలిగిన వేగంతో డిజైన్ చేయబడి ఒక ఎలక్ట్రానిక్ స్పీడ్ మోటర్‌తో అనుసంధానం చేయబడింది. ఇందువలన అవసరమైన వేగాలలో, వేడి ఎక్కువ కాకుండా, పోషకాలు అన్నిటినీ నిల్వచేసుకుని సరైన పక్వంలో పదార్థాలను రుబ్బడం సాధ్యమవుతుంది.


ప్రతియొక్క ప్రత్యేక ఉపయోగానికీ తగినట్లు సరైన వేగంలో రుబ్బే ఎలెక్ట్రానిక్ స్పీడ్ సెన్సార్


తుప్పుపట్టని, ఫుడ్ గ్రేడ్, AISI 304, స్టెయిన్‌లెస్ స్టీల్ జార్లు, శుభ్రమైన ఆహారానికి భరోసానిస్తున్నాయి


750 వాట్ శక్తిగల మోటార్ చక్కగా రుబ్బడానికి, వివిధ పనులను చేయడానికి తగినది


స్లో స్పీడ్ జ్యూసింగ్/చాపింగ్‌ల 4 ప్రత్యేక స్పీడ్‌లు గలది


2 ఏళ్ళ వారంటీ

---

 www.elgiultra.com  /ultraappliances  /ultraappliancess

Elgi Ultra Industries Ltd., #30-18-28 A, KVS Guptha Street, Seetarampuram, Vijayawada, Andhra Pradesh 520 002. Toll Free Customer Care: 1800 102 2040
E-mail: ultracare@elgiultra.com For enquiries, call: Hyderabad - 91779 64566, 98665 34477, 91779 64566, 95503 63131, Warangal - 9100931868, Vijayawada - 99084 34477, Rajahmundry - 90004 54333, Visakhapatnam - 78937 05252, Tirupathi & Kurnool - 77026 14747, Guntur & Prakasam - 70950 42555



8

## ఒత్తిడిని వదిలించుకోవడం ఇక 'వేళ్లమీద' విద్యే!

రెండువేళ్ల మధ్య ఇమిడిపోయే ఓ చిన్న ఆటవస్తువులాంటిదే 'ఫిడ్జెట్ స్పిన్నర్'. దీన్ని గిరగిరా తిప్పి దానివైపే చూస్తుంటే మనలోని ఒత్తిడి దూరమవుతుంది. సెలబ్రిటీల నుంచి సామాన్యుల వరకు ఉపయోగిస్తున్న ఈ గాడ్జెట్‌కు దేశవిదేశాల్లో గిరాకీ పెరిగిపోయింది.

**42**

### అన్వేషణ

(కొత్త సీరియల్ ప్రారంభం)

ఆ పిల్లాడికి అమ్మంటే ప్రాణం. అమ్మ నవ్వు, అమ్మ మాట, పాట...అన్నీ అపురూపమే. కానీ ఆ రోజు అమ్మ చాలా కొత్తగా ప్రవర్తించింది, కన్నీళ్లు పెట్టుకుంది, అప్పగింతలు చెప్పింది. ఎందుకని?

**70**

### ఇంటర్వ్యూ

ప్రేక్షకులను ఉర్రూతలూగించిన డ్యాన్సర్ అనురాధ. హెల్దీ చిత్రాలు రావాలనీ, పాత నటులను యువదర్శకులు గుర్తించాలనీ కోరుతున్న 700 చిత్రాల నటి ఇంటర్వ్యూ

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: రెజీన


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### వందరూపాయలు

పోర్టికోలో కూర్చుని కబుర్లాడుకుంటుంటే...పడవ లాంటి కారొచ్చి ఆగింది. పద్దెనిమిదేళ్ల కొడుకు దిగాడు అందులోంచి. చూసి ఆశ్చర్యపోయారు తల్లిదండ్రులు.

"నీకు ఈ కారు ఎక్కడిదిరా?" అడిగారు.

"కొన్నాను" అన్నాడు కొడుకు.

"ఎక్కడ కొన్నావు?"

"వీధిమలుపు తిరిగితే అక్కడో ఆలయం ఉందా? ఆ ఆలయం దగ్గర ఓ పెద్దబిల్డింగ్ ఉందా? ఆ బిల్డింగ్ ఓనర్ అమ్ముతుంటే కొన్నాను."

"ఎంతకి కొన్నావు?"

"వందరూపాయలకి"

"వందరూపాయలకా!" ఆశ్చర్యపోయారు తల్లిదండ్రు లిద్దరూ.

"ఆవిడకి పిచ్చెక్కిందనుకుంటాను, కారే వందరూపాయ లకి అమ్మిందంటే...ఇల్లూ, అవన్నీ ఎంతకి అమ్ముతుందో ఏమో! వెళ్లండి! వెళ్లి వివరంగా కనుక్కోండి." తొందర పెట్టింది తల్లి. తండ్రి పరుగుదీశాడు. వీధిమలుపు తిరిగి, ఆలయం దగ్గరి బిల్డింగ్‌కి చేరుకున్నాడు. పేపర్ చదువు కుంటూ ప్రశాంతంగా కూర్చున్న ఓనర్‌ని కలిశాడు.

"మీరు ఇందాక వందరూపాయలకి మా అబ్బా యికి కారు అమ్మారట! నిజమేనా?" అడిగాడు.

"నిజమే" అందామె.

"బాగా డబ్బు అవసరమై అమ్మాల్సి వచ్చింది. మా వారు పెద్ద బిజినెస్‌మాగ్నట్. నిన్న బెంగళూర్ వెళ్లారు. అటునుంచి అటే సెక్రటరీ అనుష్కతోపాటుగా కాశ్మీర్ వెళ్తున్నారట! ఓ నెలరోజులు ఉండి వస్తారట! డబ్బు కావాలి, కారుని అమ్మి డబ్బు పంపించమని ఓ ఫ్రెండ్ ద్వారా కబురుపెట్టారు. దాంతో అమ్మాల్సి వచ్చింది. ఇప్పుడే ఆ వందా మనియార్డర్ చేశాను." అందామె మళ్లీ

### భయం

"ఏంటండీ మీరు? నేను పాడుతున్న ప్రతిసారీ వెళ్లి బాల్కనీలో నిల్చుంటారు?" అడిగింది భార్య.

"లేకపోతే నేను నిన్ను కొడుతున్నారనుకుంటారే! నా భయం నాది." అన్నాడు భర్త.

### దయచేసి...

భర్త సెల్‌కి ఓ భార్య మెసేజ్ పెట్టిందిలా.

ఇప్పుడే ఓ వార్త విన్నాను, ఊర్లో భయంకరమైన దయ్యం తిరుగుతోందట! తలలో మెదడు అన్నదే లేదట! పుర్రెతో ఉందట! గారపట్టిన పళ్లమధ్య సిగరెట్ పెట్టుకుని తాగుతోందట! ఓ చేతిలో బ్రాందిబాటిల్ కూడా ఉందట! నీ గురించే నా భయం అంతా. దయచేసి ఓసారి రింగ్ చెయ్యి.

—వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 21

26-7-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



# మొదటి పేజి

## కృతజ్ఞత

మంత్రిగా రాయుడుగారి ప్రమాణస్వీకారం ఇలా ముగిసిందో లేదో అలా చావుకబురు చల్లగా తెలిసింది. కారుడ్రైవర్ స్వామి చనిపోయాడని చెప్పారెవరో! ప్రముఖులతో రాత్రి డిన్నర్ ఉంది. మంత్రిగా మర్నాడు చాంబర్ ప్రవేశం ఉంది. అయినా అన్నీ క్యాన్సిల్ చేసుకున్నారు రాయుడుగారు. ముందుగా స్వామిభార్యకు ఫోన్ చేశారు. తానొచ్చే వరకు స్వామిని దహనం చేయవద్దన్నారు. కడసారి చూస్తానని కన్నీరుపెట్టుకున్నారు. కాదనలేదామె. అలాగే మారాజా అన్నది. అగ్రహారానికి వెళ్ళాలి. హెలికాప్టర్ సిద్ధం చేయండన్నారు రాయుడుగారు. చేశారు. హెలికాప్టర్ ఎక్కి బయల్దేరారు రాయుడుగారు.

ఇంటర్ చదువుతున్న రోజులు. రాయుడుకోసం ప్రత్యేకించి ఓ కారుకొన్నారు. అతనికోసం ప్రత్యేకించి ఓ డ్రైవర్ని కూడా పెట్టారు. ఆ డ్రైవరే స్వామి. అతనికి అప్పుడు పాతికేళ్ళుంటాయి. పొద్దున తొమ్మిదిగంటలకు పనిలోకి వచ్చేవాడు స్వామి. రాత్రి ఏ పదో పదకొండుకో పని పూర్తయితే ఇంటికి వెళ్ళేవాడు, అదీ రాయుడు అనుమతి తీసుకుని. రాయుడికి నీడలా ఉండేవాడు స్వామి. అన్నిటా తోడుగా ఉండేవాడు. కారులో ఖాళీగా కూర్చోవడం స్వామికి ఇష్టం ఉండేదికాదు. ఎప్పుడూ ఏదో పుస్తకం చదువుతుండేవాడు. ఒకసారి రాయుడిమీద విషప్రయోగం జరిగింది. ఎవరో అతన్ని చంపాలనుకున్నారు. అయితే గండం గట్టెక్కింది. అప్పుడు కారులో ఆలయానికి వెళ్తూ భయంభయంగా అడిగాడు రాయుడు. విషం అంటే ఏమిటిస్వామీ? అని. ఏదైనా అవసరమైనది మితిమీరితే దాన్ని విషం అంటారుబాబూ! అది అధికారం కావచ్చు. డబ్బు కావచ్చు. ఆకలి కావచ్చు. అహం, బద్ధకం, ప్రేమా, కోరికా, అసహ్యం ఏదైనా కావచ్చు. దాన్ని విషం అంటారు అన్నాడు స్వామి. శత్రుత్వం అంటే? అడిగాడు రాయుడు. శత్రుత్వం అంటే ఎదుటివారిలో ఉన్న మంచిని తెలుసుకోలేకపోవడం బాబూ! తెలుసుకోగలిగితే దానిని మించిన ప్రేరణా, స్ఫూర్తీ లేదు అన్నాడు స్వామి. మరి భయం అంటే? భయం అంటే ఇంకేం లేదుబాబూ! మన సంశయాలనీ, సందేహాలనీ నిజాయితీగా మనం ఒప్పుకోగలగాలి. ఒప్పుకోగలిగితే అంతకు మించిన సాహసం లేదు అన్నాడు స్వామి. స్వామి చెప్పిన మాటలు రాయుణ్ణి బాగా ఆలోచింపజేశాయి. ఆనాటి నుంచి అతనికి భయం, శత్రుత్వం లేకుండాపోయాయి. అలాగే అన్నిటినీ మితంగా స్వీకరించి, విషానికి విరుగుడు కనుగొన్నాడతను.

తొలిసారిగా ఎమ్మెల్యేగా ఎన్నికైనరోజులు. ఏదోసభలో పాల్గొని అగ్రహారానికి తిరిగి వస్తున్నారు రాయుడుగారు. అప్పుడు తెలిసింది, ఆ రోజు స్వామి పుట్టినరోజని. శుభాకాంక్షలు చెప్పి, ఏం కోరుకుంటావో కోరుకో! తీరుస్తాను అన్నారు రాయుడుగారు. ఒట్టు పెట్టారు కూడా. అయితే నేను కారు వెనుక సీట్లో మీలా కూర్చోవాలి. మీరేమో నా సీట్లో కూర్చుని, కారు తోలాలి. చిన్నకోరికే! తీరుస్తారా బాబూ? అడిగాడు స్వామి. కారాపు అన్నారు రాయుడుగారు. ఆపాడు స్వామి. కారు దిగారు రాయుడుగారు. స్వామిని వెనక్కి వెళ్ళమని చెప్పి, అతనిసీట్లో తాను కూర్చునే ప్రయత్నం చేశారు. వద్దని వేడుకున్నాడు స్వామి. ఏదో సరదాకన్నాను బాబూ! నా ఒంట్లో ప్రాణం ఉన్నంతవరకూ ఇది జరగనిస్తానా? ఎక్కండెక్కండి అని కారెక్కించి బయల్దేరాడు స్వామి. కారుని ముందుకు పోనిచ్చాడు. నాలుగుదశాబ్దాలుగా కారలా నడిపి, నడిపి మొన్ననే అనారోగ్యానికి గురయ్యాడు స్వామి. డాక్టర్‌కి చూపిస్తే పర్వాలేదన్నాడు. ప్రమాదంలేదన్నాడు. కాని జరగరానిది జరిగిపోయింది అనుకున్నారు రాయుడుగారు. కన్నీటితోనే అగ్రహారం నేల మీద అడుగుపెట్టారు. అడుగుపెడుతూనే తన కారుని తీసుకురమ్మన్నారు. తీసుకొచ్చారు. తానే డ్రైవ్ చేసుకుంటూ కార్లో స్వామి ఇంటికి చేరుకున్నారు రాయుడుగారు. అతన్ని చూస్తూనే స్వామి కుటుంబసభ్యులంతా గొల్లుమన్నారు. వారిని ఓదార్చారు రాయుడుగారు. పాడె సిద్ధం అవుతోంటే వద్దని వారించారు. మరెలా అంటే... ఇలా అన్నారు.

రథంలా కారుని అలంకరించారు. స్వామిని ముస్తాబు చేశారు. అతనికి కోటూ, ఫ్యాంటూ తొడిగారు. సెంటు కొట్టారు. కారు వెనుకసీట్లో... రాయుడుగారు కూర్చున్న చోటే కూర్చోబెట్టారు. శవం తూలిపడకుండా పిల్లల్ని పట్టుకోమన్నారు. పట్టుకున్నారలాగే. డ్రైవర్ సీట్లో రాయుడుగారు కూర్చున్నారు. కారు నడిపారాయన. శ్మశానానికి చేర్చారు. ఒట్టుపెట్టి మరీ మాట నెరవేర్చకపోవడం మనిషితనం కాదనుకున్నారేమో! నెరవేర్చి కళ్ళు మూసుకున్నారు రాయుడుగారు. నవ్వుతూ వీడ్కోలు చెప్పి వెళ్ళిపోతున్న స్వామిని దర్శించారు.

**కృతజ్ఞతను మించిన గొప్పపనీ, అత్యవసరమైనపనీ ఈ ప్రపంచంలో మరొకటి లేదు. ఆ సంగతి రాయుడిగారికి బాగా తెలుసు.**

నవ్య




### బుధవారం: 19 జూలై 2017

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, గ్రీష్మరుతువు, ఆషాఢమాసం, బహుళపక్షం**

**తిథి:** దశమి ఉ. 7.26, ఏకాదశి తె. 4.28 వరకు

**నక్షత్రం:** కృత్తిక రా. 7.45 తదుపరి రోహిణి

**వర్జ్యం:** ఉ. 8.42 నుంచి 10.10 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 11.56 నుంచి 12.48 వరకు

**అమృతఘడియలు:** సా. 5.34 నుంచి 7.02 వరకు

**రాహుకాలం:** మ. 12.00 నుంచి 1.30 వరకు

**సూర్యోదయం:** 5.55

**సూర్యాస్తమయం:** 6.49

### గురువారం: 20 జూలై 2017

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, గ్రీష్మరుతువు, ఆషాఢమాసం, బహుళపక్షం**

**తిథి:** ద్వాదశి రా. 1.13 తదుపరి త్రయోదశి

**నక్షత్రం:** రోహిణి సా. 5.25 తదుపరి మృగశిర

**వర్జ్యం:** ఉ. 10.11 నుంచి 11.38 వరకు, రా. 10.26 నుంచి 11.52 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 10.13 నుంచి 11.05 వరకు, మ. 3.23 నుంచి 4.14 వరకు

**అమృతఘడియలు:** మ. 2.32 నుంచి 3.59 వరకు

**రాహుకాలం:** మ. 1.30 నుంచి 3.00 వరకు

**సూర్యోదయం:** 5.55

**సూర్యాస్తమయం:** 6.49

### శుక్రవారం: 21 జూలై 2017

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, గ్రీష్మరుతువు, ఆషాఢమాసం, బహుళపక్షం**

**తిథి:** త్రయోదశి రా. 9.50 తదుపరి చతుర్దశి

**నక్షత్రం:** మృగశిర మ. 2.53 తదుపరి ఆరుద్ర

**వర్జ్యం:** రా. 10.23 నుంచి 11.49 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 8.30 నుంచి 9.22 వరకు, మ. 12.48 నుంచి 1.39 వరకు

**అమృతఘడియలు:** ఉ. 7.10 నుంచి 8.27 వరకు, మ. 3.24 నుంచి 4.49 వరకు

**రాహుకాలం:** ఉ. 10.30 నుంచి 12.00 వరకు

**సూర్యోదయం:** 5.55

**సూర్యాస్తమయం:** 6.49

### శనివారం: 22 జూలై 2017

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, గ్రీష్మరుతువు, ఆషాఢమాసం, బహుళపక్షం**

**తిథి:** చతుర్దశి సా. 6.28 తదుపరి అమావాస్య

**నక్షత్రం:** ఆరుద్ర మ. 12.19 తదుపరి పునర్వసు

**వర్జ్యం:** రా. 11.06 నుంచి 12.32 వరకు

**దుర్ముహూర్తం:** రా. 11.06 నుంచి 12.32 వరకు

**అమృతఘడియలు:** లేవు

**రాహుకాలం:** ఉ. 9.00 నుంచి 10.30 వరకు

**సూర్యోదయం:** 5.56

**సూర్యాస్తమయం:** 6.49

### ఆదివారం: 23 జూలై 2017

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, గ్రీష్మరుతువు, ఆషాఢమాసం, బహుళపక్షం**

**తిథి:** అమావాస్య మ. 3.16 తదుపరి పాడ్యమి

**నక్షత్రం:** పునర్వసు ఉ. 9.53 తదుపరి పుష్యమి

**వర్జ్యం:** సా. 5.10 నుంచి 6.38 వరకు

**దుర్ముహూర్తం:** సా. 5.05 నుంచి 5.57 వరకు

**అమృతఘడియలు:** ఉ. 7.44 నుంచి 9.10 వరకు, మ. 1.54 నుంచి 3.22 వరకు

**రాహుకాలం:** సా. 4.30 నుంచి 6.00 వరకు

**సూర్యోదయం:** 5.56

**సూర్యాస్తమయం:** 6.48

### సోమవారం: 24 జూలై 2017

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం**

**తిథి:** పాడ్యమి మ. 12.23 తదుపరి విదియ

**నక్షత్రం:** పుష్యమి ఉ. 7.43 తదుపరి ఆశ్లేష

**వర్జ్యం:** రా. 7.36 నుంచి 9.05 వరకు

**దుర్ముహూర్తం:** మ. 12.48 నుంచి 1.39 వరకు, మ. 3.22 నుంచి 4.14 వరకు

**అమృతఘడియలు:** తె. 4.31 నుంచి 5.55 వరకు

**రాహుకాలం:** ఉ. 7.30 నుంచి 9.00 వరకు

**సూర్యోదయం:** 5.56

**సూర్యాస్తమయం:** 6.48

### మంగళవారం: 25 జూలై 2017

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం**

**తిథి:** విదియ ఉ. 9.58 తదుపరి తదియ

**నక్షత్రం:** ఆశ్లేష ఉ. 6.00, మఖ తె. 4.52 వరకు

**వర్జ్యం:** సా. 5.26 నుంచి 6.57 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 8.31 నుంచి 9.22 వరకు, రా. 10.27 నుంచి 11.10 వరకు

**అమృతఘడియలు:** రా. 2.34 నుంచి 4.06 వరకు

**రాహుకాలం:** మ. 3.00 నుంచి 4.30 వరకు

**సూర్యోదయం:** 5.57

**సూర్యాస్తమయం:** 6.48

## మెయిల్ బాక్స్

### విజయవిలాసం ఎక్సలెంట్

విజయవిలాసం–2 ఎక్సలెంట్. యువతకు స్ఫూర్తిదాయకంగా, సింపుల్‌గా, సూటిగా తక్కువ మాటల్లో ఎక్కువ విషయాలు అందిస్తున్నారు. చైతన్య పరుస్తున్నారు. విద్యార్థులకు ఎంతో ప్రయోజనకరమైన కాలమ్ ఇది.

కథలు ఆద్యంతం చదివించేలా ఉన్నాయి. హరివంశంలో అసుర సంహారం అద్భుతంగా వర్ణించి చెబుతున్నారు. లాకర్ నెంబర్ 369 సీరియల్ వెరైటీగా ఉంది. మొదటిపేజీ ఆకట్టుకుంది. వీక్లీని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దుతున్న ఎడిటర్‌గారికి అభినందనలు.

**–ఎం.రాజ్యలక్ష్మి, విజయవాడ–2**

### థాంక్స్

విజయవిలాసంలో కళాతపస్వి కె.విశ్వనాథ్ గారి గురించి చెప్పినందుకు థాంక్స్. మన సంస్కృతి, సంగీతాలను తెలుగు జాతికి అందించా రాయన. దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు అందుకున్నారు.

**–జిట్టా రమణి మోహన్, మదనపల్లి**

### కథలు ఆసక్తికరం

'మైత్రీబంధం' కథ అపార్టుమెంటుల్లో నివసించే వారందరూ తప్పక చదవాలి. 'ఫ్యామిలీకోర్టు', 'శతమానం భవతి' కథలు నేటి యువతరానికి కనువిప్పు. 'పరిపక్వం' కథ చదివి కొంతమంది వ్యాపారులైనా మార్పు చెందాలనే సందేశం అందజేశారు జెన్నీగారు. పిల్లల కోసం ప్రత్యేక కథ 'నూరుకట్ల పిశాచం' కేవలం పిల్లలకే కాదు, పెద్దలకు కూడా చాలా ఆసక్తికరంగా ఉంది. 'పులి' వేషం ప్రాధాన్యం గురించి మొదటిపేజీలో తెలుసుకున్నాం. పాఠకుల కోసం నవ్య ఎప్పటికప్పుడు తీసుకుంటున్న నూతన చర్యలు హర్షణీయం.

**–దుర్గమహంతి మోహనరావు, ఇసిఐఎల్, హైదరాబాద్**

### వీక్లీలో నవ్వుల మోత

కాజల్ ముఖచిత్రం వన్నె తెచ్చింది. బాచిగారి తీన్మార్ నవ్వులమోత మోగించింది. మార్నింగ్ కాఫీ జోక్స్ నవ్వించాయి. కార్టూన్లు నవ్వుల టానిక్‌ను అందిస్తున్నాయి. కథలు రసవత్తరంగా చదివిస్తున్నాయి. అగ్రహారం బామ్మ కథలు విని పెద్ద పెద్ద ఆఫీసర్లైన వైనం తెలుసుకుని సంతోషించాం. మధుబాబుగారి సీరియల్ స్టార్ ఫైటర్ చదివితే ఆయనలో ఇంకా చురుకుతగ్గలేదనిపిస్తోంది. నిధి సీరియల్‌లో ప్రతి సన్నివేశం దృశ్యానందకరంగా రాయడమే వక్కంతంగారి ప్రత్యేకత. 'మహానదిలోకి' కవితలో మనిషిలోని అలజడిని చక్కగా రాశారు.

**–కాళ్ళ గోవిందరావు, ఆముదాలవలస శ్రీకాకుళంజిల్లా**

### ఇంటర్వ్యూలు బాగున్నాయి

మొదటిపేజీ బామ్మకథ, కె.ఆర్.విజయ, నిక్కీ గల్రాని ఇంటర్వ్యూలు బాగున్నాయి. సినీ విశేషాలు ఆకట్టుకున్నాయి. ఎదలోతుల్లో... కథ చదివింప జేసింది. హారర్ సినిమాలు చూడండి బరువు తగ్గండి అనే వ్యాసం వినూత్నంగా ఉంది.

**–శశిరేఖాలక్ష్మణన్, కె.కె.ఆర్. నగర్, చెన్నై–60**

### ఎంతో నిండుదనం

కాజల్ ముఖచిత్రంలో నవ్య వీక్లీలో ఎంతో నిండుదనం కనిపించింది. మొదటిపేజీ బామ్మకథ కథగానే మిగిలిపోయింది. నవ్వు–నవ్వించు వ్యాసం బాగుంది. ఘటన కథ, స్టార్ ఫైటర్ సీరియల్, కెరలిన గాయం కవిత బాగున్నాయి. హరివంశంలో పురాణాన్ని మా కళ్ళముందుంచారు. తీన్మార్ కార్టూన్లు బాగున్నాయి. కె.ఆర్.విజయ ఇంటర్వ్యూ బాగుంది. ఆమె దేవత పాత్రలు మరువలేం.

**–మేడిశెట్టి తాతారావు, కోలంక. వయా యానాం**

# శృంగార సమస్యలు హోమియోతో దూరం

కొన్ని వ్యాధులను ఇతరులతో పంచుకోలేరు. మరికొన్ని వ్యాధులకు చికిత్స తీసుకున్నా ఫలితం ఉండదు. అలాంటి వాటిలో ముఖ్యమైనవి హెర్పిస్, అంగస్తంభన సమస్యలు, ఆటో ఇమ్యూన్ డిజార్డర్లు. ఈ సమస్యలకు ఇతర వైద్య చికిత్సా విధానాల్లో తాత్కాలిక ఉపశమనమే తప్ప ఫలితం ఉండదు. కానీ హోమియో వైద్యంతో శాశ్వత పరిష్కారం లభిస్తుందని అంటున్నారు హోమియో వైద్యనిపుణులు డాక్టర్ టి.ప్రభాకర్.


**డాక్టర్ టి.ప్రభాకర్**
ఎం.డి., హోమియో
మేనేజింగ్ డైరెక్టర్, హోమియో ట్రెండ్స్
హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ
ఫోన్స్: 77 3000 3000
77 3000 4000




## హెర్పిస్

ఒకరి నుంచి మరొకరికి వ్యాపించే వ్యాధి ఇది. వైరస్ కారకము.. జీవితాంతం చికిత్స తీసుకున్నా బాధిస్తూనే ఉంటుంది. తగ్గినట్టే తగ్గి మళ్లీ తిరగబెడుతుంది.

**వ్యాప్తి :** కలిసి భోజనం చేయడం, ఒకే గ్లాసు, ఒకేకంచం, ఒకే మంచం, లిప్‌బామ్, ముద్దుల ద్వారా వ్యాప్తి చెందుతుంది. శృంగారం ద్వారా, సెక్సువల్ ఫ్లూయిడ్స్ ద్వారా వ్యాప్తి చెందును.

**రకాలు :** హెచ్ఎస్‌వి 1, హెచ్ఎస్‌వి 2.

ఏ వయస్సు వారికైనా వ్యాప్తి చెందుతుంది. పెద్దల నుంచి చిన్న పిల్లల వరకు అందరికీ రావచ్చు.

**ఎవరికి రావచ్చు? :** పరస్త్రీలతో సంబంధాలు, హెర్పిస్ వ్యాధిగ్రస్తులు, రోగనిరోధక శక్తి తగ్గిన వారిలో, తల్లి నుంచి శిశువుకు, జననాంగాల ఇన్‌ఫెక్షన్స్‌ద్వారా వ్యాప్తిచెందును.

**లక్షణాలు :** నోటిలో పొక్కులు, మూత్రవిసర్జనలో నొప్పి, జననాంగాలపై కురుపులు, పొక్కులు, దురద, జ్వరం, లింఫ్‌గ్రంథుల వాపు, తలనొప్పి,నీరసం, ఆకలి లేకపోవడం వంటి లక్షణాలుంటాయి. కళ్లకు వ్యాపించే అవకాశం ఉంటుంది. కళ్లనొప్పి, వాపు, నీరుకారడం, ఇసుక పోసినట్లు నొప్పి ఉండటం జరుగుతుంది.



**నిర్ధారణ :** స్రావకం పరీక్ష, స్వాబ్ శాంపిల్ ఫ్రమ్ ఫ్లూయిడ్, యాంటీబాడీస్ పరీక్షలు, హెచ్ఎస్‌వీ 1, హెచ్ఎస్‌వీ 2 పరీక్షలు వ్యాధి నిర్ధారణలో ఉపయోగపడతాయి.

**చికిత్స :** యాంటీవైరల్ డ్రగ్స్ ఉపయోగిస్తే వ్యాధి అదుపులో ఉంటుంది. వ్యాధి తీవ్రత తగ్గుతుంది. కానీ మందులు వాడుతున్నంత కాలమే అలా ఉంటుంది. మందులు మానేస్తే మళ్లీ మొదటికొస్తుంది. వ్యాధి ఇతర భాగాలకు విస్తరిస్తుంది.

**హోమియో చికిత్స :** ఇతర చికిత్సల కన్నా హోమియో చికిత్స భిన్నమైంది. మూలకారణం తొలగించే విధంగా హోమియో చికిత్స ఉంటుంది. వ్యాధి మూలాలకు చికిత్స అందించడం ద్వారా వ్యాధి సమూలంగా నిర్మూలించబడుతుంది. ఎలాంటి సైడ్‌ఎఫెక్ట్స్ ఉండవు. అనుభవజ్ఞులైన వైద్యుల పర్యవేక్షణలో చికిత్స తీసుకుంటే హెర్పిస్ సమూలంగా దూరమవుతుంది.

## పురుషుల్లో సెక్స్ వైఫల్యం

పెళ్లి తర్వాతే సుఖం అనుకుంటూ హాయిగా శృంగార జీవితం అనుభవించిన వారు అకస్మాత్తుగా వైఫల్యం చెందుతుంటారు. రోజు రెండు, మూడు సార్లు శృంగారంలో పాల్గొనే వారు, ఉన్నట్టుండి వైఫల్యం చెందుతారు. ఈ బాధ ఎవ్వరితో చెప్పుకోలేరు. భార్య నోరు తెరిచి అడగకపోయినా బాధ రోజురోజుకు పెరుగుతుంది.

**కారణం ఏమిటి? :** పెరుగుతున్న నాగరికత, మానసిక సమస్యలు, ఆహార, విహార సమస్యలు, ఉద్యోగంలో ఒత్తిళ్లు, నిద్రలేమి, షుగర్, బీపీ, థైరాయిడ్, స్థూలకాయం వంటివి కారణమవుతాయి. భాగస్వాముల మధ్య మనస్పర్థలు, మానసిక తృప్తి లేకపోవడం, అలసట, చిరాకు, టెస్టోస్టిరాన్ హార్మోన్ లెవెల్స్ తగ్గడం, ఆల్కహాల్, గుట్కాలు వాడటం లివర్ వ్యాధులు కూడా కారణమవుతాయి.

**వ్యాధి ఎలా గుర్తించాలి? :** శారీరక, మానసిక లక్షణాలు, పరీక్షలు ఆధారంగా గుర్తించవచ్చు. పెనైల్ డాప్లర్ స్టడీ, టెస్టోస్టిరాన్ లెవెల్స్ థైరాయిడ్ హార్మోన్స్, రక్తంలో చక్కెర శాతం, ప్రోస్టేట్ పరీక్షలు ఉపకరిస్తాయి.

**హోమియో చికిత్స :** వ్యాధి లక్షణాలను గుర్తించి శారీరక, మానసిక నిర్ధారణ, కౌన్సెలింగ్, ఆహార,విహారాలను సరిచేయుట ద్వారా సమస్యను సరిచేయవచ్చు. కొన్ని నెలల చికిత్సతో సంపూర్ణ శృంగార జీవితం లభిస్తుంది. అనుభవజ్ఞులైన హోమియో వైద్యుని పర్యవేక్షణలో చికిత్స తీసుకుంటే అంగస్తంభన సమస్య తొలగిపోయి శృంగార జీవితంసుఖమయమవుతుంది.



## ఆటో ఇమ్యూన్ డిజార్డర్స్

శరీర కణజాలాన్ని రక్షించేందుకు రక్షణ వ్యవస్థ ఉంటుంది. అది శరీరంలో రక్షణ కవచాన్ని ఏర్పరుస్తుంది. అలాంటి వ్యవస్థలో లోపం వల్ల కొందరి శరీరాల్లో మంచి చెడు తేడా తెలియక సొంత కణజాలాలపై దాడి చేసి నాశనం చేస్తుంది. 'కంచె చేను మేసిన చందంగా తయారవుతుంది'. మారిన జీవనవిధానం, ఆహారపు అలవాట్లు, ఒత్తిళ్ల వల్ల చిన్న వయసులోనే ఈ వ్యాధుల బారినపడుతున్నారు. థైరాయిడ్ సమస్యలు, డయాబెటిస్, రుమటాయిడ్ ఆర్థ్రైటిస్, తెల్లమచ్చలు(విటిలిగో), రక్తహీనత, కండరాలనొప్పులు, స్క్లెరోడెర్మా(చర్మసమస్యలు), ల్యూపస్ ఎరిథెమెటోసిస్, కిడ్నీ సమస్యలు, ఎడిసన్స్ డిసీజ్, పల్మనరీ ఫైబ్రోసిస్, సొరియాసిస్. ఒక వ్యాధితో ఉన్న వారికి రెండవ ఆటో ఇమ్యూన్ డిజార్డర్ వచ్చే అవకాశం ఎక్కువగా ఉంటుంది.

**కారణం ఏమిటి? :** కచ్చితమైన కారణం తెలియదు. కాని కుటుంబంలో ఎవరికైనా ఉంటే ఇతరులకు వచ్చే అవకాశం ఎక్కువగా ఉంటుంది.

లక్షణాలు : నీరసం, జ్వరం, అలసట, తరచూ వచ్చే జ్వరం, నొప్పులు ఉంటాయి. కీళ్లు, కండరాలు, చర్మం, రక్తకణాలు, రక్తనాళాలు, ఎండోక్రైన్ గ్లాండ్స్ ఎక్కువ ప్రభావానికి లోనవుతాయి.

**ఎలా గుర్తించాలి :** ఏఎన్‌ఏ ఎ టైప్ యాంటీ బాడీ పరీక్షలు, ఆటో యాంటీబాడీస్ టెస్టులు, సీ రియాక్టివ్ ప్రొటీన్, సీఆర్‌పీ, ఈఎస్ఆర్ పరీక్షలు ఉపకరిస్తాయి.

**హోమియో చికిత్స :** అత్యంత అనుభవం, నైపుణ్యం ఉన్న వైద్యులు వ్యాధి మూలాలు గుర్తించి చికిత్స అందించడం వల్ల ఫలితం ఉంటుంది. ఇప్పటికే చేయించిన పరీక్షల రిపోర్టులతో వైద్యులను సంప్రదిస్తే పరిశీలించి తగిన చికిత్స అందించవచ్చు. అవసరమైతే తప్ప ఇతర పరీక్షల అవసరం ఉండదు.

**మారుతున్న కాలంతోపాటు మనిషి జీవన యానంలోనూ అనేక మార్పులు చోటు చేసుకున్నాయి. ఇంటా బయటా రకరకాల సమస్యలతో మనిషి ఒత్తిడికి లోనవుతున్నాడు. ఈ ఒత్తిడిని అదుపులో ఉంచుకుంటే అనేక రకాల సమస్యల నుంచి దూరం కావచ్చని ఎన్నో పరిశోధనలు నిరూపించాయి. అందులో భాగంగా సంగీతం వినటం, ప్రకృతి విహారం, యోగా, ధ్యానంవంటివి చేస్తూంటారు చాలామంది. ఒత్తిడిని చిత్తు చేయటానికి చాలాకాలంగా మనం అనుసరిస్తూ వస్తున్న సంప్రదాయ పద్ధతులివి. కానీ చిటికెలో ఒత్తిడిని చిటికెలో మాయం చేసే సరికొత్త స్ట్రెస్ యాంటీడోట్ మార్కెట్లోకొచ్చింది..**

## ఒత్తిడిని వదిలించుకోవడం

# ఇక 'వేళ్ళమీద' విద్యే!

ఒత్తిడిని దూరం చేసుకోవడానికి ఎన్నో మార్గాలున్నాయి. అయితే వాటికోసం ప్రత్యేకంగా సమయం కేటాయించాలి. అలాంటి అవకాశం లేక, ఇటు ఒత్తిడిని దూరం చేసుకోలేక చాలా మంది ఇబ్బంది పడుతున్నారు. కానీ ఆఫీసులో ఉన్నా, బస్సులో ప్రయాణిస్తున్నా వాటిని కొనసాగిస్తూ, బొంగరంలాంటి ఒక వస్తువుని వేళ్లమధ్య పెట్టి తిప్పుతూ మన ఒత్తిడిని మనం దూరం చేసుకోవచ్చు.

### ఫిడ్జెట్ స్పిన్నర్

రెండువేళ్ల మధ్య ఇమిడిపోయే ఓ చిన్న ఆట వస్తువులాంటిదే ఈ 'ఫిడ్జెట్ స్పిన్నర్'. దీన్ని ట్రై స్పిన్నర్ అని కూడా అంటారు. మూడురెక్కలతో ఉండే ఈ పరికరం మధ్యలో బేస్ పట్టుకుని గిర గిరా తిప్పితే మనలో ఒత్తిడి దూరమవుతుంది. ఈవస్తువుకి ఇప్పుడు దేశవిదేశాల్లో బాగా డిమాండ్ ఉంది. పెద్ద పెద్ద సెలబ్రిటీల నుంచి సామాన్యుడి వరకు దీన్ని ఉపయోగిస్తున్నారు, ఒత్తిడిని దూరం చేసుకుంటున్నారు. అంటే ఒత్తిడిని పారద్రోలడం ఇక 'వేళ్ళమీద' విద్యేనన్నమాట.

### ఇదీ దీని చరిత్ర

'ఫిడ్జెట్ స్పిన్నర్' వేళ్ల మధ్య ఇమిడిపోతుంది. మనం చేయాల్సిందల్లా దీన్ని బొటనవేలు, చూపుడువేలు మధ్య పట్టుకుని వేగంగా తిప్పుతూ ఈ గాడ్జెట్‌వైపు ఏకాగ్రతగా చూడటమే. గుండ్రంగా తిరిగే ఈ ఫిడ్జెట్ స్పిన్నర్‌ను చూస్తుంటే మనసులోని ఒత్తిడి మటుమాయమై, ఆహ్లాదకరమైన భావన కలుగుతోందని ప్రపంచవ్యాప్త యూజర్ల రివ్యూలు చెబుతున్నాయి. దీన్ని ఆపరేట్ చేసే విధానం, ప్రయోజనాలపై యూట్యూబ్‌లో లెక్కలేనన్ని వీడియోలు కూడా వచ్చాయి. ఇంత ప్రసిద్ధి పొందిన ఈ ఫిడ్జెట్ స్పిన్నర్‌ను ఎప్పుడో కనుగొన్నప్పటికీ, ఈ మధ్యే ప్రచారంలోకి వచ్చింది.

ఈ గాడ్జెట్ రూపకర్త కేథరిన్ హెట్టింజర్. 1993లోనే దీన్ని డిజైన్ చేశారు. దీని పేటెంట్ హక్కులు దాదాపు ఎనిమిది సంవత్సరాలపాటు ఆమె పేరిటే ఉన్నాయి. ఆ తర్వాత 400 డాలర్ల రెన్యువల్ ఫీజు కట్టే స్తోమత ఆమెకు లేకపోవడంతో 2006 నుంచి ఆమె దానిపై హక్కులు వదిలేసుకుంది. పేటెంట్ హక్కులు ముగిసిన తర్వాత ఇది మార్కెట్లో హిట్ అయింది.

ఫిడ్జెట్ స్పిన్నర్ రూపకల్పన వెనక బలమైన కారణమే ఉంది. కేథరిన్ హెట్టింజర్ ఒకసారి తన చెల్లెల్ని చూసేందుకు ఇజ్రాయెల్ వెళ్ళింది. అక్కడ పోలీసు అధికారులు, సాధారణ ప్రజలపై కొంతమంది ఆకతాయి కుర్రవాళ్లు రాళ్లు రువ్వుతున్నారు. ఈ సంగతి స్థానికుల ద్వారా ఆమె తెలుసుకుంది. అయితే వాళ్ళ ప్రవర్తనకు కారణాలేమిటో ఆమె గుర్తించింది. వారిలో కలుగుతున్న ఒత్తిడే ఈ రకంగా ప్రవర్తించడానికి మూలం అని తెలుసుకుంది. అందుకోసం ఆ కుర్రాళ్లలో ఉన్న ఒత్తిడిని చిత్తు చేయడానికి ఓ పరికరం తయారు చేసింది. అదే ఫిడ్జెట్ స్పిన్నర్. దానిని వేళ్ళమధ్య పెట్టి గిరగిర తిప్పినప్పుడు వాళ్లలో మార్పు కనిపించింది. వాళ్ళ ధ్యాస దానిపైకే మళ్ళింది. అలా తయారుచేసిన ఆ పరికరం ఆదరణకు నోచుకోలేదు కానీ ఇప్పుడు ప్రపంచాన్ని ఆకర్షిస్తోంది.

### మైండ్ రిలాక్స్

ఒత్తిడి, ఆందోళనతో బాధపడుతున్న వారు ఈ ఫిడ్జెట్ స్పిన్నర్ గిరగిర తిరిగేటప్పుడు దానివైపే చూస్తే ఉపశమనం లభిస్తుంది. చాలామంది అనుభవపూర్వకంగా ఇదే చెబుతున్నారు. అయితే పరిశోధనాత్మకంగా దీన్ని వెల్లడించలేదు. మనలో చాలామంది ఎప్పుడైనా ఒత్తిడిలో ఉన్నప్పుడు వేళ్ళను జుట్టులో జొనిపి రుద్దుకోవడమో లేక పెన్ను చేత్తో పట్టుకుని తిప్పుతుండడమో చేస్తుంటారు. దానివల్ల ఒత్తిడి దూరమవుతుంది. ఫిడ్జెట్ స్పిన్నర్ కూడా అలాంటిదే.

ఆ వస్తువుని వేళ్ళమధ్య పెట్టి గట్టిగా తిప్పుతూ దానివైపే చూస్తాం కాబట్టి మన మనస్సు కాసేపు సమస్య నుంచి డైవర్ట్ అవుతుంది. ఈ కొద్దిపాటి సమయంలోనే మైండ్ రిలాక్స్ అవుతుంది. ఇలా కాస్త సమయమైనా ఆలోచనాదృష్టి మరలుతుంది



కాబట్టి ఒత్తిడి మాయమవుతుంది.

### ఇంకా ఎన్నో...

కేవలం ఫిడ్జెట్ స్పిన్నర్ మాత్రమే కాదు. ఒత్తిడిని దూరం చేసుకోవడానికి అనేక రకాల వస్తువులు మార్కెట్లో ఇంకా చాలానే ఉన్నాయి. అవేంటో తెలుసుకోండి!

### డ్రీమ్ ఇన్ హెడ్

అలసిన శరీరానికి మసాజ్ మంచి పరిష్కారమైతే అలసిన మెదడుకు మంచి పరిష్కారం ఈ డ్రీమ్ ఇన్ హెడ్. మన మెదడు అలసిపోతే, ఏమీ ఆలోచించకుండా కాసేపు ప్రశాంతంగా నిద్రపోతాం. లేదంటే నచ్చిన సంగీతం వింటూ మెదడుకు విశ్రాంతినిస్తాం. కానీ కొన్ని సందర్భాల్లో ఇలాంటి వాటికి అవకాశం ఉండకపోవచ్చు. మరి అలాంటి సందర్భాల్లో మైండ్ రిలాక్సయి, ఒత్తిడి దూరం కావాలంటే ఎలా? అందుకోసమే ఈ డ్రీమ్ ఇన్ హెడ్. 32 బటన్స్ అమర్చిన ఈ పరికరం టోపీలా తలకు ధరించాలి. మెత్తటి బాల్స్‌లా ఉండే ఆ బటన్స్ మన పుర్రెభాగాన్ని సున్నితంగా మర్దన చేస్తాయి. ఈ పరికరం పై భాగాన ఉండే రోలర్‌తో గుండ్రంగా తిప్పుతూ ఉండాలి. ఇలా చేయడం ద్వారా రక్తప్రసరణ మెరుగుపడి మెదడు పనితీరు వేగం పుంజుకుంటుంది. ఫలితంగా ఒత్తిడి మటుమాయమవుతుంది.

### షోల్డర్ మసాజర్

ఉదయం నుంచి సాయంత్రం వరకు పనిచేసి అలసిపోయేవారికి ఆ పనితాలూకు ఒత్తిడి భుజాల పైనా, మెడపైనా ప్రభావం చూపిస్తుంది. ఆ ఒత్తిడి తాలూకు నొప్పులు తగ్గడానికి మెడ మీద, భుజాల మీద సున్నితంగా మసాజ్ చేయించుకుని చూడండి. ఎంత రిలీఫ్ ఫీలవుతారో. కానీ అన్ని సమయాల్లో మసాజ్ చేయించుకోవడం కుదరదు కదా! అలాంటి సందర్భాల్లో ఉపయోగపడేదే ఈ పరికరం. జిక్రాపల్స్ అని పిలిచే బెల్ట్ లాంటి ఈ పరికరాన్ని భుజాలు, మెడ మీదుగా ధరిస్తే చాలు. మృదువుగా మసాజ్ చేసి హాయికి అర్థమేంటో అనుభవించేలా చేస్తుంది. ఇందులో ఉండే సెన్సార్లు ఒత్తిడిని తగ్గిస్తాయి. ఇంట్లో, ఆఫీసులో, డ్రైవింగ్ సమయంలో ఎప్పుడైనా, ఎక్కడైనా ఈ వైర్‌లెస్ పరికరాన్ని వేసుకోవచ్చు.



### బ్యాన్ చేశారు

ఒత్తిడిని దూరం చేసే వస్తువును బ్యాన్ చేయడం దేనికి? అనుకుంటున్నారా. కొన్ని దేశాల్లోని పాఠశాలల్లో ఫిడ్జెట్ స్పిన్నర్‌ను నిషేధించారు. అక్కడి విద్యార్థులు దీనితో ఆడుతూ చదువును నిర్లక్ష్యం చేస్తున్నారనేది అక్కడి వారి వాదన. పిల్లల్ని ఇదొక ఆటవస్తువులా ఆకర్షిస్తోంది.

## బన్నీ చేతిలో ఆ వస్తువు ఏంటంటే ?



'అ..ఆ' సినిమాలో అనసూయగా నటించిన సమంత చేతిలో బాల్ పట్టుకుని ఒత్తిడిని దూరం చేసుకోవడానికి ప్రయత్నించింది గుర్తుందా? ఇప్పుడా బాల్ ఆట కూడా ముగిసిపోయినట్టుంది. అల్లు అర్జున్ తాజా చిత్రం 'డీజే: దువ్వాడ జగన్నాథమ్' సినిమా ప్రమోషన్ కార్యక్రమాల్లో బన్నీ చేతిలో ఈ వస్తువు కనిపించింది. ఆడియో వేడుకలో ఆయన ఈ వస్తువుతో ఆడుకుంటూ కనిపించారు. 'సీటీమార్.....' పాట ట్రైలర్‌లోనూ, బన్నీ పాల్గొన్న యూట్యూబ్ లైవ్‌లోనూ ఆయన అదే వస్తువుతో ఆడుకుంటూ కనిపించారు. ఆ సినిమా షూటింగ్ సెట్స్‌లో కూడా బన్నీ చేతిలో ఉన్న ఈ వస్తువు అందరినీ ఆకర్షించింది. టెన్షన్‌ను పోగొట్టుకోవడానికే బన్నీ ఆ వస్తువును ఉపయోగించాడు. దానిపేరే ఫిడ్జెట్ స్పిన్నర్. నిన్న మొన్నటి దాకా విదేశాల్లో హల్ చల్ చేసిన ఈ వస్తువు ఇప్పుడు మన దగ్గర కూడా ఫేమస్ అయిపోయింది.

### థెరప్యూటిక్ మ్యాట్

ఈరోజుల్లో స్కూటర్లు, కార్లు లేని వారు చాలా తక్కువ. ఎక్కడికెళ్లాలన్నా వాహనం తప్పనిసరి. నడిచి వెళ్లే వారు చాలా తక్కువ మంది. చివరకి దగ్గర్లోని దుకాణానికి కూడా టూవీలర్‌మీదే వెళ్తొస్తారు. ఒకవేళ నడిచి వెళ్ళినా తప్పనిసరిగా చెప్పులు ధరిస్తారు. కానీ చెప్పులు లేకుండా నడవడంవల్ల కాలికి రక్తప్రసరణ మెరుగుపడుతుందని, పాదాల ఒత్తిడి దూరమవుతుందని మీకు తెలుసా? ఈసారి మీరు పార్క్‌కు వెళ్లినప్పుడు చెప్పులు లేకుండా గడ్డిలో నడిచి చూడండి మీకే తెలుస్తుంది. పార్క్‌కి వెళ్లే అవకాశం లేకుంటే ఎలా అనుకుంటున్నారా అందుకోసమే ఈ థెరప్యూటిక్ మ్యాట్. పచ్చిగడ్డి మీద నిలబడితే కాళ్లకు ఎలా గుచ్చుకుంటుందో ఈ మ్యాట్ కూడా అలాగే గుచ్చుకుంటుంది. దీని మీద నిలబడడం వల్ల పాదాలకింద చర్మం ఉత్తేజితమై ఒత్తిడి తగ్గిపోతుంది. ఉద్యోగుల ఒత్తిడి తగ్గించడానికి ఇప్పుడిప్పుడే అనేక కార్పొరేట్ ఆఫీసుల్లో ఈ థెరప్యూటిక్ మ్యాట్స్ ఉపయోగిస్తున్నారు.

### యు డిజైన్

రోజంతా కష్టపడి బస్సులమీద, వెహికల్స్‌మీద ప్రయాణం చేసి అలసిపోయిన శరీరానికి ఒక్కసారి ఇంటికి రాగానే అలా కుర్చీలో హాయిగా సాగిలపడి కూర్చుంటే ఎంత హాయిగా ఉంటుందో కదా. కూర్చునేది ఒక పదినిమిషాలైనా రిలాక్స్‌డ్‌గా అనిపిస్తుంది. ఆ సమయంలో ఎవరైనా మనకు మసాజ్ చేస్తే ఇంకెలా ఉంటుంది? 'ఆహహహా...' అనుకుంటున్నారా అయితే ఈ యు డిజైన్ కుర్చీ మీకోసమే. ఒక యాప్ ఆధారంగా ఈ మెత్తటికుర్చీ పనిచేస్తుంది. ఇందులో కూర్చొని శరీరంలో మనకు ఏ భాగంలో మసాజ్ కావాలంటే ఆ పార్ట్‌ని యాప్‌లో సెలక్ట్ చేసుకుంటే చాలు, త్రీడీ టెక్నాలజీతో శరీరాన్ని స్కాన్ చేసి మసాజ్ చేస్తుంది. శరీరం మొత్తానికి మసాజ్ కావాలంటే ఫుల్‌బాడీ బటన్ యాక్టివ్ చేస్తే చాలు. అలసట, ఒత్తిడి చిటికెలో మాయమవుతాయి. నిమిషాల వ్యవధిలోనే నూతన ఉత్సాహంతో మళ్ళీ మనం రెడీ అయిపోతాం.

### సోనా బ్రాస్‌లెట్

బ్రాస్‌లెట్ చాలామంది నిత్యం చేతికి ధరిస్తుంటారు. అలాంటిదే ఇది కూడా. చేతికి బ్రాస్‌లెట్‌లా ధరించే ఈ స్మార్ట్ గ్యాడ్జెట్ చూడడానికి అందంగా కనిపించడమే కాదు, మన ఒత్తిడిని కూడా అంతే స్మార్ట్‌గా తొలగించేస్తుంది. హార్ట్‌రేట్ మానిటరింగ్ టెక్నాలజీతో తయారుచేసిన ఈ బ్రాస్‌లెట్ ఒక యాప్ ఆధారంగా పనిచేస్తుంది. దీన్ని చేతికి ధరించి యాప్‌తో కనెక్ట్ చేసుకోవాలి. అది మీ హృదయస్పందనలు, మూడ్స్ పరిశీలిస్తూ, మనలోని ఒత్తిడి లెవెల్స్‌ను పసిగడుతుంది. ఒత్తిడిని తగ్గించే మెడిటేషన్ లాగే, మనం ఒత్తిడిలో ఉన్నప్పుడు ఎన్నిసార్లు శ్వాస తీసుకుని, వదలాలో చెప్తూ అలర్ట్ చేస్తుంది. ఒత్తిడికి కారణమయ్యే అలవాట్లను తగ్గించుకొమ్మని కూడా సలహాలిస్తుంది ఈ పరికరం.

– సంతోషి దహగాం

# నిగ్గదీసి అడగాలి!

అరిగె రామారావు

మే నెల. మండువేసవికాలం. చింతనిప్పులు చెరిగిపోస్తున్నట్టుంది. ప్రాణికోటి విలవిల్లాడిపోతోంది. సీతమ్మకు గబుక్కున మెలకువ వచ్చింది. ఒళ్ళంతా చెమట్లు దిగజారుతున్నాయి. ఒంటిమీద ఉన్న పాత రవిక చెమటకు తడిసి ముద్దయిపోతోంది. అసలే అది రేకులషెడ్డు ఔట్‌హౌస్. ఈ ఎండలకు గాడిపొయ్యిలా సెగలు పొగలు విరజిమ్ముతోంది. ఆ వేడికి సీతమ్మ ముసలిప్రాణం ఉక్కిరిబిక్కిరైపోతోంది. పైన ఇనుప కమ్మీలకు అమర్చిన పాత డొక్కు సీలింగ్ ఫ్యాన్ ఉండడానికైతే ఉందిగానీ అదెప్పుడు తిరుగుతుందో, ఎప్పుడు ఆగిపోతుందో దానికే తెలియదు. తిరిగినా పిండిమరలాగా డబడబా శబ్దంతప్ప గాలిరాదు, పాడూరాదు. దానికి తగ్గట్టు వచ్చేపోయే కరంటొకటి. కరెంటు పోయినా మెయిన్ బంగళాకు ఇన్వర్టర్ కనెక్షన్ ఉంది. ఏసీలూ, ఫ్యాన్లూ తిరుగుతూనే ఉంటాయి. లైట్లు వెలుగుతూనే ఉంటాయి. సీతమ్మ ఉండే ఈ ఔట్‌హౌస్‌కి మాత్రం ఇన్వర్టర్ కనెక్షన్ లేదు. ఆమాటకొస్తే, ఈ సీతమ్మకూ, ఆ మెయిన్ బంగళాకూ ఏ కనెక్షనూ లేదు. అలాగని బొత్తిగా ఏ కనెక్షనూ లేకుండానూ పోలేదు.



ఉండటానికైతే పెద్ద కనెక్షనే ఉంది. 'పేగు' కనెక్షను. తల్లిపేగు తెంచుకుని పుట్టిన కన్నకొడుకు కనెక్షను! అది ఉంది కాబట్టే, రాజమహల్లాంటి ఆ బంగళాకు దిష్టిబొమ్మలా ఉన్న ఈ పాతరేకుల షెడ్డులో అయినా సీతమ్మ ఉండగలుగుతోంది. సీతమ్మకూ, ఆ బంగళాకూ కాస్తో కూస్తో కనెక్షన్ ఉందంటే అది ఆ బంగళాలో పనిచేసే పనిమనిషి శాయమ్మ ద్వారానే! రెండుపొద్దులా బంగళాలోంచి భోజనం, కాఫీ, టిఫిన్లు తెచ్చిపెడుతుంది. ఆ రేకులషెడ్డును కాస్త చిమ్మిపెడుతుంది. కూజాలో మంచినీళ్ళు తెచ్చిపెడుతుంది. తనకున్న రెండు పాత చీరెలూ, తువ్వాలు గుడ్డనూ సీతమ్మే ఉతుక్కుంటుంది. పాపం, పెద్దామె అనే జాలితో శాయమ్మ గుర్తుపెట్టుకుని ఏదో ఇంత తెస్తే తెచ్చినట్టు, లేకపోతే లేదు. ముసల్ది తిందా లేదా అని, ఆ బంగళాలో మనుషులెవ్వరికీ పట్టదు. వాళ్ళ దృష్టిలో సీతమ్మ ఇంకా విరగడకాని పీడ. ఆ బంగళాకు పట్టిన చీడ.

***

సాయంత్రం ఐదు గంటలు దాటింది. ఎండ తీవ్రత కాస్త తగ్గుముఖం పట్టింది. సీతమ్మ మెల్లగా లేచింది. కూజాలో మంచినీరు వంపుకుని తాగింది. మెల్లగా అడుగులేసుకుంటూ బయటకు వచ్చి గుమ్మంలో నిలబడింది. పశ్చిమ దిక్కుకు మోహరించిన ఎండలో ఆ బంగళా ధగధగలాడిపోతోంది. అన్నట్టు ఈ బంగళాకు ఒక పేరు ఉంది. శ్రీగిరిజానిలయం. తన కోడలు పేరు శ్రీగిరిజ. రాజమహల్లాంటి ఈ బంగళాకి రాణీ లాంటి తన పెళ్ళాం పేరే పెట్టుకున్నాడు తన కొడుకు. పెళ్ళైన తర్వాత తనకు (మామగారి ఆస్తిపాస్తులతో సహా) కలిసివచ్చింది గనక పెళ్ళాం అంటే తగని ప్రేమ. పెళ్ళాన్ని నెత్తిన ఎక్కించుకున్నాడు. మొగుడునెత్తిన ఆడది ఊరికే ఉంటుందా? తైతక్కలాడుతుంది. తనతోపాటు మొగుణ్ణీ ఆడిస్తుంది.

పెళ్ళాం ఆడించినట్టు ఆడుతున్నాడు తన కొడుకు. అందుకే తనని పాత సామాన్లు పడేసే ఈ రేకుల షెడ్డులో పడేశాడు. వీణ్ణి చదివించడానికి తాను ఎన్ని కష్టాలు పడిందో, ఎన్ని అడ్డంకులు ఎదుర్కొందో తనకు తెలుసు, పైనున్న ఆ భగవంతుడికి తెలుసు.

'వీడికి చదువెందుకు, కూలినాలికి పంపక' అని తన ముసలి అత్త ఒక పక్కా, తన మొగుడు కోటయ్య మరో పక్కా తెగ అడ్డంకులు చెప్పేవారు. ఏమైనా సరే, నా కొడుకు చదువుకోవాల్సిందే, ఆడు చేసే ఆ కూలీనాలేదో నేనే చేస్తానని పొలం పనుల కూలీకి తానే వెళ్ళేది. ఈ కొడుకు చదువుసందెల కోసం అష్ట కష్టాలూ పడింది. రెక్కలు ముక్కలు చేసుకుంది. చెమటోడ్చింది. తను అప్పుడు అంత కష్టపడి చదివిస్తే, ఈ రోజు వీడింతవాడయ్యాడు. కుడితినీళ్ళ వెంకటేశ్వర్లు కె.వి.రావుగారయ్యాడు. ఈ బంగళాకి యజమాని అయ్యాడు. ఈ అమ్మను ఈ రేకులషెడ్డులో పడేశాడు. సీతమ్మ దీర్ఘంగా నిట్టూర్చింది. అదొక్కటే తనకు చాతనైంది. పిల్లతెమ్మెరొకటి వచ్చి సీతమ్మను చల్లగా పలకరించి ఓదార్చిపోయింది. కొడుకు బంగళా వంకే చూస్తూ గుమ్మంలో కూలబడింది సీతమ్మ. ఈ రోజు ఎందుకనో మధ్యాహ్నం నుంచీ శ్రీగిరిజా నిలయం సందడి సందడిగా ఉంది. వ్యాన్‌లోంచి ఒకపక్క సామాన్లు దిగుతున్నాయి. మరోపక్క ఇంటిముందు షామియానాలు కడుతున్నారు. కుర్చీలు అమర్చుతున్నారు. మొత్తానికి బంగళాలో ఇవాళేదో ఫంక్షన్ జరగబోతున్నట్టుంది. ఏ ఫంక్షనైనా జరగనీయ్. తనకైతే గొంతులో టీ నీళ్ళు పడక ప్రాణం కొట్టుకులాడుతోంది. రోజూ ఈపాటికల్లా బంగళాలోంచి టీ తీసుకొచ్చే శాయమ్మ ఇవాళ ఎందుకనో ఇంకా రాలేదు. బంగళావైపు దిక్కులు చూస్తూ కూర్చుంది సీతమ్మ. అంతలోనే పమిటచెంగుతో టీ గ్లాసు పట్టుకుని వడివడిగా అడుగులేసుకుంటూ ఇటువైపే వస్తోన్న శాయమ్మ కానవచ్చింది. సీతమ్మకు ప్రాణం లేచివచ్చింది. ఈ శాయమ్మకు నిండా నూరేళ్ళు అనుకుంది. టీ గ్లాసు అందుకుంటూ, "ఇవ్వాళ ఆలీస్సమైందే శాయమ్మా?" అని అడిగింది.

"ఏం చెయ్యమంటావమ్మా. ఇవ్వాళ బంగళాలో ఏవో వేడుకలున్నాయంట. పొద్దుట నుండీ మీ కోడలమ్మ ఊపిరి సలుపుకోనీయకుండా ఏదో ఒక పని చెబుతూనే ఉంది. అక్కడకీ మామ్మగారికి టీ ఇచ్చి వస్తానమ్మా అని నేనే అన్నాను. ఒక్కపూట టీ తాగక పోతే మీ మామ్మగారికేం కాదులే అని నా మీద కసురుకుంది."

"ఇంతకీ ఈ రోజు మీ అమ్మగారు చేసే వేడుకలు ఏంటంట?" ఊదుకుని టీ తాగుతూ అడిగింది. "ఆ వేడుకలేంటో, ఆ సంగతులేంటో పనోళ్ళం మాకేం తెలుస్తాయమ్మా? వస్తానమ్మా ఆలిస్సెం అయితే మీ కోడలమ్మ చిందులూ గంతులూ వేస్తుంది". ఎంత హడావుడిగా వచ్చిందో అంత హడావుడిగా వెళ్ళిపోయింది శాయమ్మ. తనెక్కడ బాధపడిపోతానో అని ఈ శాయమ్మ మాటమార్చి తనకు చెప్పిందిగానీ, 'ఒక్కపూట టీ తాగకపోతే ముసల్ది మరేం చావదులే. మొండిఘటం. అంత తేలిగ్గా చచ్చేరకం కాదు' అని ఈసడించుకుని ఉంటుంది. ఈ మాటే కోడలు తన మొఖాన ఎన్నోసార్లు అనగాలేనిది, పనోళ్ళ దగ్గర అనదా? దానికి జంకూ బెదురేముంది? దాని నోటికి హద్దూ, ఆపూ ఉంటేగా? ఇదంతా తన కొడుకు ఇచ్చిన అలుసు! నిజమే. తన కోడలు అన్నట్టు తనంత తేలిగ్గా చచ్చేరకం కాదు. అట్టా చచ్చేదైతే ఎప్పుడో చచ్చి ఉండేది. రోజూ రాత్రుళ్ళు పూటుగా తాగొచ్చిన కొడుకుతో తనమీద ఉన్నవీ లేనివీ కల్పించి చాడీలు చెప్పేది తన అత్త. దాంతో తన మొగుడు రెచ్చిపోయి చావుదెబ్బలు కొట్టేవాడు. ఆ చావుదెబ్బలకు ఎప్పుడో చచ్చివుండేది. తన కొడుకు కోసం, ఇదిగో ఈ కె.వి.రావుగారికోసం అన్నింటినీ సహించింది. ఆ బాధలన్నీ భరించింది. సీతమ్మ భర్త కోటయ్య తాగుడు కోసం తన వ్యసనాల కోసం ఇంటిమీద అప్పులు చేసి అర్ధంతరంగా చనిపోయాడు. ఉన్న ఆ ఒక్క కొంపనీ అప్పులోళ్ళు బలవంతంగా స్వాధీనం చేసుకున్నారు. ఆడ కూతురని కూడా చూడకుండా తనని రోడ్డుమీకు ఈడ్చిపారేశారు. మరేదిక్కూలేని ఆ పరిస్థితుల్లో ఆ అవమానంతో, ఎప్పుడో చనిపోయి ఉండేది. ఇదిగో ఈ కొడుకు కోసం గుండెరాయి చేసుకుని బతికింది. తన కోడలు అన్నట్టు తను మొండిఘటం.

ఆ రోజు దిక్కుతోచక నడిబజార్లో సామాన్లు పెట్టుకుని తాను ఏడుస్తుంటే, తన కన్నీరు తుడుస్తూ, 'ఏడవకమ్మా, నేను బాగా చదువుకుని పెద్దోణ్ణి అయ్యాక పెద్ద బంగళా కట్టించి నిన్ను అందులో ఉంచి సుఖపెడతాను' అన్నాడు ఈ పుత్రరత్నం! ఆ మాటలకు తానెంతో పొంగిపోయింది. "మా తండ్రే, మా నాయనే, మా బంగారమే!" అంటూ ముద్దులు పెట్టుకుంది. ఈ కొడుకు కోసమే సడలిపోయిన ధైర్యాన్ని ఆ రోజు కూడగట్టుకుంది. నడుం బిగించి ఊరుబయట బైరాగులసత్రం పక్కనున్న ఖాళీస్థలంలో పాక వేసుకుంది. మగరాయుడులా కాయకష్టంచేసి చెమటోడ్చి తన కొడుకును ఇదిగో ఈ కేవీ రావుగారిని పట్నంలో కాలేజీ చదువులు చదివించింది. ఆ రోజు నడిరోడ్డుమీద తన కన్నీరు తుడిచిన కొడుకు ఈరోజు తనవంక కన్నెత్తికూడా చూడటం లేదు. అప్పుడన్ని కబుర్లు చెప్పినోడు, ఇప్పుడు ఏనాడూ నోరు తెరచి, 'అమ్మా' అని పలకరించిన పాపాన పోలేదు. ఆరోజు అన్నట్టుగా పెద్ద బంగళా అయితే కట్టించాడు గానీ, అందులోంచి ఈ అమ్మను ఈ రేకుల షెడ్డులోకి గెంటేశాడు. పెళ్ళాం వచ్చేసరికి అమ్మ చేదైపోయింది.

సీతమ్మ గాఢంగా నిట్టూర్చింది. పమిటచెంగుతో చెమర్చిన కళ్ళు ఒత్తుకుంటూ బంగళావైపు చూసింది.

నలుదిక్కులా అమర్చిన ఫ్లడ్‌లైట్ల కాంతిలో శ్రీ గిరిజానిలయం దేదీప్యమానంగా వెలిగిపోతోంది. పోర్టికో ముందు కట్టిన షామియానాలకు రంగురంగుల దీపాల తోరణాలు వేలాడుతున్నాయి. సౌండ్ సిస్టమ్ లోంచి సినిమా పాటలు వినిపిస్తున్నాయి. బంగళా అంతా సందడి సందడిగా ఉంది. ఈ సందడంతా శాయమ్మ చెప్పిన ఫంక్షన్ హడావుడేమో అనుకుంది. ఏం ఫంక్షనో ఏంటో తనకైతే నడుంనొప్పి మొదలైంది. అట్టేసేపు గుమ్మంలో కూర్చోలేకపోయింది. మెల్లగా లేచి షెడ్డులోపలికెళ్ళింది. బంగళా దీపాలకాంతి షెడ్డంతా వ్యాపించి పట్టపగలు లాగా ఉంది. లైటు స్విచ్ నొక్కబోయి కూడా ఆగిపోయింది. తలుపు రెక్కలు వారగా వేసి, తన మంచంమీద నడుం వాల్చింది. బంగళాలోంచి సినిమా పాటలు ఆగకుండా వినిపిస్తున్నాయి. అన్నీ పాత సినిమా పాటలే. ఎందుకనో అన్నీ 'అమ్మల' మీద పాడిన పాటలే; ఆ రోజుల్లో తాను విన్నవే! 'అమ్మా అని పిలచినా ఆదరించవేమమ్మా....ఆవేదన తీరురోజు ఈ జన్మకు లేదా...' అంటూ ఒక కొడుకు దీనంగా విలపిస్తున్న పాట.

"నీవు 'అమ్మా' అని ప్రేమగా పిలిస్తే నేను ఎందుకు పలకనురా కొడుకా! నీవు పిలిచిందెప్పుడు, నేను పలకనిదెప్పుడు...."తన కొడుకును గురించి అనుకుంది. సీతమ్మ ఆలోచనలు మళ్ళీ గతంలోకి మళ్ళాయి.

ఆ రోజుల్లో తన ముసలిఅత్త రోగంతో మంచంలో తీసుకుంటూ కూడా తనమీద అత్తగారి పెత్తనం చెలాయించేది. తనభర్త కోటయ్య తల్లిమాట జవదాటేవాడు కాదు. అమ్మ ఏట్లో దూకమన్నా దూకేరకం, కాట్లో కాలిపోరా కొడుకా అన్నా కాలిపోవడానికి సిద్ధమైపోయేరకం! అమ్మ అంటే ప్రాణం పెట్టేవాడు. తల్లిమీద ఈగ వాలనిచ్చేవాడు కాదు.

రాత్రుళ్ళు తాగి తూలుతూ ఇంటికి వస్తూ అంత మత్తులో కూడా గుర్తుపెట్టుకుని తల్లికి ఇష్టమని బెల్లం జిలేబీలూ, కారప్పూస పొట్లాలూ తెచ్చేవాడు. అంతరాత్రప్పుడు తల్లిని నిద్రలేపి కూర్చోబెట్టి తను తెచ్చిన చిరుతిళ్ళు తినిపించేవాడు. ఆ రోజుల్లో కటిక దరిద్రం అనుభవిస్తూ కూడా తల్లిని ప్రేమగా చూసుకునేవాడు తన భర్త. ఇప్పుడు తన కొడుకు సుఖసంపదలు అనుభవిస్తూ కూడా తల్లి అంటే నిరాదరణ చూపిస్తున్నాడు. ఆ రోజుల్లో జరిగిన ఒక సంఘటన సీతమ్మకు కళ్ళకు కట్టినట్టు గుర్తుకు వచ్చింది. రోజూ బయట చిరుతిళ్ళు తీసుకువచ్చి తల్లికి ప్రేమగా తినిపించడం చూసీచూసీ ఉండబట్టలేక ఒక రోజు "నీ ప్రేమంతా అమ్మమీదే చూపించమాకు. ఇంట్లో చిన్నపిల్లాడు నీ కన్న



కొడుకు కూడా ఉన్నాడు. కూస్తంత పిల్లాడిమీద కూడా చూపించు" అంది. "కన్నకొడుకైనా, కట్టుకున్న పెళ్ళామైనా మా అమ్మ తర్వాతే! అదెవరనుకుంటు న్నావే, మా అమ్మే, నన్ను కన్నతల్లే. నా దేవతే!" అంటూ గుండెలు బాదుకునేవాడు.

ఆ మాటలకు తనకు మండిపోయేది. "మరీ అంత గుండెలు బాదుకోమాకయ్యో! తల్లిమీద అంత ప్రేమ కారిపోతున్నవాడివి, ఏనాడైనా శేరు బియ్యం, గిద్దెడు కందిపప్పూ తెచ్చావా? నేను పొలం పనులకు కూలికిపోయి రెక్కలు ముక్కలు చేసుకుని కూలిడబ్బులు తెస్తేగానీ కూటికి గడవదు. కొంప నడవదు. ఓc తెగ కబుర్లు చెబుతున్నావ్, సేతగాని కబుర్లు" అంది. తాను అన్నదానికి మొగుడికి రోషం పొడుచుకువచ్చింది. "అంత కూటికి లేకపోతే, ఊళ్ళో నాలుగిళ్ళల్లో బిచ్చమెత్తుకొచ్చి మా అమ్మను పోషిస్తానే పుస్కీ! నాకంత సేతగానిరోజున మా అమ్మ కోసం నేనేదైనా చేస్తానే!" అంటూ మళ్ళీ గుండెలు బాదుకున్నాడు. కొడుకు అన్న ఆ మాటలకు తన అత్త తెగ ఆనందపడిపోయింది. "సెబాసురా కొడకా! దీనికి బుద్ధి వచ్చేట్టు మా గొప్పమాట అన్నావురా బిడ్డా. నా బంగారుకొండా!" ప్రేమగా మెటికలు విరుచుకుంది.

తల్లీకొడుకుల కబుర్లకు తనకు తిక్కరేగింది. "కొడుకొక బంగారం. అమ్మొక బంగారం! లోకంలో ఎవ్వరికీ అమ్మలేనట్టు, నీ కొక్కడికే ఉన్నట్టు తెగ కబుర్లు చెబుతున్నావు. ఉందిలే మా లావు అమ్మ!" అంది. ఆ మాటకు ముసల్ది తనమీద కస్సుమని లేచింది. "ఏంటే కూశావ్! నేను మా లావు అమ్మనేనే! ఆడు నా కొడుకే. నేను తొమ్మిది నెల్లూ మోసి కనిపెంచిన కొడుకే ఆడు! ఆడి మీద నాకు సర్వహక్కులూ ఉన్నాయే బోసిడీ! నా కొడుకును నేను నాలుగురోడ్ల సెంటర్‌లో నిలబెట్టి వేలం వేసుకుని తింటానే. ఆడి మీద నాకంత హక్కుందే! ఎవరు కాదంటారో నా దగ్గరకొచ్చి అనమను. మద్దెలో వచ్చినదానివి నీవెవత్తివే బోసిడీ!" అంటూ రెచ్చిపోయింది.

తన అత్త అన్నమాటలకు తనకు కాలిపోయింది. "నీ కొడుకు నెత్తిమీద కాణీ పెట్టి అమ్మినా, ఏగాణీ క్యూడా ఎవ్వరూ కొనరు. అమ్మాకొడుకుల మాటలు కోటలు దాటుతున్నాయి. రేపటి నుంచీ నేను కూలికి వెళ్ళను. నేనూ ఇంట్లో కూచుంటాను. అమ్మా కొడుకులు బువ్వ ఎట్టా తింటారో తినండి. అదీ చూస్తాను" అంది.

"దీనికీమద్దె నోరు మా లేస్తోందిరా. నాలుగు తగిలించరా కోటయ్యా!" అంటూ కొడుక్కి ఎక్కేసింది ముసల్ది.

అమ్మ అంటమే తడవుగా తన మొగుడు తనని గొడ్డును బాదినట్టు బాదాడు. నోటికి వచ్చినట్టు బండ బూతులు తిట్టాడు. ఆ దెబ్బలూ, ఆ తిట్లూ ఇదిగో ఈ కొడుకు కోసం భరించింది. లేకపోతే ఏనాడో ఊరు చెరువులో పడి చచ్చివుండేది. తన కోడలు అన్నట్టు తను మొండిఘటం! ఆ రోజుల్లో ఆ తల్లీ కొడుకులు అట్టా సాగించుకున్నారు. మింగ మెతుకు లేకపోయినా ఒకళ్ళకోసం ఒకళ్ళు మాటవరసకైనా అట్టా పెతిగ్నెలు చేసుకున్నారు. ఆ రోజుల్లో ఆ అమ్మా కొడుకుల ప్రేమలు అట్టా ఉండేవి! ఆ రోజు వాళ్ళనాన్న అన్నట్టు, ఈ అమ్మను గురించి తన కొడుకు ఈ కేవీరావుగారు తనపెళ్ళాం ముందు అనగలడా? వాడిదాకా ఎందుకు, ఆ రోజు తన అత్త అన్నట్టు, 'నా కొడుకును నేను వేలం వేసి అమ్ముకుని తింటానే!' అని తన కోడలు ముందు తాను అనగలదా? అట్టా అనగలిగితే, తనకి ఈ రేకుల షెడ్డులో ఉండే కర్మ ఎందుకు పడుతుంది?

(ఆ మాటకొస్తే, ఈ రోజుల్లో ఏ తల్లీకొడుకులైనా అట్లా మాట్లాడగలిగితే ఈ వృద్ధాశ్రమాలు ఎందుకిట్లా తామరతంపరగా వృద్ధిచెందుతాయి?)

***

సీతమ్మకి ఎప్పుడు పట్టిందోగానీ మాగన్నుగా నిదరపట్టింది. మెలకువవచ్చి చూసేసరికి బంగళాలో సందడంతా సద్దుమణిగింది. ఎవరొచ్చి పెట్టిపోయారో బల్లమీద అన్నం పళ్ళెం కనిపిస్తోంది. మెల్లగా లేచి గుమ్మంలోకెళ్ళింది. లైట్లు వెలుగుతూనే ఉన్నాయి. ఖాళీకుర్చీలతో షామియానా బోసిగా కనిపిస్తోంది. వేడుకలన్నీ అయిపోయి ఉంటాయి అనుకుంది. సెల్‌ఫోన్‌లో మాట్లాడుతూ లాన్‌లో ఎవరో అటూ ఇటూ తిరుగుతున్నారు.

కళ్ళల్లోకి కొడుతున్న లైట్ల వెలుగుకి చెయ్యి వారగా పెట్టుకుని చూసింది సీతమ్మ. ఫోన్లో మాట్లాడుతున్నది ఎవరో కాదు, తన చిన్న మనవడు బబ్లూ. పదకొండేళ్ళవాడు. కల్లాకపటం తెలియని పసివాడు. ముగ్గురు ఆడబొందల తర్వాత పుట్టిన మగపిల్లాడని వాళ్ళమ్మా నాన్నలకు వీడంటే తగని ప్రేమ. నోరు తెరిస్తే ఇంగ్లీషుతప్ప తెలుగులో మాట్లాడడు. స్నేహితులతో లాన్‌లో ఆడుకుంటున్నప్పుడు బంతి ఎప్పుడన్నా షెడ్డువైపు పడ్డప్పుడు ఇటు వస్తాడు. తనని చూచి ఇంగ్లీషులో 'హేcయ్ గ్రాండ్‌మా, హౌ ఆర్ యు!' అని పలకరిస్తాడు. ఆ ఇంట్లో ఆ మాత్రమైనా తనని పలకరించేది వీడొక్కడే. బంగారుతండ్రి. గుమ్మంలో నిలబడివున్న తనని చూచి ఇటేపు వచ్చాడు. తన మామూలు ఇంగ్లీషు పలకరింపు పలకరించాడు. "బాగున్నావా తండ్రీ! ఇప్పుడు బంగళాలో ఏదో ఫంక్షన్ ఉందట. అయిపోయిందా. బాగా జరిగిందా బాబూ!" అంది. ఫంక్షన్ పేరు ఎత్తగానే బబ్లూకి ఎక్కడలేని హుషారూ వచ్చింది. మాట్లాడుతున్న ఫోన్ కట్ చేసిమరీ, దాన్ని గురించి చెప్పసాగాడు. బబ్లూ చెప్పినదాని సారాంశం ఇది.

**ఆ బంగళా ఔట్‌హౌస్ రేకులషెడ్డులో అనాథలా పడిఉందామె. వేళకు కాస్తంత తిండి తెచ్చి ఇస్తుంది పనిమనిషి. ఆమెతప్ప మరెవరూ ఆ షెడ్డులోకి తొంగిచూడరు. ఎన్నడూలేనిది బంగళా చాలా సందడిగా ఉంది. షామియానాలు కడుతున్నారు. లైటింగ్ అమర్చుతున్నారు. ఆ హడావుడేమిటో తెలియలేదు ఆమెకు. ఇంతకీ ఆ బంగళాకూ ఆమెకూ ఏమిటి కనెక్షను? ఆ హడావుడి అంతా ఆమెకోసమా? లేక ఆమెలాంటి వాళ్ళకోసమా?**

అమెరికాలో ఉంటున్న వాళ్ళ పెద్దక్క రజితక్క, వాళ్ల మమ్మీకోసం పెద్ద కేక్, పూలదండ, హై మేకప్ కిట్ పంపించింది. రెండో అక్క సబితక్క బెంగళూరు నుంచి మరో పూలదండ, బొకే, కేక్ పంపించింది. కాలేజీ హాస్టల్‌లో ఉంటున్న లాస్ట్ సిస్టర్ విజిత మధ్యాహ్నమే తన ఫ్రెండ్స్‌ని వెంటబెట్టుకుని వచ్చింది. మమ్మీకి డాడూస్ స్వీట్స్ గిఫ్ట్ బాక్స్ తెచ్చింది. మమ్మీని పేద్ద కుర్చీలో కూర్చోబెట్టి పూలదండ వేసి బొకే ఇచ్చి మమ్మీచేత కేక్స్ కట్ చేయించారు. ఫొటోలూ, వీడియోలూ తీశారు. విజిత సిస్టర్, వాళ్ళ ఫ్రెండ్సూ డ్యాన్సులు చేసి పాటలు పాడారు. వాళ్ళడాడీ వచ్చిన అతిథులందరికీ గ్రాండ్‌గా నాన్ వెజ్ డిన్నర్ పార్టీ ఇచ్చాడు.

"మరి నీవు మీ మమ్మీకి ఏం ఇచ్చావు బబ్లూ?" సీతమ్మ మనవణ్ణి అడిగింది. "ఓ ఇట్సే సర్‌ప్రైజ్ గిఫ్ట్...కలర్స్‌తో మమ్మీ బొమ్మను డ్రా చేసి 'ఐ లవ్ యు సో మచ్ మమ్మీ!' అని రాసి గిఫ్ట్‌గా ఇచ్చా. నా పాకెట్‌మనీ సేవింగ్స్ లోంచి మమ్మీకి ఒక బ్యూటిఫుల్ రిస్ట్‌వాచ్ కొని ఇచ్చాను. మమ్మీ నన్ను హగ్ చేసుకుని ముద్దులతో ముంచేసింది. ఇట్స్ ఏ బిగ్ ఫన్. ఉయ్ ఎంజాయ్డ్ ఎ లాట్" హుషారుగా చెప్పుకుపోతున్నాడు.

"ఇంతకీ ఈ రోజు మీ మమ్మీ పుట్టినరోజా బబ్లూ" అంది. "నో గ్రాండ్‌మా! టుడే మదర్స్ డే!"

"అంటే ఏంటి? నాక్కాస్త అర్థమయ్యేట్టు తెలుగులో చెప్పరా తండ్రీ!" అంది.

నీకీమాత్రం తెలియదా అన్నట్టు చూశాడు బబ్లూ గ్రాండ్‌మా వంక. "ఓ గ్రాండ్‌మా! యు డోంట్ నో వాట్ మదర్స్ డే మీన్? ఇట్స్ ఏన్ ఇంటర్నేషనల్ ఈవెంట్. అంటే ఈ రోజు వరల్డ్‌లో ఈ ప్రపంచంలో ఉన్న మదర్స్‌ని వాళ్ళ చిల్డ్రన్....ఆ



మమ్మీల పిల్లలు, మేం మా మమ్మీకి ఎలా ఫంక్షన్ చేశామో అట్లా దండలేసి, కేక్స్ కట్ చేయించి, గిఫ్టులిచ్చి హగ్ చేసి అంటే ప్రేమగా కౌగలించుకుని ముద్దులు పెట్టుకుంటారన్నమాట!" ఒక చిన్న పాపకు చెప్పి నట్టు వివరించి చెప్పాడు. "మరి మీ డాడీకి నేను ఏమవుతాను బబ్లూ?" మనవడి వంక కొంచెం కొంటెగా చూస్తూ అడిగింది. బబ్లూ కొంచెం బిత్తర పోయాడు. "ఏమవుతావ్ గ్రాండ్‌మా అవుతావు"

"అది నీకురా బాబూ! మీ డాడీకి నేను ఏమవు తాను?" బబ్లూ పబ్లిక్ స్కూల్ బుర్రకి అది కొంచెం చిక్కుప్రశ్నే! ఆ బుర్రనే గోక్కుంటూ "ఓ నువ్వు కూడా మా డాడీకి మదర్ అవుతావు కదూ" అన్నాడు. అప్పటికిగానీ బబ్లూకి అసలు పాయింట్ అర్థం కాలేదు. చకచకా శ్రీగిరిజానిలయంవైపు వెళ్ళాడు.

"డాడీ, టుడే ఇంటర్నేషనల్ మదర్స్ డే కదా! అవుట్‌హౌస్‌లో ఉంటున్న గ్రాండ్‌మా నీకు మదర్ అవుతుంది కదా! మేం మా మమ్మీకి చేసినట్టు నువ్వు మీ మమ్మీకి ఫంక్షన్ ఎందుకు చేయలేదు? మేం చేసినట్టు మీ మమ్మీని వివిఐపి ఛైర్‌లో కూర్చో బెట్టి మెళ్ళో దండ వేసి కేక్ ఎందుకు కట్ చేయించ లేదు? మేం చేసినట్టు నీవెందుకు గ్రాండ్‌మాని ప్రేమగా హగ్ చేసుకుని ఎందుకు కిస్ చేయలేదు? వై? గ్రాండ్‌మా నీకు మదర్ అవుతుందా? లేదా? టెల్ మీ?" తనని నిలబెట్టి నిగ్గదీసి అడుగుతున్న కొడుకు వంక కేవీరావుగారు అంటే, ఆనాటి కూడితి నీళ్ళ వెంకటేశ్వర్లు బిత్తరపోయాడు. బిత్తరపోయి చూస్తూ, ఏం సమాధానం చెప్పాలో తెలియక నిరుత్త రుడై నిలబడిపోయాడు.

***

ఒక రాత్రివేళ సీతమ్మకు గబుక్కున మెలకువ వచ్చింది. ఎవరో మనిషి షెడ్డులోపలికి వచ్చినట్లని పించింది. గాలికోసం తలుపులు బార్లా తీసిపెట్టి పడుకుందేమో, ఎవరో లోపలికి జొరబడి ఉంటారని భయపడిపోయింది. బంగళాలో లైట్లన్నీ ఆర్పేసి ఉన్నాయి. "ఎవరూ?" కంగారుగా అంది సీతమ్మ. షెడ్డులో చీకటి చీకటిగా ఉంది. సమాధానం లేదు. ఆ మనిషి తన మంచం దగ్గరగా నిలబడ్డాడు. మళ్ళీ "ఎవరూ అంటే మాట్లాడరేంటి?" గద్దింపు స్వరంతో అంది. ఆ మనిషి "నేనమ్మా" అంటూ తన పక్కలో కూర్చు న్నాడు. ఆ గొంతు గుర్తుపట్టింది. "నీవా బాబూ వెంక టేశూ?" అంటూ లేవబోయింది. వెంకటేశ్వర్లు తల్లిని లేపి కూర్చోబెట్టాడు. కొడుకు ముఖం, శరీరం ప్రేమగా చేత్తో తడుముతూ, "వెంకటేశూ, ఎట్టా ఉన్నావురా అయ్యా" అంది. ప్లేట్లో తాను తీసుకు వచ్చిన కేకును తుంచి "తినమ్మా!" అంటూ ప్రేమగా తల్లి నోటికి అందించాడు. ఆ ముసలితల్లి ఆనం దంతో ఉక్కిరిబిక్కిరి అయింది. "నీవూ తిను బాబూ!" అంటూ మరో ముక్క కొడుకు నోటికి అందించింది. ఆ తల్లీ కొడుకులు ఒకరికొకరు తిని పించుకుంటూ, ఒకరి కన్నీరు మరొకరు తుడుచు కుంటూ ఉంటే కిటికీలోంచి వెన్నెల తొంగి చూచింది. ఈ కాలపు పిల్లలు తల్లిదండ్రులను ఈ బబ్లూ లాగా నిగ్గదీసి అడిగినప్పుడే వాళ్ళకి బుద్ధివస్తుంది. అప్పుడే తాము నిరాదరించిన తమ ముసలి తల్లి దండ్రులను మళ్ళీ ప్రేమగా అక్కున జేర్చుకుంటారు.

సెల్: 9866 085 444




నేను మాత్రమే చదువుకోవాలనుకుని
నేనెంతకీ రాయని కావ్యానివి నువ్వు
నా శ్వాస నిండా సాంబ్రాణి గంధాల్ని పులిమి
నా నిండా ప్రవహిస్తున్న రహస్యోత్సవానివి నువ్వు

## నాలో కురుస్తున్న వాన

ఆ మెట్టు మీద ఆ అర్థరాత్రి
ఎక్కడినుంచో చైత్రంలా ఎగిరొచ్చి
కృష్ణబిలాల కింద దాక్కున్న కాలాలకు కిరీటాలు పెట్టి
ఋతువుల బారాతుల్ని మోహరించినప్పుడు
మొలిచిన ఏక్‌తారా మీద జరిగిన
మన పట్టాభిషేకాలన్నీ మరచిపోయావా?

అలికి పెట్టుకున్న ముగ్గులతో
మిసమిసలాడుతున్న నేలలమై
చెలకనిండా నెలమొలకల పారాణులమై
అడవిలో వాలిన ఉదయాలమై
నగ్‌మాలనేరుకుంటూ దివారాత్రాల కంచం నిండా
పంచుకుతిన్న కమ్మదనాలైనా గుర్తు రాలేదా?

చేనుగట్టు మీద అన్నంబుట్ట దింపుకున్నట్టు
రెండోఝాము రేఖాంశం మీదకు దిగొచ్చి
గుండె నేతిగిన్నెలో ముంచి పెట్టుకున్న
గోరుముద్దవై
నా నెత్తుటికో కొత్త పుట్టుకనిచ్చి
మాషా అల్లా... రేయిరేయంత ముషాయిరాల్లో
ఊరేగింపయిన షాయిరీవి కదా నువ్వు
ఎదలనరగదీసి ఎత్తుకున్న చలువగంధాల్ని చల్లుకుని
వాన వెలిశాక కొబ్బరాకు మీద వాలి తలవాల్చి
తూరుపు లాంటి నిన్ను
కళ్ళలోకి ఒంపుకుంటున్న పిట్టను కదా నేను

మరెందుకిలా... ఈ తొందరపాటు

'హఠాత్తుగా'... అనే మాటకు బహుశా
అతి పెద్ద నిర్వచనం నువ్వేనేమో...
అందుకే, వచ్చినంత హడావిడిగానే అచ్చంగా
తీరాన్నెప్పుడూ తోడు తీసికెళ్లని
అలలాగే అభిషేకించి
షహనాయిల మీద నాటుకున్న
పిడికెడు వసంతాల్ని
ఒక అసందర్భంగా కుదించేసి
పోస్టుమార్టం కోసం నాకొదిలేసి పోయినప్పుడు
నా ముందు బారులు తీరి
గర్భస్రావమైపోయిన ఉదయాస్తమయాలెన్నో

పోనీలే... దేహాలు దూరాలు జరిగితేనేం
ఎప్పుడో ఒకప్పుడు కొత్త ఉగాదివై వచ్చి
నాకోసం ఇంకా దాచి ఉంచిన
ఆ గుప్పెడు మెతుకులతో ఇన్నాళ్ల నా ఆకలిని
ఎత్తి పారబోస్తావనుకున్నాను కానీ,
ఇదేమిటి... ఇంతలోనే హఠాత్తుగా
ఇక ఎప్పటికీ నాలో నవ్వని వానవై తేలిపోయి
పాతమరణాలలోకే మళ్ళీ నన్ను గిరాటేసి
చేయి కడిగి తుడుచుకున్నంత తేలిగ్గా వెళ్లిపోయి
ఆరడుగుల లోతున అల్విదావైపోయావంటే
ఏ దేవుడి దేహంలో బల్లెం దింపను



ఏ లోకాన్ని నీ కోసం చింపి పోగులు పెట్టను

మనం పూటకొక కొత్తవానై పూసినన్నాళ్లూ
మన వ్యాకరణాన్ని తిరగరాసిన నడిరాత్రిళ్ల
దానికి సాక్షి సంతకాలు చేసిన రేనాటి రేళ్ల
ఇప్పుడొచ్చి నీ కోసం నిలదీస్తుంటే
నెత్తుటి ముద్దైన వెన్నెలను కప్పెట్టిన
మదీనాను చూపిస్తున్నా
గుండెగోడ నిండా వెర్రిగా తగిలించుకున్న
నీ చిత్రపటాల ముందు నిలబెడుతున్నా

***

ఎన్ని కాంతి కాలాల కావల
ఏ షాయిరీలు రువ్వుకుంటూ తిరుగుతున్నావో ఏమో
అక్కడినుంచి ఏ మేఘమైనా ఇటొస్తుంటే
దీపాలవాగు లాంటి నీ నవ్వును
ఒంపి పంపించు
నా మీద సంజీవనిగా చిలకరించుకుంటాను
కరువింటిలో చిక్కుకుని
కంటిబొట్టుగా గడుపుతున్న
నా గుండెను తుంపి పంపుతాను
నువ్వొక్కసారి చేతిలోకి తీసుకుంటేనైనా పదునెక్కి
మళ్లీ నీ కోసం పందిరిమంచమవుతుందేమో

సృష్టిని దాటేసిన నిన్ను
మళ్లీ దీపంకుందుగా వెలిగించుకోవాలంటే
పాలపుంత పట్టనంత కలగా చేసి
కిందకు దించేసుకోవాలంటే
ఇంకెంత బతుకంత తపస్సు చేయాలో ఏమో...
ఉండు... మళ్లా నీకు ఆయుష్షు పోసి
నిన్నో నల్లరేగడిని చేసే మంత్రం
నా మరణం
దారి తప్పి ఏ పొలిమేరల్లో
కునికిపాట్లు పడుతుందో ఏమో...

.... వెదుక్కొస్తాను
అక్కడే ఉండు....

(ఎఫ్‌కె కి)

**–యార్లగడ్డ రాఘవేంద్రరావు**
**సెల్: 99854 11099**




## నడుం నొప్పికి నడక మందు!

నడుం నొప్పి చాలామందిని వేధిస్తున్న సమస్యే కాదు. దీర్ఘకాల సమస్య కూడా! ఈ నొప్పికి తాత్కాలిక ఉపశమనంగా మందులు వాడడం కన్నా నడక మంచిది అంటున్నారు అమెరికా పరిశోధకులు. దీర్ఘకాలంగా వేధిస్తున్న నడుంనొప్పికి మాత్రమే నడక పనిచేస్తుంది తప్ప తాత్కాలికంగా అప్పటికప్పుడు వచ్చే నొప్పికి ఇది పనిచేయదని చెబుతున్నారు. సుమారు లక్షన్నర మంది మీద వారు అధ్యయనం నిర్వహించారు. వీరిలో కొందరు దీర్ఘకాలంగా నడుంనొప్పితో బాధపడుతుండగా, మరికొందరు తాత్కాలిక నొప్పితో బాధపడుతున్నారు. కొందరికి ఎలాంటి సమస్యా లేదు. వీరందరిని ప్రతిరోజూ అరగంట పాటు నడవమన్నారు. కొంత కాలం తరువాత వీరి నడుంనొప్పిని పరిశీలించారు. దీర్ఘకాలంగా నడుంనొప్పితో బాధపడుతున్న వారిలో పదహారు శాతం మంది నడుంనొప్పి నుంచి ఉపశమనం పొందిన విషయం వీరి దృష్టికి వచ్చింది. తాత్కాలిక నడుంనొప్పితో బాధపడుతున్న వారిలో ఈ లక్షణాలను వీరు గుర్తించలేదు. నడక వలన నడుంనొప్పి తగ్గడానికి గల కారణాలను వీరు విశ్లేషించారు. ఎలాంటి వ్యాయామం చేయని వారిలో అధికబరువు సమస్య తలెత్తుతుందనీ, ఇదే నడుంనొప్పి, వీపు నొప్పికి కారణం అనీ వారు అభిప్రాయపడుతున్నారు.

## గర్భిణీలకు బరువు సమస్య

సాధారణంగా గర్భవతులు ఎక్కువ ఆహారం తీసుకోవాలంటారు. ఇద్దరికి సరిపడా ఆహారం తీసుకోవాలంటూ మామూలు దానికన్నా ఎక్కువ ఆహారాన్ని వారికి అందిస్తుంటారు. ఇది పుట్టబోయే పిల్లల మీద తీవ్ర ప్రభావాన్ని చూపుతుందని స్వీడన్ పరిశోధకులు హెచ్చరిస్తున్నారు. గర్భవతులు ఎక్కువ ఆహారం తీసుకోవడం వలన ఉండవలసిన దానికన్నా ఎక్కువ బరువు పెరుగుతారనీ, ఈ బరువు కడుపులో ఉన్న గర్భస్థ శిశువు మెదడు, గుండె మీద తీవ్ర ప్రభావాన్ని చూపుతుందన్న విషయం వారి అధ్యయనంలో వెల్లడైంది. సుమారు రెండు లక్షల మంది గర్భవతుల మీద వీరు సుదీర్ఘకాలం పాటు అధ్యయనం నిర్వహించారు.



వీరిలో కొందరికి ఎక్కువ ఆహారం అందించగా, మరికొందరికి మామూలుగా వారు తీసుకునే ఆహారాన్నే అందించారు. ఎక్కువ ఆహారం తీసుకున్న గర్భవతులు ఉండవలసిన బరువు కన్నా ఎక్కువగా ఉన్నారు. ప్రసవం అనంతరం పిల్లల ఆరోగ్యాన్ని పరిశీలించారు. బరువు ఎక్కువగా ఉన్న తల్లుల పిల్లల్లో కొన్ని ఆరోగ్య సమస్యలను గుర్తించారు. వారిలో మెదడు ఎదగకపోవడం, గుండె ఆరోగ్యంలో మార్పులను గమనించారు. ఇదంతా గర్భవతిగా ఉన్న సమయంలో తల్లి తీసుకున్న ఆహారం ప్రభావమే అని వారు స్పష్టం చేస్తున్నారు. గర్భవతులు తీసుకోవలసిన జాగ్రత్తల్లో అధిక బరువు నియంత్రణ మొదటిదనీ, దీన్ని ఎప్పటికప్పుడు గమనిస్తూ ఉండాలని వారు సూచించారు.



## ఆరంజ్‌తో మతిమరుపు దూరం?

సాధారణంగా వృద్ధాప్యంలో పలకరించే మతిమరుపును ఆరంజ్ పండుతో దూరం చేసుకోవచ్చు అంటున్నారు పరిశోధకులు. 50 నుంచి అరవై సంవత్సరాలు వయస్సు వచ్చిన వారు ప్రతిరోజూ ఒక పుల్లని పండు (ఆరంజ్, దానిమ్మ, ద్రాక్ష) తినడం ద్వారా మతిమరుపును దూరంగా ఉంచవచ్చున్న సంగతి జపాన్ యూనివర్సిటీ పరిశోధకులు నిర్వహించిన పరిశోధనలో వెల్లడైంది. దాదాపు ఏడు సంవత్సరాల పాటు సుమారు రెండువేల మంది వయస్సు మళ్ళిన వారిపైన నిర్వహించిన పరిశోధనలో ఈ విషయం వెల్లడైంది. వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి ప్రతిరోజూ ఓ ఆరంజ్ ఇచ్చారు. మరో గ్రూపు వారికి వారంలో రెండు లేదా మూడు సార్లు మాత్రమే ఇచ్చారు. ఏడు సంవత్సరాల అనంతరం వీరి మెదడు పనితీరును పరిశీలించారు. ప్రతిరోజూ ఆరంజ్ తిన్న గ్రూపు వారిలో మతిమరుపు లక్షణాలు కనిపించలేదు. రెండవ గ్రూపు వారిలో ఆ లక్షణాలను గుర్తించారు. అయితే కేవలం సిట్రస్ లభించే పండును తినడం వలనే వీరిలో మతిమరుపు దూరం అయిందా? అన్న విషయం మీద ఇంకా పరిశోధనలు నిర్వహించాలని వారు చెబుతున్నారు.



## సంతానలేమికి గసగసాల వైద్యం?

ఇది నిజంగా వైద్యం కాదు. ఓ పరీక్ష మాత్రమే! స్త్రీలలో సంతానలేమికి ఫెలోపియన్ ట్యూబ్‌లు (Fallopian tubes ) కొంత వరకూ కారణం అవుతుంటాయి. వీటిని శుభ్రం చేయడం ద్వారా కొందరిలో సంతానలేమి సమస్యను దూరం చేయవచ్చు. మామూలుగా ఈ ట్యూబ్‌లను శుభ్రం చేయడానికి వీటిలోకి నీటిని ఫ్లష్ చేస్తుంటారు. కానీ ఆస్ట్రేలియాలోని అడిలైడ్ విశ్వవిద్యాలయం, నెదర్లాండ్ విశ్వవిద్యాలయంలోని 28 మంది పరిశోధకుల బృందం సంతానలేమితో బాధపడుతున్న 112 మంది మహిళల మీద పరిశోధన నిర్వహించారు. వీరిలో సగం మందికి ఫెలోపియన్ ట్యూబ్‌లలోకి గసగసాల నూనెను ఫ్లష్ చేసి శుభ్రం చేయగా మిగతావారికి నీటిని మాత్రమే ఉపయోగించారు. కొన్ని నెలల అనంతరం వీరిని పరీక్షించగా, గసగసాల నూనె వైద్యం చేసిన వారిలో 40 శాతం మంది గర్భం దాల్చగా, నీటితో వైద్యం చేసిన వారిలో 18 శాతం మాత్రమే గర్భవతులయ్యారు. అయితే గసగసాల నూనె ఉపయోగించడం వలనే వీరు గర్భవతులయ్యారా? లేక మరేదైనా కారణం ఉందా? అన్న విషయాన్ని మాత్రం వీరు స్పష్టం చేయలేకపోతున్నారు. గసగసాల వైద్యం కొత్తదేమీ కాదనీ, 1914లోనే ఈ ట్యూబ్‌లను శుభ్రం చేయడానికి ఈ నూనెను ఉపయోగించేవారనీ, కాలక్రమంలో చాలా పద్ధతులు అమల్లోకి వచ్చాయని వారు చెబుతున్నారు. గసగసాల నూనె వలన కలిగే ప్రయోజనాల గురించి ఇంకా విస్తృతంగా పరిశోధనలు నిర్వహించాల్సి ఉందని వారు అభిప్రాయపడుతున్నారు.

—అవినాష్

# హెచ్ఐవి సోకినా జీవితం ఉంది!



**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి

హెచ్ఐవి పేరు వింటనే తెలియని భయం. ఎందుకంటే చికిత్స లేని వ్యాధి అది. నిజమే. కానీ ఇప్పుడు అద్భుతమైన మందులు అందుబాటులోకి వచ్చాయి. వైరస్ పూర్తిగా శరీరంలో నుంచి తొలగిపోకపోయినా ఆ వైరస్ ఎటువంటి ప్రభావం చూపకుండా చేసే హోమియో మందులు అందుబాటులో ఉన్నాయి.

### హెచ్ఐవి అంటే....

హెచ్ఐవి అంటే రోగనిరోధక వ్యవస్థను దెబ్బతీయడం ద్వారా అవకాశవాద వ్యాధులు వచ్చేలా చేస్తుంది. అంటే చిన్న వాతావరణ మార్పులకే జలుబు చేయడం, జ్వరం రావడం, టీబీ సోకడం, విరేచనాలు కావడం జరుగుతుంది. ఫలితంగా మృత్యువు చేరువవుతుంది. అంటే రోగనిరోధక వ్యవస్థ బలహీనపడితే వ్యాధులు వచ్చిపడతాయి. బలంగా ఉంటే హెచ్ఐవి ఏమీ చేయలేదు. సరిగ్గా హోమియో చికిత్స రోగనిరోధక వ్యవస్థను శక్తివంతం చేయడం పైనే దృష్టి పెడుతుంది.

### ఏం జరుగుతుంది?

హెచ్ఐవి రోగనిరోధక వ్యవస్థలో కీలకమైనటువంటి టి-కణాలపై దాడి చేస్తుంది. ఈ కణాలను సీడీ 4 పాజిటివ్ లింఫోసైట్స్ అని కూడా అంటారు. ప్రతి రోజు శరీరంలో కొన్ని లక్షల టి-సెల్స్ ఉత్పత్తి అవుతుంటాయి. అయితే ఒకసారి హెచ్ఐవి శరీరంలో ప్రవేశించగానే తనకు తానుగా కొన్ని లక్షల వైరస్‌లను ఉత్పత్తి చేసుకుంటుంది. అదే సమయంలో టి-కణాలను చంపడం ప్రారంభిస్తుంది. టి-కణాల సంఖ్య ఎప్పుడైతే తగ్గుతాయో అనేక వ్యాధులు చుట్టు ముడతాయి. సులభంగా ఇన్‌ఫెక్షన్ల బారినపడతారు.

### లక్షణాలు కనిపించడానికి....

హెచ్ఐవి శరీరంలోకి ప్రవేశించగానే ఎటువంటి మార్పులు కనిపించవు. కొన్ని సంవత్సరాల తరువాత వ్యాధికి సంబంధించిన లక్షణాలు ప్రారంభవవుతాయి. అంటే సీడీ 4 కణాల సంఖ్య తగ్గిపోయిన తరువాత వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి. హెచ్ఐవి శరీరంలో ప్రవేశించిన తరువాత ఎన్ని రోజులకు బయటపడవచ్చని అనేది వారి ఆహారపు అలవాట్లు, ఆరోగ్యస్థితి, ఇతర వ్యాధులపై ఆధారపడి ఉంటుంది. కొందరిలో ఐదారేళ్లకే సీడీ 4 కణాలు బాగా తగ్గిపోయి ఇన్‌ఫెక్షన్లు మొదలవుతాయి. మరికొందరిలో పదేళ్ల పడుతుంది.

### నిర్ధారణ ఎలా?

హెచ్ఐవి గుర్తించడానికి ఎలీసా టెస్టు ఉపయోగపడుతుంది. ఈ పరీక్షలో పాజిటివ్ అని వస్తే నిర్ధారణ కోసం వెస్ట్రన్ బ్లాట్ పరీక్ష చేయించాల్సి ఉంటుంది. వైరస్‌ల సంఖ్య తెలుసుకోవడానికి వైరల్ లోడ్ టెస్ట్, సీడీ 4 కణాల సంఖ్యను తెలుసుకోవడానికి మరికొన్ని పరీక్షలు చేయించుకోవాల్సి ఉంటుంది. ఇవన్నీ చికిత్స ప్రారంభించడానికి, మందుల పనితీరు తెలుసుకోవడానికి బాగా ఉపయోగపడతాయి.

### హోమియో చికిత్స ఎలా పనిచేస్తుంది

హోమియో మందుల వల్ల రోగనిరోధకవ్యవస్థ తిరిగి బలపడుతుంది. సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. అవకాశవాద ఇన్‌ఫెక్షన్లకు చోటు లేకుండా పోతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హెచ్ఐవి అని తెలియగానే ఇక చికిత్స లేదనే నిర్ధారణకు వచ్చేస్తారు. ఎన్నిరోజులున్నా మరణం తప్పదనే భావనలో ఉంటారు. కానీ అది నిజం కాదు. హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా అందరిలాగే సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది.

# హెపటైటిస్, హెర్పిస్ బాధల నుంచి విముక్తి

హెపటైటిస్ అంటే కాలేయంలో కణాలు వాచిపోయి ఫైబ్రోసిస్, సిర్రోసిస్‌కు దారితీస్తుంది. దీంతో కాలేయ పనితీరు మెల్లగా తగ్గి ప్రాణాంతకంగా మారుతుంది. కాలేయ కేన్సర్‌కు దారితీయవచ్చు. హెపటైటిస్ బీ రాకుండా వాక్సినేషన్ ఉన్నప్పటికీ, ఈ వ్యాధి వచ్చిన తర్వాత శాశ్వత పరిష్కారాన్ని చూపే చికిత్స ఇతర వైద్యవిధానాలలో లేదు. కానీ హోమియో వైద్యంలో అద్భుతమైన చికిత్స ఉంది. ఎక్కువ మందితో సెక్సువల్ కాంటాక్ట్స్ పెట్టుకోవడం, అపరిచితుల నుంచి సేకరించిన రక్తం అంటే హెపటైటిస్ వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, స్వలింగ సంపర్కం, ఒకరు వాడిన సిరంజీలు మరొకరు వాడటం వల్ల కూడా హెపటైటిస్ వచ్చే అవకాశం ఉంటుంది. తల్లి గర్భవతిగా ఉన్నపుడు ఈ వ్యాధి సోకినట్లయితే కడుపులోని బిడ్డకు కూడా సంక్రమించే అవకాశం ఉంటుంది.

### లక్షణాలు

ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. తరువాత నెమ్మదిగా కామెర్లు మొదలవుతాయి. దీంతో పాటు చర్మంపై దద్దుర్లు కనిపిస్తాయి. అయితే చాలా మందిలో ఇది తగ్గిపోయి కనుమరుగయినట్లుగా అవుతుంది. హెపటైటిస్ బీ వ్యాధి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో సంవత్సరాల తర్వాత బయటపడవచ్చు. దీన్ని క్రానిక్ ఇన్‌ఫ్లమేషన్ ఆఫ్ లివర్ లేదా క్రానిక్ హెపటైటిస్ అంటారు. వీరిలో కామెర్ల వ్యాధి తగ్గకుండా అలాగే ఉంటుంది. వాంతులు, ఒళ్లంతా దురదలు, కొన్నిసార్లు విరేచనాలు, కడుపు ఉబ్బరంగా ఉండటం, పొట్టలో నొప్పి, రక్తనాళాలు వాచిపోవడం, కిడ్నీకి సంబంధించిన సమస్యలు, ప్లేట్‌లెట్స్ కౌంట్ పడిపోవడం, తలనొప్పి, రక్తహీనత, రక్తకణాల సంఖ్య క్రమంగా పడిపోవడం జరుగుతుంది.

### హెర్పిస్ సింప్లెక్స్

ఒక గుండు సూది గుండుమీద కోటి వైరస్‌ల దాకా ఇమిడిపోయేంత సూక్ష్మమైన వైరస్ ఇది. జీవింతాంతం బాధించే ఈ వైరస్‌ను హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ అని అంటారు. ఇది రెండు రకాలుగా ఉంటుంది. అవి హెచ్ఎస్‌వి1, హెచ్ఎస్‌వి2. ఒకటి నోటి దగ్గర పొక్కుల రూపంలో బయటపడితే, మరొకటి జననావయవాల దగ్గర పొక్కులతో బయటపడుతుంది. హెర్పిస్ వైరస్ పురుషుల నుంచి స్త్రీలకు, స్త్రీల నుంచి పురుషులకు లైంగిక సమయంలో వ్యాప్తి చెందుతుంది. లైంగిక కలయిక సమయంలో చర్మం చిట్లినపుడు గాయాలు, పుండ్ల ద్వారా ఈ వైరస్ వస్తుంది. ఈ చర్మం చిట్లినపుడు వైరస్ లోపలకు ప్రవేశిస్తుంది. ఈ వైరస్ కొద్ది రోజుల్లోనే ప్రభావం చూపిస్తుంది.

### హోమియో చికిత్స

హెపటైటిస్, హెర్పిస్ సింప్లెక్స్ వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. శాస్త్రీయతను సంతరించుకున్న హోమియో చికిత్స మూలకారణాన్ని గుర్తించి దాన్ని తొలగిస్తుంది.



మధుబాబు

4

# స్టార్ ఫైటర్

అనబడే ఫైటింగ్ ఫూల్

**‘ఏయ్ మిచిషీ? ఏమిటిది? ఏం జరుగుతున్నది నా నగరంలో?’ తన కీచుకంఠం మరింత కీచుగా మారిపోతుండగా, విసురుగా అడిగాడు హుహుశాన్.**

**‘మీరు ఆజ్ఞ ఇచ్చినట్టు ఆ అనామకులెవరో తెలుసుకోవటానికి మా అధికారులు, కాని స్టేబుల్స్ చాలామంది నగరమంతా కలియతిరుగుతున్నారు. ఏ క్షణంలోనైనా వాళ్ళ జాడలు తెలిసి పోతాయి’ జరుగుతున్నది ఏమిటో తెలియకపోయినా బింకంగా చెప్పింది ఆమె.**

‘అసమర్థులు మీరు అందరూ... వట్టి చేతకాని దద్దమ్మలు’ మరింత కోపంగా అన్నాడు హుహు సారు.

‘తమకు తెలియనిది ఏదో అతని దృష్టికి వచ్చిందని అర్థమై, విల్‌పవర్‌నంతా కూడగట్టుకుని నిటారుగా నిలబడింది మిచిషీ. ‘హుహుశాన్‌సారు దయచేసి మా మీద కోపం చేయవద్దని వేడుకుంటున్నాను. జరిగింది ఏమిటో చెప్పమని అర్థిస్తున్నాను’ వినయాతి వినయంగా అడిగింది.

‘సంగ్లీ సందులో ఎవరో ఇద్దరు అనామకులు చేరి అరుపులతో కేకలతో అందరినీ భయ పెడుతున్నారట... ఇద్దరు స్త్రీలు కూడా ఉన్నారట వాళ్ళతో... అప్పుడే పుట్టిన ఒక పసిబిడ్డ కూడా ఉందిట...’ అన్నాడు అతను.

ముఖం మీద ఎవరో చాచిపెట్టి కొట్టినట్టు ఒక్కసారిగా అవగతమైపోయింది మిచిషీకి. షాన్‌సూ భార్యకు సహాయం లభించింది. హాస్పిటల్ దగ్గర రభస చేసినవాళ్ళు ఎవరోగాని, ఆమె ప్రాబ్లమ్‌ని సాల్వ్ చేసేశారు.

అవటానికి నిక్కచ్చిగా డ్యూటీ నిర్వర్తించే పోలీస్ అధికారే అయినా తను కూడా ఒక ఆడదేనన్న మాటను ఎప్పుడూ మర్చిపోలేదు మిచిషీ. కాన్పు కష్టమై చావుబతుకుల మధ్య ఊగిసలాడుతున్న షాన్‌సూ భార్యకు సహాయం లభించిందన్న మాట ఎంతో సంతోషాన్ని కలిగించింది ఆమె స్త్రీ హృదయానికి. ఏ పని జరిగేలోపల, అందుకు సహకరిస్తున్న ఆ అపరిచిత వ్యక్తుల్ని పట్టి బంధించాలని తమకు ఆర్డర్స్ ఇవ్వబడ్డాయో, ఆ పని జరిగిపోవటం ఆమె చేస్తున్న ఉద్యోగాన్ని వెక్కిరించినట్లుగా కూడా అనిపించింది.

‘నేను వెంటనేవెళ్ళి అక్కడి పరిస్థితిని తమకు రిపోర్ట్ చేస్తాను’ అప్పటికప్పుడు తను ఎటువంటి వాగ్దానం చెయ్యాలో తెలియకపోవటం వల్ల, మధ్యస్తంగా ఒక మాటను చెప్పింది ఆమె.

‘ఆర్చుకుని తీర్చుకుని నువ్వు అక్కడికి వెళ్ళే దాకా వాళ్ళు నీ కోసం ఎదురుచూస్తూ నిలబడి ఉంటారా?’ దురుసుగా అడిగాడు హుహుశాన్.

అప్పటివరకూ ఏమీ మాట్లాడకుండా మౌనంగా కూర్చుని ఉన్న కుంగ్‌ఫూ వస్తాదు ముఖంలో ఒక విచిత్రమైన మార్పు వచ్చింది.

‘ఎవరు ఆ పని చేసింది?’ కూర్చున్న చోటునుంచి చటుక్కున లేచి నిలబడుతూ అడిగాడు.

తను ఎవరితోనైనా సంభాషిస్తున్నప్పుడు, మధ్యలోకి వచ్చి మాట్లాడే మరో మనిషిని పొరపాటున కూడా క్షమించడు హుహుసార్. నిప్పులు కక్కుతాడు. దారుణంగా శిక్షింపచేస్తాడు.

అటువంటి మనిషి ఇప్పుడు కనీసం చూపులతో కూడా కసురుకోలేదు. ‘మీరు దయచేసి కొంచెం శాంతించండి. నేను మాట్లాడుతున్నది ఏమిటో చూస్తున్నారు కదా...’ అన్నాడు సామరస్య ధోరణితో.

‘మీకు ఎవరికీ తెలియని విషయం ఒకటి ఉంది హుహుశాన్. నాకు కావాల్సిన ఇద్దరు అనామకుల్లో ఒకతను పవిత్రమైన మా కుంగ్‌ఫూ విద్యను అపవిత్రం

## జరిగిన కథ

**జ**పాన్ వెళ్ళి, కుంగ్‌ఫూ విద్యాపీఠంలో చేరిన షాడో, ఫ్యుజీశాన్‌కు శత్రువుగా మారతాడు. అక్కడి నుంచి తన స్నేహితుడు *గంగారాం*తో కలిసి హాంకాంగ్ సిటీ కాంటన్‌లో అడుగుపెట్టి, కాన్పు కష్టమై విలవిల్లాడుతున్న షాన్‌సూ భార్యను రక్షిస్తాడు. ఆ క్రమంలో హుహుశాన్ మనుషులతో గొడవపడతాడు. ఇన్‌స్పెక్టర్ మిచిషీకి ఫ్యుజీశాన్‌ని పరిచయం చేసి అతను కోరినవిధంగా పని చేసి పెట్టమని చెబుతాడు హుహుశాన్.

ఆ తర్వాత...

చేయటానికి పుట్టినట్టు ప్రవర్తిస్తాడు. అవసర సమయంలో అవతలివారి చెవులు చిల్లులు పడిపోయేటట్లు సింహనాదం చేయటం మాకు వెన్నతో పెట్టిన విద్య. అది అతనికి కూడా వచ్చే ఉంటుంది. నేను ఎవరికోసం మీ దగ్గరికి వచ్చానో ఆ అనామకులు వాళ్ళే అయివుంటారు' ఆవేశంగా అన్నాడు ఫ్యుజీశాన్.

'ఒకే ఒక్క అరుపుతో అవతలి వారిని అదరగొట్టటమనే మాట వినటానికి బాగానే ఉంటుంది గాని, ఆచరణలో అసాధ్యమని మిచిషీకి తెలుసు. తనకు కూడా అటువంటి అభిప్రాయమే ఉన్నట్టు తల విదిలించి, చిన్నగా నవ్వాడు హుహుశాన్.

తన మాటల్ని వారిద్దరూ నమ్మటానికి సిద్ధంగా లేరని తెలిసిపోయింది కాబోలు ఉన్నట్లుండి ఒక పాదాన్ని రెండవ పాదానికి దూరంగా జరిపి, సింహనాదం చేశాడు ఫ్యుజీశాన్.

ఝల్లుమన్నాయి మిచిషీ గుండెలు. తనకు తెలియకుండానే, కూర్చున్న కుర్చీలో నుంచి చటుక్కున లేచి నిలబడ్డాడు హుహుశాన్.

టప్పుమని శబ్దంచేస్తూ మూడు ముక్కలైపోయింది అతని ఎదురుగా ఉన్న టీపాయ్ మీది ఒక పింగాణీ ఫ్లవర్‌వాజ్. లావుపాటి గులకరాయితో కొట్టినట్లు పగుళ్ళు చూపాయి ఫ్యుజీశాన్‌కి దగ్గర్లో ఉన్న రెండు గాజు కిటికీలు.

భుజం మీది కాషాయపు ఉత్తరీయపు అంచుతో, పెదవుల్ని తుడుచుకుంటూ, చిరునవ్వు నవ్వాడు ఫ్యుజీశాన్.

'పూర్తిబలంతో అరిచిన అరుపు కాదు ఇది. అరవటం అంటే ఎలా ఉంటుందో మీకు తెలియటం కోసం చూపించిన చిన్న ఉదాహరణ..' అన్నాడు హుందాగా.

తలతిప్పి తన వెనుక శిలావిగ్రహంలా నిలబడి ఉన్న ఒక సర్వెంట్ వైపు చూశాడు హుహుశాన్. వెంటనే అందించింది ఆమె అతనికి, సిగరెట్ కాల్చేందుకు అతనికి అవసరమైన వెదురు చువ్వని. టీపాయ్ మీదనే ఉన్న ఖరీదయిన సిగరెట్ బాక్స్‌లో నుంచి ఒక సిగరెట్‌ని తీసి దానికి అమర్చి, బంగారంతో చేయబడి వజ్రాలు పొదిగిన లైటర్‌తో వెలిగించింది.

'నువ్వు వెంటనే మన సహాయం కోరి వచ్చిన ఈ గౌరవనీయుడిని, ఆ అనామకులు అరిచి కేకలు పెడుతున్న ప్రదేశానికి తీసుకువెళ్ళు' నాజూకుగా సిగరెట్ పొగను పీలుస్తూ మిచిషీకి చెప్పాడు హుహుశాన్.

అటెంక్షన్‌లో నిలబడి అతనికి శాల్యూట్ చేసింది మిచిషీ. వెనుతిరిగి అక్కడి నుంచి బయటికి బయలుదేరుతూ కుంగ్‌ఫూ వస్తాదుకు చేయి ఊపింది.

కారణం ఆమెకు తెలియలేదుగాని, ఎందుకనో తాను ధరించి ఉన్న కాషాయాంబరాల మాదిరిగానే ఎర్రబడిపోయింది అతని వదనం.

'కుంగ్‌ఫూ విద్యాపీఠం నుంచి అతిసామాన్యమైన పనివాళ్ళు వచ్చినా, లేచి నిలబడి వినయాన్ని ప్రదర్శిస్తారు అందరూ. ఆ పీఠానికి కాబోయే అధిపతిని నేను...' తను చెప్పదలుచుకున్నది ఏమిటో, చెప్పీ చెప్పకుండా ఆమెకు ఎక్స్‌ప్లెయిన్ చేయటానికి ప్రయత్నించాడు.

ఎంతోకాలం అక్కడ పనిచేసి, జవసత్వాలు ఉడిగిపోతున్న సమయంలో పని మానుకుని ప్రశాంత జీవనం గడుపుతున్న తన మాతామహుడు తనకు చిన్నతనంలో చెప్పిన రకరకాల కథలను గుర్తుచేసుకున్నది మిచిషీ.

ఆప్యాయతలకు, ఆదరణలకు పెట్టింది పేరిట విద్యా



**అలుపూసొలుపూ లేకుండా మరమనిషి మాదిరి గొయ్యి తవ్వుతూనే ఉన్నాడు గంగారాం. రెండు మూరల వెడల్పు, ఆరు మూరల లోతున్న గొయ్యి ప్రత్యక్షమైంది. లోపలినుంచి మట్టిలో ముంచినట్టున్న ఓ పుల్లను బయటికి విసిరాడు అతను. తళ తళా మెరుస్తోంది అది. ఇంతకీ అది కర్ర పుల్లేనా? అసలు గంగారాం ఆ గొయ్యి ఎందుకు తవ్వుతున్నాడు?**

పీఠం నుంచి వచ్చే వస్తాదులందరూ. నిస్స హాయంగా నిలబడిపోయే మనుష్యులనే కాదు, నోరు లేని పశుపక్ష్యాదులన్నా కూడా తగని ప్రేమట వారందరికీ.

అటువంటి మహిమాన్వితమైన విద్యాపీఠానికి కాబోయే అధిపతినని ఒకటికి పదిసార్లు చెప్పు కుంటున్న ఈ పెద్దమనిషికి ఇంతటి అహంకారం ఎక్కడినుంచి వచ్చింది?

బంగారపు రేకుల్ని అతికించి ఉన్న ద్వారాల్ని, తలుపుల్ని అధిగమించి, ఆ భవంతి ఎదుట మెయిన్ రోడ్డు మీద ఉన్న తన వెహికల్ దగ్గరికి చేరుకున్నది ఆమె. తనను చూడగానే, డోర్‌ని తెరిచి పట్టుకున్న డ్రైవర్‌ని కనులతోనే హెచ్చరించింది.

చురుకైనవాడు ఆ డ్రైవర్. వెంటనే ఆమె మీది నుంచి దృష్టిని మరలించి, 'దయచేయండి... దయచేయండి" అంటూ ఆహ్వానించాడు ఆమె వెనుకే వచ్చిన వస్తాదుని.

వెనుకసీటులో ఆసీనుడైనాడు ఫ్యుజీశాన్ మహా ఠీవీగా. కాలుమీద కాలు వేసుకుంటూ 'మనం వెంటనే ఆ అనామకులు కనిపించిన ప్రదేశానికి వెళ్ళాలి' అని ఆర్డర్ ఇచ్చాడు.

ముందు సీట్లో డ్రైవర్ పక్కనే కూర్చుంటూ, కనులతోనే సైగ చేసింది మళ్ళీ మిచిషీ.

'మనవాళ్ళందరూ ఆ ఏరియానంతా కార్డన్ చేసే శారు మేడమ్. మనకి తెలియకుండా ఒక్క చీమ కూడా బయటికి పోలేదు. బయటినుంచి లోపలికి ఎంటర్ కాలేదు' అని చెపుతూ కారును వేగంగా కదిలించాడు డ్రైవర్.

ఎందుకో చటుక్కున తన మాతామహుడి దగ్గ ర్నించి వర్తమానం తీసుకువచ్చిన చిలుకలు మనస్సులో మెదిలాయి మిచిషీకి.

దూరాభారం నుంచి వచ్చినందువల్ల, అలసట తీరేవరకూ తన దగ్గరే విశ్రాంతి తీసుకుంటాయి అవి... తిరిగి తను ఏవైనా మాటలు చెపితే, తన తాతకు చేరవేయటానికి పయనమైపోతాయి.

సమస్త భూప్రపంచానికి ఏకైక చక్రవర్తి మాదిరి మాట్లాడుతున్న ఈ కుంగ్‌ఫూ పెద్దమనిషికి సంబంధించి మరికొన్ని వివరాలు తీసుకురమ్మని ఆ ప్రాణులకు చెపితే ఎలా ఉంటుంది?

మిచిషీ మనసులోని ఆలోచనలకు సమాధానం లభించకముందే, ఒక చిన్న వీధిలోకి మరలింది ఆమె వెహికల్. పది నిమిషాల తరువాత, ఎప్పుడో చాలాకాలం క్రితం ఏదో భూకంపానికి లోనై కుప్ప కూలిపోయిన భవనం ముందు ఆగింది.

ఇళ్ళ దగ్గరా, గోడల చాటునా, మట్టిబొమ్మల మాదిరి నిలబడి ఉన్నారు అనేకమంది కానిస్టేబుల్స్. నడుముల మీద చేతులు వేసుకుని భవనం పక్క భాగంలో ఆమెకు కనిపించారు ఇద్దరు అధికారులు.

పరుగులాంటి నడకతో వచ్చి ఆమెకు శాల్యూట్ చేశారు వారిద్దరూ. డోర్ హ్యాండిల్‌ని పట్టుకుని ఓపెన్ చేశారు.

'హాస్పిటల్ దగ్గర మిస్ అయినట్టే ఇక్కడ కూడా దెబ్బతిన్నాం కదూ?' కిందికి దిగుతూ అడిగింది ఆమె.

'ఎలా జరిగింది? అసలు ఏం జరిగింది? అరుపులు, కేకలు ఎందుకు వినవచ్చాయి?' ఖంగు మంటున్న కంఠంతో అడుగుతూ, తనంత తానే వెనుక సీట్లో నుంచి బయటికి వచ్చాడు ఫ్యుజీశాన్.

'ఎవరికీ ఏమీ తెలియదు మేడమ్.... ఒక్క సారిగా పిడుగుపడినట్టు వినవచ్చిందిట అరుపు. అంతే.. ధైర్యం తెచ్చుకుని బయటికి వచ్చేసరికి కనిపించారట ముగ్గురు..' జరిగిందేమిటో విచారణ చేసిన అధికారి వినయంగా చెప్పాడు మిచిషీకి.

'ఎటుగా పోయారు వాళ్ళు?' మళ్ళీ అడిగాడు ఫ్యుజీశాన్

'ఇక్కడికి రెండు మైళ్ళ దూరంలో పెద్ద చిత్తడి నేల ఉంటుంది. దానికి ఆవలగా ఒక చిన్న సెటిల్మెంటు ఉంటుంది. బహుశా అటుగా పోయి ఉండవచ్చు' మళ్ళీ మిచిషీకే చెప్పాడు ఆ ఆధికారి.

'బుద్ధిహీనుడా... ఎటుగా వెళ్ళారో తెలిసిన తర్వాత, వాళ్ళు ఈ ప్రదేశం నుంచి నిష్క్రమించారని అర్థం అయిన తర్వాత, ఇంకా ఏం చేస్తున్నారు ఇక్కడ?' దురుసుగా అడిగాడు ఫ్యుజీశాన్.

విపరీతమైన కోపంతో వికృతంగా తయారయింది ఆ అధికారి ముఖం. తనకు తెలియకుండానే పిడికిలి బిగించి ముందుకు కదలబోయాడు.

చటుక్కున అతనికి కుంగ్‌ఫూ వస్తాదుకి మధ్యలో అడ్డంగా నిలబడింది మిచిషీ... 'మీరందరూ వెంటనే వెళ్ళి ఆ సెటిల్మెంట్‌ను గాలించండి. ఎట్టి పరిస్థితిలోను వాళ్ళని మనం పట్టుకుని తీరాలి' అని చెప్పింది అధికారికి.

'యస్ మేడమ్. ఆ పనే చేయటానికి నిశ్చయించుకున్నాం, ఇంతలోనే మీరు వచ్చారు' అంటూ శాల్యూట్ చేసి, తనవారందరినీ ఉద్దేశించి ఏవో అరుపులు అరిచాడు ఆ అధికారి.

ఇళ్ళచాటున, గోడల పక్కన నిలబడి ఉన్న కానిస్టేబుల్స్ అందరూ పరుగులాంటి నడకతో, అంతకు ముందు అతను సూచించిన దిశలో పరుగులు మొదలుపెట్టారు. అరనిమిషంలో తిరిగి మనిషి అనే వాడు ఎవరూ కనిపించని నిర్జన ప్రదేశం మాదిరిగా తయారైపోయిందా చోటు.

'మమ్మల్ని చూసి, పిడికిళ్ళు బిగించిన వారిని విడిచిపెట్టే అలవాటు మాకు లేదు' నడుము మీద చేతులు వేసుకుంటూ అన్నాడు ఫ్యుజీశాన్.

'పరిచయం లేనివాళ్ళు ఎంత పెద్దవాళ్ళయినా తమకు సంబంధించని విషయాల్లో తల దూరిస్తే సహించే అలవాటు మా అధికారులకు కూడా లేదని' చురుకుగా సమాధానం ఇచ్చింది మిచిషీ.

'నేను ఎవరినో మీకు తెలిసి ఉండాలి. గతంలో మా విద్యాపీఠం నాన్‌కింగ్ ఏరియాలో నివసించే ప్రజలకు చేసిన సహాయాలను మరచిపోవటం క్షమార్హం కాదు' కచ్చగా అన్నాడు ఫ్యుజీశాన్.

అచికూ డెమన్స్ అనబడే ఒక క్రూరమైన దొంగల జాతి నాన్‌కింగ్ ప్రజలను నానా హింసలకు గురి చేస్తుంటే, వచ్చి వారిని ఎదిరించేందుకు ప్రయత్నం చేసి, ప్రాణాలను పోగొట్టుకున్నాట్ట ఒక కుంగ్‌ఫూ వస్తాదు. అది తెలిసి అతని తర్వాత వచ్చాడట బుషిడో వస్తాదు.

ఫ్యుజీశాన్ వంటి అహంకార పూరితుడు తన ఎదుట నిలబడి ఉన్నాడని తెలిసి కూడా అదో రకమైన తన్మయత్వంలో మునిగి, తనలో తను నవ్వకుండా ఉండలేకపోయింది మిచిషీ.

కథలు కథలుగా చెప్పాడు ఆమె తాత ఆ బుషిడో వస్తాదు సాహసాల గురించి. 'చిలుకలంటే అమితమైన ప్రేమ తల్లీ. ఆయన వచ్చి గట్టిగా చేతులు తడితే చాలు ఎక్కడెక్కడినుంచో గుంపులు గుంపులుగా వచ్చి చుట్టూ గుమికూడేవట. గోరువంకలూ, పావురాలూ, ఆఖరికి చీకటి సమయాల్లో తప్ప తమ గూళ్ళలో నుంచి బయటికి రాని గుడ్లగూబలు కూడా పడి చచ్చిపోయేవట- ఆయన చేతుల మీద వాలటానికి...' తనను ఒళ్ళో కూర్చోబెట్టుకుని చెప్పాడు ఒక వెన్నెల రాత్రి.

'బుషిడో అంటే ఎవరు తాతా?' అడిగింది తను.

'కుంగ్‌ఫూ పీఠానికి నాలుగో అధిపతి అనుకుంటాను తల్లీ... ఇప్పటివాడు కాదు. అబ్బో... వందల సంవత్సరాల కిందట వాడు' అన్నాడు తాత.

'అప్పుడెప్పుడో జరిగినవి ఇప్పుడు నీకు ఎలా తెలిసినయ్?' అనుమానాన్ని వెలిబుచ్చింది తను.

'కుంగ్‌ఫూ పీఠంలో వేలకు వేల తాళపత్ర గ్రంథాలున్నాయ్. ఏ రోజు జరిగిన సంఘటనలను ఆ రోజునే గ్రంథస్థం చేసి, రాబోయే తరాలకు అందించటం అక్కడి వారికి అలవాటు..' చెప్పాడు తాత.

'అచికూ రాక్షసులను తుక్కుకింద కొట్టింది ఆ మహనీయుడే తల్లీ... ఆ తర్వాత ఇంతవరకూ అటు



వంటి సాహసం మరెవ్వరూ చేయలేదనే నా అభిప్రాయం' అని కూడా చెప్పాడు.

ఆరోజున తాత నోటివెంట తను ఆలకించిన మాటల్ని గుర్తుకు తెచ్చుకున్న తర్వాత ఆమె మరొక్క మాట కూడా మాట్లాడకుండా, తను ఏ పనిమీద వచ్చిందో ఆ పని మీదనే దృష్టిని కేంద్రీకరించుకుని ఉంటే చాలా బాగుండి ఉండేది.

తను చూస్తూ ఉండగా, తన అధికారాలను కించపరిచే మాటలు మాట్లాడినందుకు రోషపడింది ఆమె హృదయం. 'అవును గతంలో నాన్ కింగ్ ఏరియాను రక్షించిన ఆ వస్తాదులు ఈ మధ్య మాత్రం ముఖం చాటుచేసినట్టు తెలిసింది. అచికూ రాక్షసులు తిరిగి తలలు ఎత్తితే తమకేమీ పట్టనట్టు ముభావంగా ఉండిపోయారని వినికిడి' అనేసింది.

ఎరుపురంగును కూడా దాటి నల్లగా కమిలిపోయింది ఫ్యుజీశాన్ వదనం.

'ఆడదానివి కాబట్టి బ్రతికి పోతున్నావు. ఇవే మాటలు ఇంకెవరి నోటి వెంట వచ్చివున్నా ఈ పాటికి నరకలోకానికి ప్రయాణమై పోతూ ఉండేవాళ్ళు. మాకు మీ సహాయం అవసరం లేదు. మా పీఠానికి శత్రువులైన వారిని మేమే పట్టుకుంటాం, మేమే శిక్షలు విధిస్తాం' అంటూ గిరుక్కున వెనుతిరిగాడు.

రెండుమార్లు మాత్రమే కనురెప్పల్ని అల్లల్లాడించింది మిచిషీ. మూడవ మారు మూసి తెరిచే సమయానికి ఆ చుట్టుపట్ల ఎక్కడా ఆమెకు కనిపించలేదు అతను.

ఒక మనిషి ఎంతటి వస్తాదు అయినా అంత వేగంగా కదలటం సాధ్యపడుతుందని అనుకోలేదు ఆమె. ఆశ్చర్యంతో అలాగే నిలబడిపోయింది.

***

చీలమండల వరకూ వస్తున్న బురద నేలలో అడుగులు వేయటం చాలా కష్టం అని తెలిసి వచ్చింది గంగారాంకి.

'చీకట్లు చుట్టుముట్టే టైము అయింది గురూ. చలిగాలులు వీస్తయ్. పాపాయి తట్టుకోలేదు' తన చేతుల్లో ఉన్న పసిగుడ్డును మరింత గట్టిగా గుండెలకు అదుముకుంటూ షాడోకి చెప్పాడు.

సిగరెట్ పొగల్ని రింగులు రింగులుగా వదులుతూ చకచకా అడుగులు వేస్తున్న షాడో, ఒక్కసారిగా ఆగిపోయి వెనక్కిచూశాడు.

పచ్చిబాలింత షాన్సూ భార్య, వయస్సు అధికమై పోవటం వల్ల, శక్తియుక్తుల్ని కోల్పోయిన పెద్దావిడ – ఇద్దరూ ఒక్కసారికూడా నెగెటివ్ మాట మాట్లాడకుండా తాము ఎటు నడవమంటే అటు నడుస్తున్నారు. నోళ్ళు తెరచి చిన్నపాటి కంప్లయింట్ కూడా చేయటం లేదు.

'పొడిగా ఉండే చోటు చూడు గంగూ... పది నిమిషాలు రెస్టు' అన్నాడు అతను.

పది నిమిషాల తర్వాత తాము ప్రయాణం చేస్తున్న చిత్తడి భూమిలో ఒక మట్టిగుట్ట వంటి ఎత్తయిన చోటును గమనించాడు గంగారాం. పెద్ద పెద్ద అడుగులు వేసి, అక్కడికి పోయాడు.

కృతజ్ఞత నిండిన కనులతో చూస్తూ ఆ గుట్ట మీద చతికిలపడింది షాన్సూ భార్య. తనకు తాతమ్మ వంటి వృద్ధురాలిని తన పక్కనే కూర్చోబెట్టుకుంది.

తన గుండెలకు అదుముకుని ఉన్న పసిగుడ్డును ఆమెకు అందించాడు గంగారాం. 'నీకు



తమ్ముడిని తల్లీ. మా గురువుగారు నీకు అన్నలాంటి వాడు. మా ముందు నువ్వు సిగ్గు పడవలసిన అవసరం లేదు. పాపాయికి చనుబాలు ఇవ్వు' మృదువుగా చెప్పాడు.

ముక్కూమొఖం తెలియని వారిద్దరి ముందూ ఆ పని చేయటం ఎలాగోనని మథనపడుతున్న షాన్సూ భార్య కళ్ళు నీటితో నిండిపోయాయి.

అక్కడే నిలబడి ఆమెను మరింతగా ఇబ్బంది పెట్టటం ఇష్టం లేని గంగారాం, పక్కకు నడిచాడు. తనతో పాటు షాడోని కూడా తీసుకుపోయాడు.

'మనం చేసిన గొడవని పోలీసులు గమనించే ఉంటారు. మనం ఇటుగా వచ్చిన విషయాన్ని కూడా వాళ్ళు పసికట్టేసి ఉంటారు' మట్టిగుట్ట చివరి భాగంలో చతికిలబడుతూ అన్నాడు.

చతికిలబడబోయాడు. పూర్తిగా కూర్చోలేదు. లాల్చీ వెనుకభాగాన్ని గట్టిగా పట్టుకుని, బలంగా ఇవతలికి గుంజాడు షాడో.

వారిద్దరికీ ఏదో మాటతేడా రావటంవల్ల, ఇద్దరూ పోట్లాటకి సిద్ధం అవుతున్నారని భావించింది షాన్సూ భార్యకి బంధువైన వృద్ధురాలు.

'అయ్యయ్యో.... అదేమిటి నాయనలారా? ఏమైంది మీ ఇద్దరికీ?' అంటూ కూర్చున్న ప్రదేశంలో నుంచి లేచి నిలబడబోయింది.

గంగారాంని ఇవతలకు లాగుతూనే, ఇంకా బలంగా నెట్టాడు షాడో. అదే ఊపులో ముందుకు వంగి, చటుక్కున పట్టుకున్నాడు నల్లటి పడగను విప్పి బుసలు కొట్టడం మొదలుపెట్టబోతున్న ఒక పొడుగాటి పాముని.

'కొట్టేయ్ గురూ... నేలకేసి బాది తలను నలిపేయ్...' అవతలగా పడి, ఆ దృశ్యాన్ని చూసిన గంగారాం కచ్చగా హెచ్చరించాడు.

వారి కదలికల్ని తాను పొరపాటుగా అర్థం చేసుకున్నట్టు గ్రహించి, ఎడమ చేత్తో నోటిని అదుముకుంటూ పైకిలేచే ప్రయత్నాన్ని విరమించుకున్నది వృద్ధురాలు.

గంగారాం హెచ్చరించినట్టు తను పట్టుకున్న విషపు పురుగుని నేలకేసి కొట్టలేదు షాడో. గిరగిరా తిప్పి దూరంగా విసిరేశాడు.

'అది ఊరికే అవతలికిపోదు. కచ్చకట్టి మనల్ని తరుముకుంటూ వస్తుంది. నాకు తెలుసు' దుస్తులకు అంటిన దుమ్ము దులుపుకుంటూ పైకిలేచి తన అభిప్రాయాన్ని వెల్లడించాడు గంగారాం.

'మనం ఉన్న చోటుకి అది రాలేదు. దాని దగ్గరికి మనం వచ్చాం. ఒళ్ళు దగ్గర పెట్టుకోవాల్సింది మనం. అది కాదు' అన్నాడు షాడో.

'పగ పడుతుందేమో నాయనా. పడగవిప్పి నిన్ను బాగా చూసింది' అది ఎక్కడ పడిందో అటుకేసి చూస్తూ చిన్నగా అన్నది వృద్ధురాలు.

'అదిగో... పెద్దావిడ కూడా చెపుతోంది. నిర్లక్ష్యం చేయటం మంచిది కాదు' అంటూ అటూ ఇటూ చూశాడు గంగారాం.

'ఏమిటి చూస్తున్నావు?' అడిగాడు షాడో.

'చేతికిచిక్కిన దాన్ని నేలకేసి కొట్టకుండా వదిలేశావు. ఇప్పుడు అది చాలా ఎలర్ట్‌గా ఉంటుంది.. వట్టి చేతులతో వెళితే మీదపడి కచ్చ తీర్చుకుంటుంది. కర్రపుల్ల ఏదైనా కనిపిస్తే–' అంటూ చటుక్కున మాటను మింగేశాడు గంగారాం.

షర్టుజేబులో ఉన్న ఆఖరి సిగరెట్‌ని బయటికి తీసి వెలిగించుకోవాలో వెలిగించుకోకూడదో ఆలోచిస్తున్నాడు షాడో. 'మళ్ళీ ఏమైంది నీకు?' విసుగ్గా అడిగాడు అతను మాటల్ని మింగేసరికి.

'ఒక్కసారి ఇటుచూడు. ఒక్కసారి' అంటూ ముందుకు తూలినవాడు తిరిగి నిరారుగా నిలబడకుండా నేలమీద చతికిల పడ్డాడు గంగారాం. వట్టి చేతులతోనే నేలను తడిమి, మట్టిని పక్కకు లాగటం మొదలు పెట్టాడు.

పెద్దరంధ్రం ఉన్నది అతను ఆ పని చేస్తున్న ప్రదేశంలో. 'నేను విసిరిన పాముకి పెళ్ళాం పిల్లలు

ఉండి ఉంటే, ఆ రంధ్రంలోనే కూర్చుని నిన్ను చూస్తూ ఉంటాయి. ఒకే ఒక దెబ్బ... కళ్ళు తిరిగి కిందపడి పోతావ్' అంటూ అతని దగ్గరికిపోయాడు షాడో.

కుడికాలి బూటు పక్కభాగంలోనే బిగించి ఉంది అతను ఉపయోగించే డాగర్. దాన్ని బయటికి తీసి అతనికి అందించాడు.

మరమనిషి మాదిరి పనిచేశాడు గంగారాం. పావుగంట గడిచేసరికి రెండు మూరల వెడల్పు, ఆరు మూరల లోతు పెద్ద గోయి ప్రత్యక్షం అయింది అక్కడ.

అనవసరమైన మాటలు మాట్లాడి అతన్ని డిస్టర్బ్ చేయటం తనకు ఇష్టం లేనట్టు మౌనంగా ఉండిపోయింది పెద్దావిడ. మరో పది నిమిషాలు గడిచిన తర్వాత ఆగలేక పోయింది.

'ఏం చేస్తున్నావ్ నాయనా?' అని అడిగింది.

'గొయ్యి తవ్వుతున్నాను పెద్దమ్మ' తను చేస్తున్న పని ఆపకుండా, సమాధానం ఇచ్చాడు గంగారాం.

'ఇది మామూలు చోటు కాదు నాయనా. మింగ్ చక్రవర్తులు రాజ్యం చేస్తున్న కాలంలో రకరకాల యుద్ధాలు జరిగిన ప్రదేశం. మూరెడు లోతు కంటే ఎక్కువగా తవ్వితే ఆ కాలం నాటి అస్థిపంజరాలు బయటపడతయ్. వేళకాని వేళలో అవి కంటపడటం మనకి క్షేమకరం కాదు' చెప్పింది ఆమె.

షాడో ఇచ్చిన డాగర్ మొనతో మట్టిని కదిలించి, దోసిళ్ళతో ఎత్తి బయటపోస్తున్నాడు గంగారాం.

'నువ్వు చెప్పేది నిజమే అయితే ఇప్పటికి మూడో నాలుగో నాకు దర్శనం ఇచ్చి ఉండాలి. అటువంటిదేమీ జరగలేదు' అన్నాడు అప్పుడు కూడా తాను చేస్తున్న పనిని ఆపకుండా.

జేబులో మిగిలిన ఆఖరి సిగరెట్ జోలికి పోకుండా దాచిపెట్టుకోవటమే మంచిదనే నిర్ణయానికి వచ్చాడు షాడో. గంగారాం తవ్వి బయటికి విసురుతున్న మట్టిలోనుంచి పొడుగాటి పుల్లను ఒకదాన్ని పట్టుకుని, దానికి అంటుకున్న దుమ్మును దులిపి నోటిలో పెట్టుకోబోతూ, బొమ్మ మాదిరిగా బిగుసుకు పోయాడు.

నిమిష నిమిషానికి పెద్దది అవుతున్న గోతిలో తల కూడా కనిపించనంత లోతుకు వెళ్ళి పోయాడు గంగారాం. ఇప్పుడు ఆ గోతికి అటొక కాలు, ఇటొక కాలు తన్ని పట్టి కొంచెంగా పైకి లేచాడు.

'అర్థం అయిందా? గోయి తవ్వటం దేనికో తెలిసిందా?' చిరునవ్వుతో అడిగాడు.

అతను కావాలనే ఆ పుల్లను మట్టితో కలిపి తనకు దగ్గరగా పడేటట్టు విసిరాడని అర్థమై చిరునవ్వు నవ్వాడు షాడో.

పడమటి దిక్కులోకి పడిపోయాడు సూర్యుడు. మెల్లమెల్లగా ఆ చిత్తడి నేలను ఆవరించటానికి వస్తున్నాయి చీకట్లు.

పూర్తి వెలుగు లేకపోయినా, షాడో చేతిలో ఉన్న పుల్లను చూసి, నోరు వెళ్ళబెట్టింది వృద్ధురాలు. 'బంగారం తండ్రి... అది అసలు సిసలు మేలిమి బంగారం' అంటూ గబుక్కున లేచి అతని దగ్గరికి వచ్చింది.

'దాన్ని చూడాల్సిన అవసరం లేదు పెద్దమ్మ. ఇదిగో దీన్ని చూడు' అంటూ గోతిలో నుంచి ఒక వస్తువును తీసి ఆమెకు అందించాడు గంగారాం.

చేతులు జాచి దాన్ని తీసుకున్నది పెద్దావిడ.

సిద్ధంగానే ఉన్నాడు షాడో. చటుక్కున చేతులు జాచి ఆమెను గట్టిగా పట్టుకున్నాడు.

***

'మేడమ్... చిత్తడి నేల మొదలు కాబోతున్నది. చీకటిపడిన తర్వాత ప్రయాణం చాలా కష్టం. ఎక్కడయినా టైర్లు దిగబడితే బయటికి లాగటానికి చాలా శ్రమపడాల్సి వస్తుంది' బురద నేలకు అరఫర్లాంగు దూరంలో వెహికల్‌ని ఆపుతూ మిచిషీకి చెప్పాడు డ్రైవర్.

'హుహుశాన్ సారు దగ్గర్నించి మనం తీసుకు వచ్చిన వస్తాదు ఎంతదూరం పోయి ఉంటాడు?' అడిగింది మిచిషీ.

'చాలా ఫాస్టుగా పరిగెత్తాడు మేడమ్. కుంగ్‌ఫూ మనిషి కదా. స్టామినా చాలా ఎక్కువగా ఉంటుంది. అలుపు, ఆయాసం వంటివి వాళ్ళకి పడవు. ఈపాటికి చిత్తడినేల మధ్యలోకి వెళ్ళిపోయి ఉండాలి' తనలో తను ఏవేవో లెక్కలు కడుతూ చెప్పాడు డ్రైవర్.

'మరి మనవాళ్ళు?' అడిగింది మిచిషీ.

'మనవాళ్ళు వెహికల్స్‌లో కదా వెళ్ళింది. వెలుగు ఉండగానే ప్రయాణం మొదలుపెట్టారు. మూడొంతుల దూరం పోయి ఉండచ్చు' అన్నాడు అతను.

'మనం దగ్గర లేకుండా ఈ కుంగ్‌ఫూ మనిషి మనవాళ్ళ దగ్గరికిపోతే లేనిపోని రగడ మొదలవుతుందని నా అనుమానం. ఏం చేద్దాం?' అడిగింది ఆమె.

'మీరు అలా అనుకునేటట్లయితే వెళ్ళగలిగినంత దూరం వెళ్ళి, ప్రాబ్లమ్ ఎదురయితే బండిని వదిలేద్దాం' అన్నాడు డ్రైవర్.

ఆ మాట వెంటనే నచ్చేసింది మిచిషీకి.. రెండో మాట మాట్లాడకుండా తల ఊపింది.

గేర్లు మార్చి వెహికల్‌ని ముందుకు కదిలించాడు డ్రైవర్. పక్కలకు చూడకుండా దృష్టినంతా ఎదుట ఉన్న నేలమీదనే కేంద్రీకరించాడు. అంటీ అంటనట్టు టైర్లను ముద్దాడటం మొదలు పెట్టిన బురద మరో పది నిమిషాల పాటు ప్రయాణం చేసేసరికి టైర్లను పూర్తిగా ఆవరించుకోవటం మొదలైంది.

హెడ్‌లైట్లు వేశాడు డ్రైవర్. మనసులోనే తన గార్డియన్ ఏంజెల్స్‌ని ప్రార్థించటం ప్రారంభించాడు.

ఉన్నట్లుండి ఒక్క కుదుపు కుదిపింది కారు. 'అయ్యబాబోయ్... పడిపోతున్నాం మేడమ్. ఏదో పెద్ద గుంటలోకి దొర్లిపోతున్నాం' ఆందోళన నిండిన కంఠంతో బిగ్గరగా అరిచి, బ్రేకుల మీద కాలు వేశాడు అతను.

గేర్లు వేగంగా మార్చి కారును వెనక్కి తీసుకుపోవాలని అతని ఉద్దేశం. మారటమైతే మారాయి గేర్లు. వెహికల్ మాత్రం ఒక్క అంగుళం కూడా వెనక్కి జరగలేదు సరికదా. బుడ బుడమని శబ్దాలు చేస్తూ కిందికి వెళ్ళిపోవటం మొదలెట్టింది.

'ఊబి... ఊబి నేలలోకి వచ్చాము మేడమ్' అని అరుస్తూ, తన పక్కన ఉన్న డోర్‌ని తెరిచి బయటికి దూకాడు డ్రైవర్.

మందంగా ఉండే పోలీస్ బూట్లు బురదలో కూరుకుపోయాయి. బార్లా తెరచిన డోర్‌ని గట్టిగా పట్టుకుని, ఒక పాదాన్ని పైకి వేసి మరో అడుగు వేయబోయాడు.

పైకి లేవవలసిన పాదం పొరపాటున కూడా కదలలేదు సరికదా, మరో ఆరు అంగుళాలు బురదలోకి దిగబడిపోయింది.

'ఇటు రావద్దు మేడమ్. అవతలి నుంచి దిగండి' కారు డోర్‌ని మరింత గట్టిగా పట్టుకుంటూ బిగ్గరగా అరిచాడు అతను.

తన వైపున్న డోర్‌ని తెరిచిన మిచిషీకి తెలిసి వచ్చింది భయంకరమైన బురద వాసన. హేండ్ కర్చీఫ్‌తో ముక్కుల్ని మూసుకుంటూ కుడి పాదాన్ని బయట పెట్టింది ఆమె.

పెట్టినవెంటనే మోకాలిలోతుకు దిగబడిపోయింది కాలు. గట్టిగా డోర్‌ని పట్టుకుని తమాయించుకోవటానికి ప్రయత్నిస్తున్న సమయంలో తెలిసివచ్చింది, తమకంటే ముందుగానే తన కారు బురదలో దిగబడిపోతున్న విషయం.

**(ఇంకా వుంది)**

## ఉపమ – ఉపమా

*దేవులపల్లి, కాటూరి ఒకరి భుజాన ఒకరు చేతులేసుకుని, గుంటూరులో కరుణశ్రీగారింటి కొచ్చారు.*



*కరుణశ్రీ "రండి, రండి కృష్ణార్జునులు" అన్నారు. ముగ్గురూ సాహిత్య విషయాలు మాట్లాడుకుంటుండగా లోపల్నుంచి వేడి వేడి ఉప్మా ఫలహారంగా వచ్చింది.*

*కాటూరి ఉప్మాతింటూ "కరుణశ్రీ ఒకమాట! ఇందాకటి నీ ఉపమ కంటే ఈ ఉపమా చాలా బాగున్నది" అన్నారు.*

**—సేకరణ ఎస్.తారకరామారావు**



## సరదాగా....

### తెలివి

రత్తాలు నాలుగిళ్ళలో పనిచేస్తూ పిల్లలను చదివించుకుంటోంది. శ్యామల ఇంట్లో కూడా ఆమే పనిచేస్తుంది. ఆరోజు ఇల్లు తుడుస్తుంటే, శ్యామల రత్తాలుతో "ఏమిటే, వీధీ వాడా విశేషాలు?" అంటూ సాగదీసింది. దానికి రత్తాలు "ఆ... ఏముంటాయమ్మా? అత్తాకోడళ్ళ తగువులాటలు, అన్నదమ్ముల ఆస్తిగొడవలు...ఇవేగా..." అంది. అంతలోనే

**రత్తాలు:** "అవునమ్మగోరూ... సెప్పటం మరిచా... మొన్నరేతిరి నాకో కలొచ్చిందమ్మా! కల్లో మీరు నాకు వంద రూపాయలు ఇచ్చేసినారండి" అంది నవ్వుతూ.

**శ్యామల:** "దాందేముందిలేవే... ఈ నెల జీతంలో ఆ వంద రూపాయలు కట్‌చేసుకుని ఇస్తాలే..."

**రత్తాలు:** "అలాగేనమ్మా! అన్నట్టు నిన్నరేతిరి ఇంకో కల వచ్చిందమ్మా! కల్లో నేనే మీకు రెండొందలు ఇచ్చానమ్మగోరూ..." అంటూ లోపలికి వెళ్ళింది.

### ఒక ప్రశ్న?

రాష్ట్రస్థాయి బ్యాడ్మింటన్ పోటీలు జరుగుతున్నాయి. శశాంక్, ప్రత్యూష్ ఇద్దరూ తుది పోరుకు చేరుకున్నారు. ఫైనల్ జరిగే ముందురోజు రాత్రి ఇద్దరూ ప్రశాంతంగా నిద్రపోయారు. అయితే ఈ పోటీలో గెలవడం శశాంక్‌కు అనివార్యం. అతడు ఈ రాష్ట్రస్థాయి పోటీలో విజయం సాధిస్తే, పాయింట్లు మెరుగుపడి, అంతర్జాతీయస్థాయి పోటీల్లో పాల్గొనే అవకాశం లభిస్తుంది. కాబట్టి ఈ మ్యాచ్ గెలవాలని శశాంక్ పట్టుదలగా ఉన్నాడు. ప్రత్యూష్ ఇప్పుడిప్పుడే దేశవాళీ పోటీల్లో నిలదొక్కుకుంటున్నాడు. కాబట్టి అతనికి కూడా ఈ పోటీ ఎంతో కీలకం. తెల్లవారింది. పోటీ ప్రారంభమైంది. మొత్తం ఐదు సెట్లు ఆడారు. మూడు సెట్లు గెలిచి శశాంక్ విజయం సాధించి, అంతర్జాతీయ పోటీలకు అర్హత సాధించాడు. అయితే ఇక్కడ ప్రశ్న ఏమిటంటే, కింద ఇచ్చిన క్లూల ఆధారంగా శశాంక్ ఏ సెట్లో ఎన్ని పాయింట్లు సాధించాడో చెప్పగలరా? ప్రయత్నించండి.

1) రెండో సెట్‌లో మొదటి సెట్టుకన్నా 5 పాయింట్లు ఎక్కువ సాధించాడు.
2) మూడో సెట్‌లో రెండో సెట్టుకన్నా ఆరు పాయింట్లు తక్కువ.
3) మూడో సెట్ కన్నా 11 పాయింట్లు ఎక్కువగా నాలుగో సెట్‌లో వచ్చాయి.
4) నాలుగో సెట్‌లో 20 పాయింట్లు సాధించాడు.
5) ఐదో సెట్‌లో నాలుగో సెట్ కన్నా 8 పాయింట్లు తక్కువగా సాధించాడు.

**సమాధానం**

*ఇచ్చిన క్లూల ఆధారంగా శశాంక్ మొదటి సెట్‌లో 10, రెండోసెట్‌లో 15, మూడో సెట్‌లో 9, నాలుగో సెట్‌లో 20, ఐదో సెట్‌లో 12 పాయింట్లు సాధించాడు.*

# తీన్ మార్














# కాళీయుని బంధనం:యశోద విషాదం

**తీర్థయాత్రార్థమై అటుగా వచ్చి అక్కడి మర్రిచెట్టును చూశారు వాసుదేవుడు, భరద్వాజుడాది మహర్షులు. సువిశాలమై చూపును ఆకట్టుకుంటున్న ఆ మర్రిచెట్టుకి ప్రదక్షిణ నమస్కారాలు చేశారు. చెట్టుకింద కూర్చున్న గోపాలురును చూశారు. యమునాతీరంలో ప్రమాదంలేని రేవు ఎక్కడ ఉన్నదని వారిని అడిగారు. తెలియదంటే తెలియదని చెప్పి, ఆట పట్టించారు గోపాలురు. గమనించాడది కృష్ణుడు. తప్పు అని చెప్పి, మహర్షులకు నమస్కరించాడు. చెప్పాడిలా.**

మహర్షులారా! వీరెవరికీ రేవులగురించి పెద్దగా తెలియదు. నాకు తెలుసు, నేను చెబుతాను, ముందు మీరు అనుష్ఠానం ముగించుకుని రండి. ఇక్కడికే రండి. ఈ మర్రిచెట్టు నీడన మీగడ పెరుగుతో రంగరించిన చల్దివంటకం రుచి చూద్దురుగాని. అలాగే చక్కరతో చేసిన పాయసం కూడా స్వీకరిద్దురుగాని. చల్దులువద్దు, పాయసం వద్దంటే...అప్పుడే పితికిన వేడివేడి ఆవుపాలిస్తాం, ఆరగించండి.

ప్రేమతో పలురకాలవంటకాలు సమర్పిస్తానంటున్న ఈ యువకుడు ఎవరై ఉంటారని ఆలోచనలో పడ్డారు మహర్షులు. వారి ఆలోచనలు గ్రహించినట్టుగా చెప్పాడిలా కృష్ణుడు.

నా పేరు కృష్ణుడు. నేను నందగోపుని కుమారుణ్ణి.

పక్కనున్న అన్న బలదేవుణ్ణి పరిచయం చేస్తూ మళ్ళీ చెప్పాడిలా.

ఇతడు బలదేవుడు. మా అన్నగారు.

గోపాలురను ఉద్దేశించి అన్నాడిలా.

వీరంతా నా మిత్రులు. అదిగో ఆ ఆలమంద లన్నీ మావే!

కృష్ణుని మాటలువింటూ, అతని తేజోవైభవాన్ని గమనిస్తూ మహర్షులు విస్తుపోసాగారు. గొల్లవారిలో ఇలాంటి అత్యద్భుత స్వరూపులు జనించే అవకాశం లేదు. మరి ఈ కృష్ణుడు ఎవరై ఉంటాడు? దీర్ఘాలోచన చేశారు మహర్షులు. సమాధినిష్ఠులైనారు. బలరామకృష్ణుల పూర్వచరిత్రను తెలుసుకున్నారు. కళ్ళు తెరిచి, చేతులు జోడించి, కృష్ణునికి నమస్కరించారు. స్తుతించారిలా.

దేవాధిదేవా! ఎంతగా ప్రయత్నించినా బ్రహ్మాదులకే నీ దర్శనభాగ్యం లభించదు. అలాంటి నిన్ను ప్రత్యక్షంగా చూడగలిగాం. గోపాలక అవతారంలో నిన్ను దర్శించుకున్నాం. మా వేదాధ్యయనం, మా యజ్ఞయాగాదిక్రియలూ ఇన్నాళ్ళకు ఫలించాయి. జగత్తు సృష్టిస్థితిసంహారాలకు కారణభూతుడవు. నీ మాయను కనుగొనలేం. సూర్యచంద్రులు నీ నేత్రాలు. నీ జిహ్వ సరస్వతీదేవి. పర్వతాలు నీ దంతాలు. సత్యలోకం నీ మస్తకం. లక్ష్మీదేవి నీ వక్షస్థలం. కుమార గణాధినాయకులు నీ కుడి ఎడమ భుజాలు. సముద్రాలు నీ హస్తాలు. ఆకాశం నీ కుక్షి. అఖిలదేవతలంతా నీ కేశాలు. ఆయాశరీరావయవాలే దిశలు. పాతాళలోకమే నీ పాదయుగళి. పురుషోత్తమా! విశ్వమూర్తివై వేదాలను ఉదయింపజేశావు. యజ్ఞయాగాల నిర్వహణను ఈ లోకంలో వ్యాప్తి చేశావు. సత్కర్మలన్నిటికీ నువ్వే ఏకైక కారకుడవు.

నిరంజనమూర్తివి నీవు. నిన్నేదీ అంటదు. నీకేమీ అక్కరలేదు. అయినా లోకకల్యాణంకోసం అవతారాలెత్తి ఆర్తులను ఆదుకున్నావు. వరాహమూర్తివై హిరణ్యాక్షుణ్ణి సంహరించి, భూదేవతను ఉద్ధరించావు. నారసింహుడవై హిరణ్యకశిపుని వధించి, ప్రహ్లాదునికి అభయం ఇచ్చావు. వామనావతారంలో నీ వింతలింతని వర్ణించడం ఎవరి తరం? పరశురామస్వరూపంలో సహస్రబాహువు కార్తవీర్యార్జునుని సంహరించావు. రామావతారంలో రావణుణ్ణి వధించావు. నాటి నీ శుభకృత్యాలు మాకు వీనులవిందులు. ఇప్పుడు బలరామకృష్ణులుగా జన్మించి, భూలోకసముద్ధరణకు నడుము బిగించావు. నీ వెంటనంటి ఉన్న ఈ గోపాలకులందరూ ధన్యులు. నీ సంచారభాగ్యం సాధించిన ఈ అరణ్యసీమ పరమపునీతం. నిన్ను కుమారునిగా కన్న ఆ యశోదానందులు పుణ్యమూర్తులు. నీ శిరోభూషణం ఆ నెమలిపింఛం ఎంత ధన్యతనొందిందో! నీ మురళి అమృతస్వరూపమే! వేయేల! భువనవంద్యా! నిన్ను అంటిపెట్టుకుని ఉన్న ప్రతి వస్తువూ పునీతమే!

తనని కీర్తిస్తున్న తాపసులను చూసి ముసిముసినవ్వులు నవ్వాడు కృష్ణుడు. అలరించాడు వారిని. మరోసారి చేతులు జోడించి కృష్ణునికి నమస్కరించి, సెలవు తీసుకున్నారు మహర్షులు. అక్కణ్ణుంచి నిష్క్రమించారు.

**(పూర్వభాగం:షష్ఠమకండం సమాప్తం)**

మహర్షుల నిష్క్రమణ అనంతరం కృష్ణుడు, స్నేహితులతో ఆడిపాడాడు. ఆసరికి ఆవులన్నీ యమునాతీరం చేరుకున్నాయి. పదండి పదండి అంటూ బలరామునిసహా కృష్ణుడు ఆవులను చేరుకున్నాడు. ఆవులను చేరుకునే సమయంలో కృష్ణునికి కాసింతదూరంలో మడుగు ఒకటి కనిపించింది. అది ఒకయోజనం పొడవు, వెడల్పుతో ఉంది. అందులో వేలకొలది విషసర్పాలు ఉన్నాయి. వాటి విషజ్వాలలవల్ల కళపెళ ఉడుకుతోందది. ఆ మడుగుపైనుండి ఏ పక్షులెగిరినా ప్రమాదమే! విషజ్వాలలకు మాడిమసైపోతాయి. సర్పాలపూత్కారాలతో చుట్టుపక్కలంతా కారుమబ్బులు కమ్ముకున్నట్టుగా ఉంది. అంత పెద్దమడుగు దగ్గరలో ఉన్నా, ఒక్క నీటిచుక్కకూడా పనికిరాకుండాపోతోంది.

తదేకంగా ఆ మడుగునే చూస్తూ అనుకున్నాడిలా కృష్ణుడు.

గరుత్మంతునికి భయపడి, కాళీయుడు ఈ మడుగులో దాగున్నాడని తెలిసింది. పరివారంసహా ఆ పన్నగాధిపతి ఇందులో నివసిస్తోన్న కారణంగానే ఈ మడుగు ఇంత భయంకరమైంది. ఇంత పెద్దజలాశయం ఎందుకూ కొరగాకుండా ఉంది. సాహసించి కాళీయునితో తలపడితే! అతని గర్వోద్ధతిని అణచివేస్తే...అప్పుడు ఈ నీరు అందరికీ ఉపయోగపడుతుంది. కాళీయునిసహా అతని అనుచరగణాలు బృందావని చుట్టుపక్కల పోరాడి, పశువులను హింసిస్తున్నాయి. చూస్తూ ఊరుకోవడం పొరపాటు. ముందు కాళీయుని పనిపట్టాలి. అతని పని పడితే ఆ తర్వాత అనుచరగణాలు వాటంతటవే పరుగుదీస్తాయి. వేరే చోటుకి తరలిపోతాయి.

అనుకున్నది సాధించేందుకు ఉద్యుక్తుడయ్యాడు కృష్ణుడు. మిత్రులు, బలరామునిసహా మడుగుదగ్గరగా నడిచాడు. చేతిలోని వేణువుని మిత్రులకి అందించాడు. ఏమైంది? ఎందుకు ఈ వేణువు మాకు అందిస్తున్నావు? అని అడిగిన మిత్రబృందానికి ఎలాంటి సమాధానమూ ఈయలేదు. గట్టునున్న కడిమిచెట్టెక్కాడు కృష్ణుడు. చెట్టెందుకు ఎక్కుతున్నావని గోలగోల చేసింది మిత్రబృందం. దానికీ సమాధానం లేదు. చెట్టు చిటారుకొమ్మమీదికి చేరుకున్నాడు కృష్ణుడు. అక్కణ్ణుంచి మడుగులోకి దూకాడు. మహాసము

**అనుకున్నది సాధించేందుకు ఉద్యుక్తుడయ్యాడు కృష్ణుడు. చెట్టు చిటారుకొమ్మకుచేరి మహాసముద్రంలో మందరపర్వతం పడ్డట్టు మడుగులోకి దూకాడు. కృష్ణుడు అలా పడటంతో పెద్ద పెద్ద కెరటాలు లేచి తీరాన్ని ఢీకొన్నాయి. ఉవ్వెత్తున తరంగాలు లేచి ఒడ్డునున్న మిత్రబృందాన్ని తాకాయి. భయకంపితమైపోయింది మిత్రబృందం. అప్పుడా మిత్రబృందం ఏం చేసింది? ఇంతకీ కృష్ణుడు సాధించాలనుకున్నదేమిటి?**



ద్రంలో మందరపర్వతం పడ్డట్టుగా పడ్డాడు. కృష్ణుడు అలా పడడంతో ఆ మడుగులోని నీరు ఒక్కసారిగా పైకి పొంగి, తుళ్ళింది. పెద్దపెద్దకెరటాలు లేచాయి. తీరాన్ని ఢీకొన్నాయవి. అటూ ఇటూ తిరుగుతూ మడుగును కలచియాడాడు కృష్ణుడు. కృష్ణుని కలచియాటలో ఉవ్వెత్తుగా తరంగాలులేచి, ఒడ్డున ఉన్న మిత్రబృందాన్ని భయకంపితుల్ని చేశాయి.

జలాశయంలో ఏమిటి ఈ కల్లోలం? భూకంపంలా ఏమిటి ఈ గందరగోళం? అనుకున్నాడు కాళీయుడు. కళ్ళు తెరచి చూశాడు. కృష్ణుడు కనిపించాడతనికి. అంతే! రోషించాడు. కస్సుబుసకొట్టాడు. కృష్ణుని మీదికి విజృంభించాడు. పడగలెత్తాడు. ఆ పడగలు ఆకాశాన్ని అంటాయి. పూత్కరించాడు. అతని కోరలనుండి వెలువడిన విషజ్వాలలు నలువైపులా అలముకున్నాయి. ఆ జ్వాలలు అమరులకు అలజడి కలిగించాయి. శరీరాన్ని జలాశయం అంతటా విస్తరించాడు కాళీయుడు. కృష్ణుణ్ణి అదిమి పట్టాడు. అతనికి మూర్ఛావేశం కలిగించాడు. కృష్ణుడు స్పృహ తప్పడంతో అదే అదనుగా కాళీయుని పుత్రులూ, అనుచరులూ ఒక్కసారిగా అతన్ని చుట్టుముట్టారు. కాట్లతో ముంచెత్తారు.

విషసర్పాలవలలో కృష్ణుడు చిక్కుకున్నాడు. కాటేస్తున్నాయవి. కృష్ణుడు స్పృహకోల్పోయాడు. గమనించారది గట్టుమీది మిత్రబృందం. బృందావనిలో అందరికీ చెప్పేందుకు పరుగుదీశారు. దక్షిణదిశలో కోసు దూరం పరిగెడితేనేగాని బృందావని అందదు. పరుగుదీసి పరుగుదీసి చేరుకున్నారక్కడికి. అందరికీ చెప్పారిలా.

కృష్ణుడు కావాలనే కాళీయునిమడుగులోకి దూకాడు. మడుగునంతా కలచివేశాడు. కాళీయునికి కోపం తెప్పించాడు. దాంతో కాళీయుడూ, అతని అనుచరులూ కృష్ణుని చుట్టుముట్టారు. అతన్ని పదే పదే కాటేశారు. కృష్ణుడు స్పృహకోల్పోయాడు. ఈ సంగతి యశోదానందులకు చెప్పాలి. చిన్నపిల్లలం మేము చెబితే బాగోదు. పెద్దలు మీరు వెళ్ళి చెప్పండి. అలాగే కృష్ణుని కాపాడండి! రండి!

అయ్యయ్యో అన్నారు పెద్దలు. గోపకుమారులను అనుసరించారు. కొందరు ఆయుధాలు పట్టుకుని పరుగుదీశారు.

కాళీయునిమడుగులో కృష్ణుడు కకావికలు అవుతున్నాడన్న సంగతి తెలిసి, యశోద స్పృహ కోల్పోయింది. అంతలోనే తేరుకుంది. ఏడుస్తూ పరుగుదీసింది. కృష్ణా! కృష్ణా! అంటూ కొడుకుకోసం ఏడుస్తూ, పడుతూ లేస్తూ పరుగుదీస్తున్న యశోదను ఓదార్చేందుకు బంధువులు ఎంతగా ప్రయత్నించినా వీలుకాలేదు. ఆమెను అనుసరించారంతా. కాసేపటికి అంతా మడుగును సమీపించారు. సంభ్రమాశ్చర్యభయాలతో మడుగులోనికి తొంగిచూశారు.

కృష్ణుడు కావాలనే దూకాట్ట!

అవునవును! నేనూ విన్నాను! ఆ పిల్లాడు ఎప్పుడూ అంతే! దుందుడుకు స్వభావి.

స్వభావం ఏదైతేనేం? అందరిక్షేమంకోసమే అతను అలా చేస్తాడు. పెద్దలు చెయ్యలేని పనిని, పిల్లాడుగా అతను చేస్తాడు.

పదిమందికోసం పాటుపడేవాడికి ఆపద రమ్మన్నా రాదు. కృష్ణుడికి ఏమీకాదు. అతను ఎప్పటిలాగే ఈ ప్రమాదం నుండి బయటపడతాడు. అతని లీలలు మనం ఎన్ని చూడలేదు?

ఎవరికి తోచిన విధంగా వారు మాట్లాడుతున్నారేగాని, ఎవరికీ ఎలాంటి ధైర్యమూ లేదు. ఎందుకంటే... మడుగులో, కాళీయుని గట్టిపట్టులో పల్టీలు కొడుతున్న కృష్ణుని చూసి బెంబేలెత్తుతున్నారంతా.

ఆసరికి అక్కడికి నందుడు కూడా చేరుకున్నాడు. యశోదను ఓదారుస్తూ అతనూ విలపించసాగాడు. మడుగులో కృష్ణుని అవస్థలు చూసి అప్పటికి రెండుసార్లు వాళ్ళిద్దరూ స్పృహకోల్పోయారు. బంధువుల సపర్యలతో తేరుకుని, దుఃఖిస్తూ కూర్చున్నారు.

ఎన్నిపాపాలు చేశానో! ఎందరి ఉసురుపోసుకున్నానో! లేకపోతే తనకు పిల్లాడిగాపుట్టి కృష్ణుడు ఇన్ని బాధలు ఎందుకు పడతాడు? మహాగుణశాలిని కృష్ణుణ్ణి కన్నానని అంతా తనను అభినందించారు. తనని అభినందించడం ఆ దైవానికి ఇష్టంలేదేమో! ఇలా చేశాడు. ఎన్ని ప్రమాదాలను తట్టుకోలేదు కృష్ణుడు? ఎన్ని గండాలనుంచి గట్టెక్కలేదు? ఇప్పుడూ అలాగే జరుగుతుందేమో! జరిగితే బాగుణ్ణు అనుకున్నాడు నందుడు. ఏడుస్తున్న యశోదను చూశాడు. ఓదార్పుగా దగ్గరగా తీసుకున్నాడామెను. కాళీయునితో పోరాడుతున్న కృష్ణుణ్ణి చూస్తూ యశోద ఇలా విలపించసాగింది.

నాన్నా! నాతండ్రీ! అతిలోకమహిమలు నీ సొంతం. నిన్ను ఈ కాళీయుడు ఏమీ చెయ్యలేడు. ధైర్యం తెచ్చుకో! పోరాడు. రోటికి కట్టి వేధించానని, నన్ను ఏడిపించాలని ఇప్పుడిలా కావాలనే కాళీయునితో ఓడిపోతున్నావా? నేనంటే నీకిష్టమే కదా కృష్ణా! ఎందుకింతలా నన్నేడిపిస్తున్నావు? తల్లిని ఇలా బాధపెట్టడం భావ్యం కాదయ్యా! చూడు! ఇటు చూడు! నీ గోవులన్నీ దిక్కూమొక్కూ లేక, దారీతెన్నూ తెలియక ఎలా కళవళపడుతున్నాయో! జాలిలేదా? రావయ్యా! రా! ఆ కాళీయుని మదమణచి పైకి రా! మమ్మల్ని అక్కునచేర్చుకో!

నందుని నిస్సహాయత, యశోద విషాదం అక్కడివారిని కలతపెట్టింది. అంతా శోకించారిలా.

కృష్ణుడంతటి అందగాడూ, కృష్ణుడంతటి గొప్పవాడూ మళ్ళీమళ్ళీ జన్మించే అవకాశం లేదు. యశోదకు వచ్చిన కష్టం ఎంతటి శత్రువుకైనా రాకూడదు. ఆ తల్లి కడుపున పుట్టిన మాణిక్యం, కాళీయుని కాట్లతో బొగ్గవుతున్నాడే! ఆ సాధ్విని ఓదార్చడం ఎవరితరం?

కృష్ణుని అవస్థచూసి మిత్రబృందం ఆందోళన చెందింది. ఏం చెయ్యాలిప్పుడు? ఏం చేస్తే బాగుంటుందని ఆలోచనలు చేసింది. కొందరైతే కృష్ణుడిలాగే తామూ మడుగులోకి దూకి, కాళీయుని పనిపట్టాలన్నారు. అతని అంతుచూడాలన్నారు. మరికొందరైతే కాళీయునితోనూ, అతని పరివారంతోనూ మనం పోరాడలేం. చనిపోతాం. పోదాం! కృష్ణునితోపాటు మనమూ మరణిద్దాం. అంతేగాని ఇలా గట్టున నిలబడి నిశ్చేష్టులై ఉండడం భావ్యం కాదన్నారు. చంద్రుడులేని రాత్రిని చుక్కలు చూడలేవన్నారు.

ఆందోళన చెందుతున్న తల్లిదండ్రులనూ, మిత్రులనూ, ప్రజలనూ చూసి ఆలోచించాడిలా బలదేవుడు. తానెవరు? ఓ దివ్యావతారం. కృష్ణుడెవరు? అతనూ ఓ దివ్యావతారమే! మరెందుకు ఈ కష్టాలంటే...తమ్ముడికి తానెవరో తెలియకే ఇదంతా అనుకున్నాడు. తానెవరో తమ్ముడికి తెలియజెప్పాలి. చెబుతాననుకున్నాడు బలదేవుడు. ఎలుగెత్తి కృష్ణుణ్ణి హెచ్చరించాడిలా.

—అరణి



# సంగతులూ! సందర్భాలూ!




-ఇంద్రగంటి శ్రీకాంతశర్మ సెల్:98480 78079

**1939 – శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి అనే ఆయన తెలుగు, సంస్కృత భాషల్లో గొప్ప పండితులు. ఆ ఏడు వాళ్ళబ్బాయికి పెళ్ళి చేయాలని నిశ్చయించారు. అప్పుడా అబ్బాయి, వివాహ మంత్రార్థాలు తెలుసుకునిమరీ పెళ్ళి చేసుకోవాలనుందని తండ్రిని కోరాడు. ఆపళంగా శాస్త్రిగారు 'పాణిగ్రహణం' అనే ఒక పుస్తకం వ్రాసి వివాహమంత్రాల అర్థం తేటతెల్లంగా తెలియ చెప్పారు. ఆ చిన్న పుస్తకం చదివితే సంప్రదాయ పెళ్ళిళ్ళలో గల విశేషార్థాలు తెలుస్తాయి.**

# 'ఢాం'పత్య జీవితాలు

ఈ సందర్భంగా మనం గ్రహించవలసిన ముఖ్యవిశేషం ఏమంటే: ఏ నియమ నిబంధనలైనా, తాత్త్విక సూత్రాలైనా, రాజకీయ ఆదర్శాలైనా – అవీ ఇవీ అనేముంది? సర్వవిధ నిర్వచనాలు, వచనాలు కాగితాలమీద చదువుకోవడానికి ఉన్నంత గొప్పగా, ఆచరణలోకి వచ్చేసరికి మిగలవు. మనుషులు రకరకాల ప్రలోభాలకీ, స్వార్థాలకీ, రహస్యపు ఒప్పందాలకీ ఒడికట్టి – తమకి అనుకూలంగా మార్చేసుకున్న సామాజిక విషయాల్ని సంప్రదాయాలుగా చెలామణీలోకి తెచ్చేస్తూ ఉంటారు. మనం శ్రద్ధగా మూలాలలోకి వెళ్ళిచూస్తే – అసలు రహస్యాలు బయటపడతాయి.

ప్రపంచ జనజీవన చరిత్ర పరకాయించి చూస్తే – అన్నిదేశాల, మతాల, సమాజాల్లోనూ, స్త్రీ పురుష సంబంధ సామాజిక నియమాలూ – వివాహ వ్యవస్థ ఒకదానికి లోబడి ఉంటాయని తేటతెల్లమవుతుంది. ఏ విధమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకైనా, షరతులు వర్తిస్తూనే ఉంటాయి. భారతీయ వివాహ సంప్రదాయాలన్నీ ఆసేతు హిమాచలం ఒక్కలాగే కూర్చోలేదు. వైదిక సంప్రదాయాన్ని అనుసరించే వివాహ వ్యవస్థ సూత్రబద్ధంగా ఆదర్శవంతమైనదే.

అసలైన విశేషం ముఖ్యమైనది ఇక్కడ మరొకటి ఉంది. ఈ వైదిక విధానంలో వధూవరుల ఎంపిక చిత్రంగా ఉంటుంది. ఇక్కడ వరుడి తల్లిదండ్రుల ప్రమేయం ఉండదు. అతడే తనంత తానుగా తన భార్యకాదగిన అమ్మాయిని వెదుక్కోవాలి. అందుకోసం ప్రత్యేకించి తగిన పెద్ద మనుషుల్ని తానే ఎంచి, పంపించుకోవాలి. ఈ వసతి ఆడపిల్లకి లేదు. కన్నతండ్రి ఎవరికి 'దానం' చేస్తే, అతగాడే ఆమె భర్త. ఇక్కడ ఆడపిల్ల తండ్రి పాత్ర చాలా బలమైనది. స్పష్టంగా ఆమె క్షేమం అన్నివిధాలా నిస్వార్థంగా, ఏ ప్రలోభాలకు గురికాకుండా నిర్వర్తించాలి.



ఎందుకంటే ఈ వైదిక సంప్రదాయంలో ఆడపిల్లకు ఎనిమిదేళ్ళ వయస్సు దాటదు. చదువుసంధ్యల విషయంలో గాని, కాబోయే వరుడి మానసిక వ్యవస్థను అంచనా వేయడంలో గాని, ఏ మాత్రం బెసిగిపోయినా – ఆ పిల్ల జీవితం నాశనమైపోయినట్టే.

ఈ సున్నితమైన అంశాన్ని గుర్తులో ఉంచుకునే, కన్నతండ్రి తరువాత ఆ పిల్ల బాధ్యతను జీవితమంతా అత్యంత ఆదరంగా, బాధ్యతగా వహించవలసిన "వరుడు" ఈ ప్రమాణం చెయ్యవలసి ఉంటుంది.

"నాతో ఏడడుగులు నడిచిన నువ్వు నా సఖివి. నీ స్నేహం నుంచి నేను విడిపోను. నువ్వూ విడిపోవద్దు. ఏ పనిచేసినా ఇద్దరం కలిసే సంకల్పిద్దాం. ఒకళ్ళనొకళ్ళం ప్రేమిస్తూ, మన కలయిక సార్థకమయ్యేలాగ, మనసులు కలిసి వ్యవహరిద్దాం. నువ్వు పృథివి, నేను ఆకాశం, నేను మనస్సు, నువ్వు వాక్కు, నేను రేతస్సు, నువ్వు దానిని భరించేదానివి. నా ఐశ్వర్యాన్ని పంచుకోవడానికీ, నాకొక పుత్రుణ్ణి ప్రసాదించడానికీ, నాతోరా...."

ఇలాగ కొనసాగుతుందా ప్రతిజ్ఞ.

నువ్వు నాకు ప్రధానురాలవై నా శిరస్సుపై అధిరోహించు. అత్తమామలపై "సంరాజ్ఞవి" కా! నీ ఆడబిడ్డపై "సంరాజ్ఞవి"కా! మా ఇంటికోడళ్ళ పైని, అత్త మామల పైని, నా సోదరులపైని, నీకు కలగబోయే సంతానం పైని, నా ధనం పైని, ఆధిపత్యం వహించు..."

కొత్తగా కాపురానికి వచ్చే వధువు కూడా సంతోషంగా జీవించగల వాతావరణం అత్తవారింట్లో కూడా ఉండి తీరాలనే మంత్రాల వివరణ కూడా – వైదిక వివాహ విధిలో ఉంది.

ఇదంతా వ్రాతపూర్వక నిబంధన. పెళ్ళితంతులో భాగంగా–పురోహితుడు వరుడుచేత ఏకరువు పెట్టించడం ఆచారంగా మిగిలింది.

కాలక్రమంలో జరిగిన దుర్మార్గం: వరుడు తన భార్యకాదగిన అమ్మాయిని, వరుడి తల్లిదండ్రులు ఎంచడానికి వదిలెయ్యవలసి వచ్చింది. కట్నాల బేరసారాలు ప్రాముఖ్యంలోకి వచ్చాయి. పెళ్ళిచూపుల ప్రహసనాలు మొదలయ్యాయి.

నిజం చెప్పాలంటే – పెళ్ళంటే – ఒక వాతావరణంలో ఒక స్వభావ సౌకుమార్యాలతో పెరిగే మొక్కని, పూర్తిగా పెళ్లగించి, వేరే వాతావరణంలో నాటడం లాంటిది. మిగతా సమాజాల సంగతి అలా ఉంచి – మన తెలుగు సమాజంలో పొరలు పొరలుగా అనేక దుర్మార్గాలు జరిగిపోయాయి. కొన్నితరాలకు తరాల స్త్రీల జీవితాలు, భగ్గంపాడు

అయిపోయాయి. ఆడపిల్లని 'మైనస్' అనీ, 'పెళ్ళిచేసి వదల్చుకోవడం' – అనీ, సిగ్గులేని నిర్వచనాలు పుట్టుకొచ్చాయి. మగపిల్లవాడికీ, ఆడపిల్లకీ పెళ్ళిళ్ళ వయసు అంతరం 10–15 ఏళ్ళ తేడాతో నడిచింది.

"అమ్మాయీ కాపురం ఎలాగుంది?" అంటే,

"మోచేతిమీద దెబ్బలా ఉంది నాన్నా" అనే పాటి పరిస్థితుల్లో రకరకాల సమస్యలమధ్య. కాపురాలు గడిచిపోయాయి – ఇదొక దశ.

ఇంకొకదశ ప్రారంభమైంది. అమ్మాయికీ, అబ్బాయికీ చదువులు కావాలి. పెళ్ళయ్యాక అమ్మాయి ఉద్యోగం చేయాలి. ఆమె సంపాదన, 'దున్నేవాడిదే భూమి' సామెతగా భర్తవైపు వారికే దక్కాలి. ఓపికున్నంతకాలం అటు ఉద్యోగం, ఇటు ఇంటిపని ఆమె చేయాలి. ఆర్థిక స్వాతంత్ర్యంలాగా పైకి కనిపించే అదనపు చాకిరీ యిది – ఇట్టి దశకూడా, అనేక అన్యాయాల మధ్య, ఉద్రిక్తల మధ్య గడిచాయి. ఇంకా అవశేషాలు గడుస్తున్నాయి.

ప్రస్తుత కాలం మూడవ దశ – ఇదొక అత్యంతం విచిత్రదశ. అదేమిటో కొంచెం వివరిస్తాను.

నాకు పత్రికలు ఏవి చూసినా, "వివాహ సంబంధాలు" ప్రకటనలు చూడడం ఒక ముచ్చట. అటు ఆడపిల్లని కోరేవారూ, ఇటు మగపిల్లాణ్ణి కోరేవారూ ఒకటే లక్ష్యంతో ఉన్నారు. బి.టెక్. ఎం.బి.ఎ – ఈ అర్హతలు లేకపోతే పెళ్ళే లేదు. ఇక ఏ చదువులూ, ఉద్యోగాలూ, బలాదూరే – సాఫ్ట్‌వేర్ హుజూర్.

ఈ దెబ్బతో దాంపత్య సంబంధాల స్వరూప స్వభావాలు విప్లవాత్మకంగా మారిపోయాయి.

దాంపత్యం ఒక అగ్రిమెంట్.

నీ అకౌంట్లు నీవి. నా అకౌంట్లు నావి. నీ ఖర్చులు నీవి. నా ఖర్చులు నావి. నీ తల్లిదండ్రుల బాధ్యత నాకు వద్దు. నీకూ నాకూ కుదరకపోతే, నీ దారి నీది, నా దారి నాది. పెళ్ళి శాశ్వత (జీవితం తప్ప) ఒప్పందం కాదు.

స్త్రీ పురుషులు మధ్య "సెక్సు" ఒక కొంతకాలపు ఆకర్షణ. అదేమీ బంధం కావలసిన అవసరం లేదు.

"ప్రస్తుత స్థితి ప్రధానం. భవిష్యత్తు ఇప్పుడెందుకు?"

ఉద్యోగానికి నిలకడ అవసరంకాదు.

దాంపత్యానికీ నిలకడ అవసరం లేదు–

ఈ ప్రాతిపదికమీదనే కులాంతర, మతాంతర దాంపత్యాలు, అపార్ట్‌మెంట్ కల్చరూ, ఒక మోస్తరుగా చెల్లుతున్నాయి. దాంపత్యాలు వ్యక్తిగత అభిరుచులూ, ఆరోగ్యం, అందచందాల ఆకర్షణలతో ప్రారంభమై అసహనాలు, అనుమానాలు, అవమానాల అనుబంధాలుగా పరిణమిస్తున్నాయి.

అబ్బాయి అమ్మాయిని, అమ్మాయి అబ్బాయిని ఎంచుకునే స్వాతంత్ర్యం ఎప్పటికీ గొప్పదే. కాని, ఆర్థిక స్వాతంత్ర్యం ఘనమూ, ఆకర్షణ, అనుబంధం అల్పమూ అయిపోయే సంస్కృతిలో అశాంతితప్ప అభ్యుదయం లేదుగాక లేదు.

ఆలోచిస్తూంటే నాకు పురాణ ఇతిహాసాల్లోని పంచపతివ్రతలు గుర్తుకొస్తున్నారు.

వాళ్లు: సీత – సావిత్రి – అనసూయ – ద్రౌపది – దమయంతి – ఈ అయిదుగురూ భుజాల చుట్టూ కొంగులు కప్పుకుని, వినయభారంతో ఏనాడూ నడుములు వంగిపోయి బతకలేదు. క్లిష్ట సందర్భాలు వచ్చినప్పుడు ఎదుట నిలబడి గట్టిగా ప్రశ్నించారు. ఆక్షేపించవలసినచోట ఆక్షేపించారు. దాంపత్యాల్ని ఎవరినీ లోకువచెయ్యనివ్వలేదు. వాళ్ళు చెయ్యలేదు. ప్రేమించారు. ప్రేమింపబడ్డారు. కట్టుకున్న వాళ్ళ స్వభావాలు తెలిసి – అత్యంత స్వతంత్రంగా వ్యక్తిత్వాలు కలిగి తమకంటూ కీర్తి తెచ్చుకున్నారు. కష్టదశల్ని ఓర్చుకున్నారు. తెలిసీ తెలియని "అబ్బేదవ భావుకులు" ఆక్షేపిస్తే యేంగాక! వాళ్ళు ఏం సాధించినా, జంటబాయక సాధించారు.

ఏ దాంపత్యానికయినా–

ఆకర్షితులై ఏకం కావడమూ – వికర్షితులై విడిపోవడమూ ఎప్పటికీ గొప్ప కాదు.

కలిసి బతికి, కడవరకూ నడవగలగడమే గొప్ప–

రా.వి.శాస్త్రిగారు వేరేసందర్భంలో చెప్పినట్టు. "తప్పులైతే అందరూ చేస్తారు. త్యాగాలు కొందరే చెయ్యగలరు".

## పింగాణి భవనం

**పిం**గాణి వస్తువులు చూడడానికి ఎంతో ఆకర్షణగా కనిపిస్తాయి. వాటిపట్ల జాగ్రత్తగా లేకపోతే అంతే సంగతులు. మరి అలాంటి పింగాణిని ఒక టూల్‌గా వాడుకుని ఏకంగా పింగాణి భవనమే నిర్మించింది ఓ చైనా బామ్మ. ఆ బామ్మ వయసు *86* సంవత్సరాలు. వృద్ధాప్యంలో ఉండి కూడా, 'నేనేం చేయగలను?' అనుకోకుండా అనుకున్న లక్ష్యం సాధించింది ఆ బామ్మ. ఆమె పట్టుదల ముందు ఆ లక్ష్యం చిన్నబోయింది. లక్ష్య సాధనకు నిబద్ధతతో కృషి చేయాలి. అలాంటి కృషే చేసి అనుకున్నది సాధించింది ఆ బామ్మ. ఆవిడ గురించి మీరూ తెలుసుకోండి!

ఆ బామ్మ పేరు యు ఎర్మెయ్. తూర్పు చైనాలో ఉన్న జింగ్‌డెజెన్ ఆమె నివాసం. ఆ ఊరును సిరామిక్స్ క్యాపిటల్‌గా అభివర్ణిస్తారు. పుష్కరకాలంగా అక్కడే నివసిస్తున్న ఈ బామ్మ ఇంతకీ ఏం చేసిందంటారా, ప్రపంచంలోని వివిధ దేశాల నుంచి సేకరించిన సిరామిక్ (పింగాణి) ముక్కలతో ఏకంగా ఒక పెద్ద ప్యాలెస్ కట్టేసింది. ఇంతకీ ఆమెకు ఈ ఆలోచన ఎందుకొచ్చిందంటే సిరామిక్ బిజినెస్ చేయాలనే ఆసక్తి కలిగింది ఎర్మెయ్‌కి. మొదట ఓ సిరామిక్ కంపెనీలో లేబర్‌పని చేస్తూ క్రమేణా సొంతంగానే సిరామిక్ ఫ్యాక్టరీలు పెట్టే స్థాయికి ఎదిగింది. అలా బిజినెస్ వ్యవహారాలు చూసుకుంటున్న సమయంలో ఆరేళ్ళక్రితం ఆమెకో ఆలోచన వచ్చింది. తను నివసిస్తున్న ప్రాంతంలోనే ఓ సిరామిక్ ప్యాలెస్ నిర్మించాలని నిర్ణయించుకుంది. వయసు మీరిపోయింది, ఇలాంటి పనులేమీ వద్దు, విశ్రాంతి తీసుకోమంటూ కుటుంబ సభ్యులు ఆమె నిర్ణయాన్ని వ్యతిరేకించారు. కానీ ఆమె ససేమిరా అంది. సిరామిక్ ప్యాలెస్ నిర్మాణమే తన జీవిత లక్ష్యమని తేల్చి చెప్పేసింది. తన జీవితంలో ఎన్నో తీపి గుర్తులు, ఎన్నో అనుభవాలను నింపిన ఆ ఊర్లో తన జ్ఞాపకార్థం ఒక సిరామిక్ ప్యాలెస్ ఉండాలని పట్టుబట్టింది. దాంతో కుటుంబ సభ్యులు చివరకు ఆమెతో ఏకీభవించి తమ వంతు సహాయం కూడా అందించారు.



అయితే, ఎర్మెయ్ అప్పటికే తన వ్యాపారంలో భాగంగా ప్రపంచంలోని వివిధ దేశాల నుంచి గత ముప్పైఏళ్ళుగా సుమారు *60*వేలకు పైగా సిరామిక్ ముక్కలు సేకరించింది. వాటితో ప్యాలెస్ నిర్మించాలనే ఆలోచన అప్పటికి ఆమెకు రాలేదు. కానీ ఒకసారి తియాంజిన్‌లో ఉన్న సిరామిక్ హౌస్‌ను ఎర్మెయ్ సందర్శించింది. అది చూశాక జింగ్‌డెజెన్‌లో కూడా సిరామిక్ ప్యాలెస్ కడితే బాగుంటుందన్న ఆలోచన కలిగింది. ఈ భవంతి నిర్మాణానికి ఆమె ఐదేళ్ళు కష్టపడింది. ముందుగా జింగ్‌డెజెన్‌లో ఒక చిన్న స్థలం కొని, ఆ *60*వేల సిరామిక్ ముక్కలతో ప్యాలెస్ నిర్మాణానికి శ్రీకారం చుట్టింది. ప్యాలెస్ లోపలి గోడలపై చైనా సంస్కృతికి ప్రతిబింబమైన వివిధ రకాల ఆకృతులను తీర్చిదిద్ది ప్యాలెస్ మొత్తాన్ని సిరామిక్ ముక్కలతో అలంకరించడంతో అది ఎంతో సుందరంగా రూపుదిద్దుకుంది. కిటికీలకు కూడా సిరామిక్ ముక్కలనే వాడటం విశేషం. ఈమొత్తం ప్యాలెస్ నిర్మాణానికి మన కరెన్సీ ప్రకారం, దాదాపు ఐదుకోట్లకు పైగా ఖర్చయిందట.

ఈ పింగాణి భవనం పర్యాటకులను విపరీతంగా ఆకర్షిస్తోంది. అయితే భవంతి లోపలికి పర్యాటకులను అనుమతించడంలేదు. బహుశా అక్టోబర్ *1*నుంచి భవంతి లోపలి అందాలు తిలకించే అవకాశం ఉందంటున్నారు. ఇది పర్యాటక ప్రాంతంగా అభివృద్ధి చెందితే ఆ ప్రాంతంతో ఉపాధి అవకాశాలు పెరుగుతాయి అంటోంది ఎర్మెయ్ బామ్మ.

# సంకల్పం

**-వి.రాజారామమోహనరావు**



**పదేళ్ళుగా వ్యాపారం బావుంది. ఇనప వ్యాపారం, నూనె వ్యాపారం అందరికీ కలిసి రావని కొంతమంది భయపెట్టారు. అయినా సుదర్శనం ధైర్యంగా ముందడుగు వేశాడు. చిన్నగా ప్రారంభించిన నూనె వ్యాపారం, ఆరు నెలలు ఓ మాదిరిగా నడిచింది. ఆ తర్వాత దినదినాభివృద్ధి అన్నట్టు పెరుగుతూ వచ్చింది. ఉన్న ఇల్లు కాక, ఈ పదేళ్ళ లాభాలతో మరో రెండిళ్ళు కొన్నాడు. కొంత డబ్బు వడ్డీలకి తిరుగుతోంది. ఆదాయానికేం లోటు లేదు. ఒక్కడే కొడుకు. వచ్చే సంవత్సరం పదో తరగతికి వస్తాడు. మంచి స్కూల్లో చదువుతున్నాడు.**

సంసారం, వ్యాపారం, కొడుకు చదువు అన్నీ బావున్నాయి. చుట్టూ ఎవర్ని చూసినా ఏదో సమస్య. ఆర్థిక సమస్యో లేకపోతే ఆరోగ్య సమస్యో. వీటికితోడు ఒకరితో మరొకరికి పొసగని రకరకాల గొడవలు. పరాయివాళ్ళకన్నా అన్యాయంగా ప్రవర్తిస్తున్నారు రక్తసంబంధీకులు. తల్లిదండ్రులకి పిల్లలకి పడటం లేదు. భార్యాభర్తలకి ఒకరిమీద మరొకరికి నమ్మకం లేదు. త్యాగం, ఆదర్శం, మరొకరికి సేవ చెయ్యటం లాంటివి చాదస్తంగా మారిపోయాయి. సజావుగా, సవ్యంగా బతికేవాళ్ళు, మంచికోసం నిలబడేవాళ్ళు అరుదుగా కనిపిస్తున్న గడ్డుకాలం. కొత్త ధర్మాలు, కొత్త నీతులు పుట్టుకొచ్చాయి. ముందు నువ్వు సుఖంగా ఉండు. నువ్వు సుఖంగా ఉండాలంటే డబ్బు సంపాదించు. నీ తెలివితేటలు, నీ అస్తిత్వం డబ్బు సంపాదించటానికే. ఆ సంపాదించటానికి ఓ హద్దు లేదు. అదో తీరని దాహం. ఎంత సంపాదించినా, డబ్బు సరిపోని చిత్రమైన ఆర్థిక మాయాజాలం. అన్నీ చేరి ఎవరికీ తృప్తిలేని జీవితం. నిరంతర ఆరాటం. ఇలాంటి జీవితం ఎదురుగావున్నా, సుదర్శనానికి ఇంతటి విశ్లేషణా శక్తి లేదు. కానీ స్థూలంగా అతనిలో ఓ గట్టి అభిప్రాయం. చాలామందిలా తనకి ఇబ్బందులు లేవు. తన జీవితం బావుండటం గొప్ప అదృష్టం, భగవంతుడి దయ.

ఈ నూనె వ్యాపారం ప్రారంభించక ముందు, సుదర్శనం చేసిన వ్యాపారాలేవీ అంతగా కలిసి రాలేదు. చాలా రకాల ఇబ్బందులు పడ్డాడు. ఈ వ్యాపారం కూడా మొదటి ఆరు నెలలూ, అంతంత మాత్రమే. వివిధ రకాల వంటనూనెలు, కొబ్బరి నూనెలు అతని కొట్లో ఉండేవి. వాటి అమ్మకం మీద ఎంత మిగిలితే దాంతోనే సంతృప్తి పడేవాడు. ఆరు నెలల తర్వాత వంటనూనెల బ్రోకర్ వీర్రాజుతో పరిచయమైంది. అతను ఓ కొత్త ఉపదేశం చేశాడు. "సుదర్శనంగారూ, మార్కెట్లోని అన్ని అవకాశాలు ఉపయోగించుకోవాలి. లేకపోతే వ్యాపారంలో వెనకబడిపోతాం. మీరు బ్రాండెడ్ సరుకే అమ్ముతున్నారు. ఇందులో కన్నా సెకండ్ వెరైటీ నూనెల్లో మార్జిన్ చాలా ఎక్కువ. మీరు సరేనంటే, సరుకు సరఫరా సంగతి నేను చూస్తా. నెల తిరిగేటప్పటికి ఎంత లాభపడతారో చూసుకోండి" అన్నాడు. "రెండో రకం మూడోరకం అంటే కల్తీనూనా" అడిగాడు సుదర్శనం. "అలా అనుకోకూడదు. మీరు ఇప్పుడు అమ్ముతున్న నూనెకన్నా కొంచెం నాణ్యత తక్కువ. నాణ్యతని బట్టే రేటు కదా. పెద్దరేట్లు అందరూ భరించలేరు. అలా భరించలేనివాళ్ళు ఇవి కొనుక్కుంటారు. వాళ్ళకీ మనం నూనె దొరికేలా చూడాలి కదా" అంటూ వీర్రాజు నెమ్మదిగా సుదర్శనాన్ని తన దారికి మళ్ళించాడు.

సుదర్శనం లాభాలు పెరిగాయి. కల్తీనూనె వ్యాపార లావాదేవీలన్నీ అలవాటయ్యాయి. విపరీతంగా పెరిగిన లాభాల రుచి వంటబట్టేటప్పటికి, సుదర్శనంలో జంకు పోయింది. వీర్రాజు చెప్పినట్టు కేవలం నాణ్యత తక్కువ నూనెలే కాదు అవి. ఒకసారి పెద్ద హోటళ్ళలోనో, క్లబ్బులలోనో వాడేసిన నూనె తిరిగి అమ్మటం ఓ రకం. మరీ వాడేసిన నూనెకి మరికొంత నూనె కలిపి రోడ్లమీద బళ్ళ వ్యాపారులకు అమ్మటం మరోరకం. ఇంతేకాక పూర్తి కల్తీనూనెలు, అంటే జంతువుల కొవ్వు, తదితర పదార్థాల నుంచి తయారు చేసిన నూనెల వివరాల్లోకి వెడితే ఎంత భయంకరమో, జుగుప్సాకరమో చెప్పలేం. కానీ ఇదంతా అధునాతన వ్యాపారంలో, లాభాలవేటలో ఓ భాగం. ఆ వలయంలో సుదర్శనం చేరిపోయాడు. కొత్తలో కొంత బెరుకు ఉండేది. రాను రాను ముదిరిపోయాడు. చెలామణీలో ఉన్న వ్యాపారంలో తనూ ఓ భాగమనే కొత్త నీతితో సరిపెట్టుకున్నాడు. ఇదంతా సుదర్శనానికి ఈనాటి జీవన విధానంలాగే ఉందితప్ప, తప్పుగా అనిపించలేదు. తేలిగ్గా డబ్బు వచ్చిపడుతుంటే జీవితం చాలా ఉత్సాహంగా ఉంటుంది. దానికితోడు పరిస్థితులు అనుకూలిస్తే మరింతగా బావుంటుంది. వచ్చిన ఆదాయం జాగ్రత్తగా మదుపు చేశాడు సుదర్శనం. ఏ లోటూ లేనట్టు గడుస్తున్నాయి రోజులు.

అకస్మాత్తుగా కొడుకు సుజన్‌కి జబ్బు చేసింది. అంతవరకు ఎప్పుడూ అంతగా కలత పడలేదు సుదర్శన్. కొడుకు పొద్దున లేస్తూనే కడుపునొప్పి అన్నాడు. వాంతులు మొదలై కాస్సేపటికి ఆ నొప్పి తట్టుకోలేని స్థితికి చేరింది. డబ్బుకి ఇబ్బంది లేదు.

**పదేళ్ళుగా నూనె వ్యాపారం చేస్తున్నాడతను. నాణ్యమైన సరుకే. మొదట అంతంత మాత్రంగానే ఉన్నా ఆ తర్వాత క్రమంగా వ్యాపారం పుంజుకుంది. రెండిళ్ళు కొన్నాడు. డబ్బు నిలవ చేశాడు. ఒక్కగానొక్క కొడుకు. పెద్ద స్కూల్లో చదువుతున్నాడు. జీవితం సంతృప్తిగా సాగిపోతోంది అతడికి. కానీ చుట్టూ సమాజంలో ఎన్నో సమస్యలు, కొత్త నీతులు చెలామణీ అవుతున్నాయి. ఆ గాలి అతడికీ సోకింది. అప్పుడు ఏం జరిగింది?**

కానీ ఇంట్లో తీవ్ర అనారోగ్య అనుభవం సుదర్శనానికి లేదు. అందుకని బాగా కంగారు పడిపోయాడు. కొడుకుని ఇంటి పరిసరాల్లోవున్న కార్పొరేట్ హాస్పిటల్‌కి తీసుకెళ్ళాడు. వాళ్ళు పరీక్షించి ఇంజక్షన్స్ చేశారు. అరగంటలో నొప్పి తగ్గింది. హమ్మయ్య అనుకున్నారు సుదర్శనం దంపతులు. ఆ అరగంటలోనే ఎంతగానో కంగారుపడి భగవంతుడికి ఎన్నో దణ్ణాలు పెట్టుకున్నారు. నొప్పి తగ్గిపోయిందిగా పిల్లాడిని తీసుకెళ్ళిపోవచ్చు అనుకున్నారు. కానీ "పెయిన్ కిల్లర్‌కి నొప్పి తగ్గిందిగానీ నొప్పి ఎందుకు వచ్చిందో పరీక్షలు చెయ్యాలి" అని "కుర్రాడిని హాస్పిటల్‌లో ఎడ్మిట్ చేయండి" అన్నాడు డాక్టరు. అలాగే ఎడ్మిట్ చేశాడు సుదర్శన్. ఇంక అక్కడినుంచి మొదలైంది అసలు కష్టం. రకరకాల పరీక్షలు, స్కానింగ్ పరీక్షలు అయ్యాక ఫలితం వచ్చేవరకూ నానా యాతన. ప్రతి నిముషం కంగారే. నాలుగు రోజులు ఆ హాస్పిటల్‌లో ఎంత ఆరాటపడాలో అంతగానూ ఆరాటపడ్డాడు సుదర్శనం. 'ఈ పరీక్షలన్నీ డబ్బు లాగటానికే తప్ప అవసరమైన చికిత్స చెయ్యరు' అని కొంతమందీ, 'పరీక్షలు చెయ్యకపోతే జబ్బేలా తెలుస్తుందని' మరికొంతమందీ, ఏది నిజమో? ఏది అబద్ధమో, మంచేదో? చెడేదో తేల్చి చెప్పగలిగిన వాళ్ళు లేరు. ఒకపక్క కొడుకుమీద బెంగ. ఎంతో ఆరోగ్యంగా తిరిగే పిల్లాడికి జబ్బేమిటో తెలియని ఆత్రుత. నాలుగు రోజులు గడిచాయి. సుదర్శనాన్ని డాక్టర్ తన రూమ్‌కి పిలిచాడు. ఆయన చాలా నెమ్మదస్థుడు. సుదర్శనాన్ని ఎదురుగా కూర్చోబెట్టుకుని ముందు చెప్పేది స్థిమితంగా వినమన్నాడు. సందేహాలుంటే అడగవచ్చునని కూడా చెప్పి, నెమ్మదిగా అన్నీ వివరించి చెప్పాడు. "పిల్లాడికి కొద్దిగా లివర్ ఇన్ఫెక్ట్ అయింది. రక్తంలో కూడా కొన్ని తేడాలున్నాయి. కొద్దికాలం శ్రద్ధగా మందులు వాడాలి" అన్నాడు.

డాక్టర్ చెప్పిన కొన్ని సాంకేతిక పదాలు సరిగ్గా అర్థం కాలేదు సుదర్శనానికి. స్థూలంగా విషయం తెలిసింది. పిల్లాడిని ఎంతో ముద్దుగా, జాగ్రత్తగా పెంచుకుంటున్నారు. అలాంటి వాడికి అనారోగ్యం అంటేనే దిగులు కమ్ముకుంది. తన పిల్లాడికి ఈ జబ్బు ఎందుకొచ్చింది? ఎలా వచ్చింది? అదే అడిగాడు డాక్టర్ని. "తినే ఆహారం, అరుగుదల...ఈ రెంటికీ ఆరోగ్యానికీ గట్టి సంబంధం ఉంది. పిల్లలు కదా, ఎన్నో రకాల ఫాస్ట్‌ఫుడ్స్ తింటూ ఉంటారు. దేనివల్లనైనా ఈ జబ్బు రావచ్చు" అన్నాడు డాక్టరు. "మావాడు బైట ఏమీ తినడండి. ఏం తిన్నా ఇంట్లోనే" అన్నాడు సుదర్శనం.

"ఈ వయసు పిల్లలు, స్నేహితులతో కలిసి ఏం చేస్తారో, ఏం తింటారో మనం చెప్పలేం. అయినా ఇంట్లో మాత్రం కల్తీ లేదని చెప్పగలమా? కారం, పసుపు, సెనగపిండి, నెయ్యి, నూనె ఒకటేమిటి అన్నీ కల్తీ చేస్తున్నారు. వాటివల్ల ఎదురయ్యే ఆరోగ్య సమస్యలన్నీ ఇదిగో ఇలా నెమ్మదిగా బైటపడతాయి" అంటూ చివరికి "కల్తీ పదార్థాలతో చేసిన ఆహారాలే దీనికి కారణం" అని తేల్చి చెప్పాడు. మార్కెట్‌లోని అన్ని పదార్థాల్లోనూ చాపకింద నీరులా కల్తీ జరుగుతోందని అందరికీ తెలుసు, ఎవరూ ఏం చేయలేని నిస్సహాయస్థితి..." అన్నాడు. పిల్లాడిని ఇంటికి తీసుకొచ్చినా మనశ్శాంతిలేదు సుదర్శనానికి. మరో ఇద్దరు డాక్టర్లకి చూపించాడు. కల్తీల గురించి వాళ్ళతోటే కాదు, మిత్రులతో కూడా చర్చించాడు. మందులు ఎంత శ్రద్ధగా వాడుతున్నా కొడుకు అప్పుడప్పుడు కడుపునొప్పి అంటూనే ఉన్నాడు. వాంతులు తగ్గలేదు. ఇంట్లో సరుకులన్నీ కల్తీలేనివి తీసుకురావాలని తాపత్రయపడుతున్నాడు సుదర్శనం. ఈ కల్తీ ఇప్పుడు అతడిని ఓ భూతంలా వెంటాడుతోంది. దీనికితోడు ఓ మిత్రుడు ఆ మధ్య వార్తల్లో వచ్చిన విశేషాలు చూపించాడు. కాల్షియం కార్బైడ్‌తో అరటి, మామిడిపండ్లనూ, రకరకాల మందులువాడి ఇతరపండ్లనూ కృత్రిమంగా మగ్గబెడుతున్నారు. ఆకుకూరలే కాక, ఆకుపచ్చగా ఉండే కాయగూరలకీ కాపర్ సల్ఫేట్ వాడి రంగొచ్చేలా చేస్తున్నారు. అవి తినటం అనారోగ్యం మాత్రమే కాదు, దీర్ఘకాలంలో ప్రాణాలే పోయే అవకాశం ఉంది. పాలల్లో మరో రకం కల్తీ. జబ్బు చేస్తే పాలూ, పండ్లూ తినండి అంటారు. అలాంటి వాటివల్లే రోగాలు వస్తుంటే, ఇంకేది దారి? కలుషితమైన నీరు, వాతావరణంవల్ల ఏటా కొన్ని లక్షలమంది రకరకాల రోగాల పాలవుతున్నారు. అసలే బెదిరిపోతున్న సుదర్శనాన్ని ఈ వార్తలు మరింత కకావికలం చేశాయి.

పిల్లాడు కొంచెం నలతగా ఉన్నా, కడుపునొప్పి అని చెప్పినా సుదర్శనానికి చాలా కంగారుగా ఉంటోంది. ఈ కడుపునొప్పి ఎక్కువైపోయి మరే దీర్ఘరోగానికో, ప్రమాదానికో దారి తీయదుకదా! అనే బెంగతో మనస్థిమితం కోల్పోయాడు సుదర్శనం. ఎన్నో పూజలు చేశాడు. ఎందరో దేవుళ్ళకి మొక్కాడు. నాలుగు నెలలకి కొడుకు జబ్బు తగ్గింది. కడుపునొప్పి రావటం లేదు. వాంతులు అవటం లేదు. డాక్టర్ ఇంక మందులు వాడక్ఖర్లేదు అన్నాడు. సుదర్శనం ఆనందం అంతా ఇంతా కాదు.

***

చాలారోజుల తర్వాత కుదుటపడ్డ మనసుతో దుకాణానికి వెళ్ళాడు సుదర్శనం. ఇక తన దుకాణానికి కల్తీ నూనె సరఫరా చేయొద్దని వీర్రాజుకి చెప్పేశాడు. "నువ్వు ఒక్కడివే అమ్మడం మానేస్తే ప్రపంచం మారిపోతుందా? నా మాట విని చాదస్తానికి పోకు" అని వీర్రాజు నచ్చజెప్పడానికి ప్రయత్నించినా సుదర్శనం తన మనసు మార్చుకోలేదు. "ప్రపంచం మారుతుందో లేదో నాకు అనవసరం, నా పిల్లాడి కోసం నేనెంత దిగులు పడ్డానో ఆ దేముడికి తెలుసు. నా వ్యాపారం కారణంగా మరే తండ్రికి ఇలాంటి కష్టం కలగకూడదు" అన్నాడు స్థిరంగా.

"మీ అబ్బాయికి తగ్గిపోయిందిగా, ఇక ఎందుకు భయం? వ్యాపారస్థుడివి, లాభాలు వదులుకోవటం పద్ధతి కాదు" అన్నాడు వీర్రాజు. ఓ క్షణం మనసు తొట్రుపడింది సుదర్శనానికి. చాలా లాభం పోతుంది. ఆ అంకెలన్నీ మనసులో మెదిలాయి. అదంతా కొద్ది క్షణాలే. మరు నిమిషం మామూలుగా అయిపోయాడు. మనింట్లో వాళ్ళమీద మమకారం ఉండాలి. దానితోపాటు, మన చుట్టూ ఉన్న సమాజంలో అందరిమీదా మమకారం ఉంచుకోవటమే సరైన దారి అనిపించింది. "లేదు వీర్రాజు.. నేనింక ఈ కల్తీ వ్యాపారం చెయ్యను. అంతేకాదు నా అనుభవం అందరికీ చెపుతాను. అప్పుడే నాకు తృప్తి. నాలాగే మరో పదిమంది మారి, అలా మాటకు మాట తోడై, ఆపైన ప్రభుత్వం గట్టి చర్యలు తీసుకుంటే అన్నీ మారతాయేమో, సమాజంలో ఆరోగ్యం పెరుగుతుందేమో" అన్నాడు ఓ రకం ఆశతో.

వీర్రాజుకి ఇంకేమీ చెప్పే అవకాశం లేకపోయింది. సుదర్శనం వ్యాపారంలో లాభాలు తగ్గాయి. అయినా అతనికి ఇబ్బందిగా లేదు. ఆ అక్రమ లాభార్జన కంటే మనసులో ఏర్పడిన ఒక రకమైన స్వచ్ఛత, సంతృప్తి, ధీమాలే నిజమైన లాభార్జన అనిపించింది.

**సెల్: 9394738805**






## ఫెయిరీటేల్ హౌస్



ఒక్కొక్కరికి ఒక్కో అభిరుచి ఉంటుంది. కొంతమందయితే ఇంటిని డెకరేట్ చేసుకోవటంలో కూడా తమ ఇష్టాలను చూపిస్తుంటారు. ఆ కోవలోకే వస్తుంది ఈ జంట కూడా. ఇంగ్లాండ్, సోమర్‌సెట్ కౌంటీలోని వెస్టన్ సూపర్ మేర్ పట్టణానికి చెందిన మార్టిన్, జేన్ టౌన్లీ జంట తమ ఇంటిని మధ్యయుగానికి ప్రతీకగా మలచుకున్నారు. ఆనాడు ఇళ్ళు ఎలా ఉండేవో అచ్చంగా అలా మార్చుకున్నారు. ఆ ఇంట్లోకి అడుగుపెడితే చాలు ప్రతి వస్తువూ, ప్రతి అణువూ మధ్యయుగపు ఇంటిని ప్రతిబింబిస్తుంది. ఆ ఇంట్లోని వస్తువులతోపాటు గోడలు, కిటికీలు, ఇంటి పైకప్పు అన్నీ కూడా మధ్యయుగాన్ని తలపించేవే. వీళ్ళ ఆలోచనకు పునాది మాత్రం ఒకానొక కథలపుస్తకం అట. ఆ పుస్తకంలోని ఫెయిరీటేల్ వీళ్ళకి బాగా నచ్చేసి, తమ ఇంటిని కూడా ఆ కథలోలాగా డెకరేట్ చేసుకోవాలని అనుకున్నారు. అంతే... లేడికి లేచిందే పరుగు అన్నట్టుగా మార్టిన్ డీ ఆర్కీ అనే పెయింటర్‌ని నియమించుకున్నారు. అతడు ఆ ఇంటిని మధ్యయుగంనాటి ఇంటిని తలపించేలా మార్చేశాడు. ఇంకా ఇంటిచుట్టూ ప్రాకారాలు నిర్మించారు. కిటికీలు, తలుపులు తోరణాలుగా తలపించేలా తీర్చిదిద్దారు. లోపల డైనింగ్ రూం దగ్గరనుంచి వాష్‌రూమ్‌ల వరకూ అన్నిటినీ మార్చేశారు. హాల్లో గోడలను కత్తులు, షీల్డులతో అందంగా అలంకరించారు. ఇంటిని తమకు నచ్చినట్టుగా తీర్చిదిద్దుకుంటే మనసుకు ఆహ్లాదంగా, ఉత్సాహంగా ఉంటుందంటోంది ఈ జంట.

## నిలబడాల్సిందే!

కదలకుండా కూర్చుని తింటే కొండలైనా కరుగుతాయని సామెత. అలాగే కదలకుండా కూర్చుని చేసే ఉద్యోగాల వల్ల అనారోగ్యం పాలవ్వటం ఖాయమని ఎప్పటికప్పుడు హెచ్చరిస్తూనే ఉన్నారు డాక్టర్లు. దాంతో జపాన్‌లోని ఓ సంస్థ తమ కార్యాలయంలో నిలబడి పనిచేయాల్సిందే అంటూ అందుకు తగిన ఏర్పాట్లు కూడా చేసేసింది.

జపాన్‌లోని ఐరిస్ ఒహ్యామా సంస్థ తమ ప్రధాన కార్యాలయంలో ఉన్న కుర్చీలన్నింటిని తొలగించింది. వాటి స్థానంలో ఉద్యోగులు నిలబడి పనిచేసేందుకు వీలుగా ఎత్తయిన బల్లలను ఏర్పాటుచేసి, వాటిపై కంప్యూటర్లను అమర్చింది. అయితే వీటిని ఉద్యోగులు వంతులవారీగా వినియోగించుకోవాలి. ఒక్కొక్కరికి 45 నిమిషాలు సమయం ఉంటుంది. ఒకవేళ నిలబడలేని వారి పరిస్థితి ఏమిటీ? అనుకుంటున్నారా...అనారోగ్యంగా ఉన్నవారు, నిలబడలేనివారికి మాత్రం కుర్చీలు ఏర్పాటు చేశారు. ఇలా చేయడంవల్ల ఉద్యోగుల ఆరోగ్యంతోపాటు వారిలో సృజనాత్మకత మెరుగుపడుతుందని సంస్థ యాజమాన్యం అంటోంది.





## భలే ఆచారం!

పద్ధతులు, ఆచారాలు, సంప్రదాయాలు ఒక్కోచోట ఒక్కోరకంగా ఉంటాయి. మెక్సికోలో కూడా ఒక వింతైన ఆచారం తరతరాలుగా వస్తోంది. ఆ దేశ మత్స్యకారుల క్షేమం కోసం ఆ దేశంలోని నగర మేయర్లు మొసళ్ళను పెళ్ళి చేసుకుంటారు. దానికి ఓ పెద్ద తతంగమే ఉంటుంది. ఈ మధ్యనే మెక్సికో నగరమైన శాన్‌పెడ్రో హమెలూలా మేయర్ విక్టర్ ఆగ్విలార్ మొసలిని పెళ్ళి చేసుకున్నాడు. ఇలా చేసుకోవటం వల్ల అదృష్టం కలిసివస్తుందట. అంతేకాదు అన్నీ చక్కగా ఏ ఇబ్బందులు లేకుండా జరిగిపోతాయని అక్కడివారి నమ్మకం. అయితే అలా పెళ్ళికి ముస్తాబయ్యే పెళ్ళికూతురిని ప్రిన్సెస్‌గా పిలుస్తారు. ముందుగా దానికి బాప్టిజం ఇస్తారు. ఆ తర్వాతి రోజు వివాహతంతు ఉంటుంది. ఆరోజు చక్కగా దాన్ని ముస్తాబు చేస్తారు. వెడ్డింగ్ డ్రస్ వేస్తారు. మేలిముసుగు కూడా ఉంటుంది. ఆ తర్వాత నగర వీధుల్లో బాజాభజంత్రీలతో ఊరేగించి, మేయర్‌తో వివాహం జరిపిస్తారు. తంతు ముగిశాక సంబరాలు జరుగుతాయి. ఆటపాటలతో, విందువినోదాలతో సరదాగా గడుపుతారు. భలే వింత ఆచారం కదూ!



## బంతిని తిప్పేశాడు

కొంతమంది బాల్‌తో రకరకాల సర్కస్‌ఫీట్లు చేస్తుంటారు. చిటికెన వేలుపై బాల్‌ని గిర్రున తిప్పటం, బాల్‌ని తలపై పెట్టుకుని విన్యాసాలు చేయటం లాంటివి. పంజాబ్‌కి చెందిన సందీప్‌సింగ్ మాత్రం వీటన్నింటికీ భిన్నంగా చేశాడు. బాస్కెట్‌బాల్‌ని టూత్‌బ్రష్‌పై పెట్టుకుని ఈజీగా గిరగిరా తిప్పేశాడు. అదీ ఏ ఐదారు సెకన్లో కాదు ఏకంగా 53 సెకన్లపాటు తిప్పేసి గిన్నిస్‌బుక్‌లో చోటు సంపాదించుకున్నాడు. మొదట తన చూపుడు వేలుతో బాస్కెట్‌బాల్‌ని తిప్పటం ప్రారంభించి, మెల్లగా దాన్ని నోటిలో ఉన్న టూత్ బ్రష్‌పైకి రప్పించాడు. అంతే దాన్ని అస్సలు ముట్టుకోకుండానే బ్రష్‌పై ఆ బాస్కెట్‌బాల్ 53 సెకన్లపాటు తిరిగేలా చేశాడు. గిన్నిస్ రికార్డు కొట్టేశాడు.



—నర్మద వాసిరెడ్డి

# ఆస్తమా - నివారణ హోమియో చికిత్స

మానవుడు జీవించాలంటే ప్రతిక్షణం శ్వాసఎంతో ముఖ్యం.నీరు, ఆహారం లేకపోయిన కొన్ని రోజుల వరకు జీవించగలడు. కాని కొన్ని క్షణాలు శ్వాస లేక పోతే శరీరం నిర్జీవమైపోతుంది, స్వచ్ఛమైన గాలితో మంచి ఆరోగ్యం సమకూరుతుంది. ఆస్తమా వలన దైనందినజీవితంలోచాలాఇబ్బందులుఎదుర్కొం టారు. ఏవైనా వాతావరణంలోమార్పులు, ఆహారంలో మార్పులు, కాలుష్యం, పొగత్రాగడంవలన ఆస్తమా, విజృంభిం చడంతో చాలా ఇబ్బందులు ఎదుర్కొం టారు. ఎక్కడికి వెళ్ళాలన్నా అభద్రత భావనకు లోనవుతారు. ఆస్తమా వలన మరణించేవారు... పేదదేశాలలో, పేదకుటుంబా లలో ఎక్కువ. ఆస్తమా వలన హాస్పిటల్‌లో చేరే వారి సంఖ్య పిల్లలలో ఎక్కువ. ఆస్తమా అనగా సేచ్ఛ లేని శ్వాస, ఊపిరితిత్తులు, దీర్ఘకాలిక శ్వాసకోశ ఇబ్బందినే ఆస్తమా అంటారు. ముఖ్యంగా ఆస్తమా వ్యాధిగ్రస్తులలో అలర్జీ, రియాక్షన్ వల్ల శ్వాసకోశం లో, ఊపిరితిత్తులలో గాలి మార్గంలో శ్వాస పీల్చు కోవటంలో అవాంతరం ఏర్పడుతుంది. ఫలితం గా పిల్లికూతలు, దగ్గు, ఆయాసం, ఛాతీలో నొప్పి వస్తాయి. **ఆస్తమాకు ముఖ్య కారణాలు:** చల్లగాలి (చల్లటి వాతావరణం) దుమ్ము,ధూళి, పొగ(సిగరెట్) అలర్జెన్స్, గడ్డిచెట్లు, ఫంగస్, పొల్యూషన్ అధిక శారీరక శ్రమ వైరల్ ఇన్‌ఫెక్షన్ పిల్లి, గుర్రం, కుక్కవంటి పెంపుడు జంతువుల విసర్జక పదార్థాలు శ్వాసకోశ ఇన్‌ఫెక్షన్స్ ముఖ్యంగా పిల్లలలో... **రోగ నిర్ధారణ:** వంశానుగత చరిత్ర, అలర్జీలు, ఎగ్జిమా, చర్మవ్యాధులు, చిన్నతనంలో శ్వాసకోశ వ్యాధులు శారీరక పరీక్షలు, ముక్కు గొంతు, ఛాతీ పరీక్షలు ఎక్స్-రే, కఫం పరీక్ష, పీ.ఎఫ్.టీ అలర్జీ చర్మపరీక్షలు:. అలర్జెన్స్‌ను ఇంజెక్షన్ ద్వారా ఇచ్చి రియాక్షన్ చూడటం. **స్పైరోమెట్రీ:** శ్వాస మీటర్‌ద్వారా పరీక్ష గుండె, ఊపిరితిత్తులు, రక్త లోపం, కిడ్నీ వ్యాధులు, జీర్ణకోశ వ్యాధులు ఏవైనా ఉంటే వాటి నిర్ధారణ. ఆస్తమాతో జీవించడమెలా? 1.ఆస్తమాతో రోజు వారి పనులు చేసుకునేలా ప్రోత్సహించాలి. 2.రాత్రి, పొద్దున్న వచ్చే శ్వాస ఇబ్బందులను నివారించటం, నిర్మూలించటం, తగ్గించటం. 3.ఎక్కువ శారీరక శ్రమలేని ఉపాధి ఏర్పాటు చేసుకోవటం.4. దుమ్ము ధూళి, పొగ, చల్లటి వాతావరణం నుండి దూరంగా ఉండటం. 5.ప్లాస్టిక్ బ్యాగ్స్, కార్పెట్స్, బెడ్‌షీట్స్, బెడ్స్, బ్లాంకెట్స్‌లో డస్ట్‌మైట్స్ (చిన్నపరాన్నజీవులు) ఉంటాయి. కాబట్టి 10 రోజులకోకసారి ఎండలో వేయుటం, నీటితో శుభ్రం చేయడం. 6. పెంపుడు జంతువులకు దూరంగా ఉండటం చేయాలి.

**రోగనివారణ:**బ్రాంకోడైలేటర్స్, కార్టికో,స్టీరాయిడ్స్, యాంటీబయాటిక్స్, స్ప్రేమందులు.. వీటి వలన వెంటనే ఉపశమనం కలుగుతుంది. కాని వ్యాధి మళ్ళీ తిరగబెడుతుంది. ధీర్ఘకాలికంగా మందులు వాడటం వలన సైడ్‌ఎఫెక్ట్స్, పిల్లల పెరుగుదల లోపాలు, మానసికఆందోళన, జ్ఞాపకశక్తితగ్గటం,బరువు

**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**



పెరగటం వంటివి జరగవచ్చు. యోగా, మెడిటేషన్, చేయడం మంచిది. పొగత్రాగడం,కాలుష్య పదార్థాలకు దూరంగా ఉండటం. స్వచ్ఛ మైన గాలి, నీరు ఉన్న ప్రదేశాలలో నివసించటం బాగా సివియర్ ఆస్తమా వచ్చే వారిలో అది ఆ ప్రదేశం ప్రభావంవల్ల కావచ్చు. ఇలాంటప్పుడు వారు స్థిరపడిన చోటునుంచి వీలైతే ఇతర ప్రదేశానికి మారడం మంచిది.

**హోమియోవైద్యం:**ఈ వైద్యవిధానం ద్వారా ఆస్తమాకు చక్కటి చికిత్సను అందించవచ్చు. ముఖ్యంగా పిల్లలలో అలర్జీలు, శ్వాసకోశ ఇబ్బంది లకు... వారి శారీరక, మానసిక విశ్లేషణ ద్వారా తగిన కాన్‌స్టిట్యూషనల్ ఔషధాన్నిగుర్తించి చికిత్సజరిపితేవ్యాధిని సమూలంగా తగ్గించ వచ్చును.

**వాడదగిన మందులు:**

ఆంటమ్‌టార్ట్, ఆంటిమోనిమ్, ఆర్స్ ఆర్సినిక్ ఆల్బ్ స్పాంజియా, నాట్రంసల్ఫ్, ఆరేలియా, కార్బొవెజ్.



# సంతానలేమి సమస్యకు పరిష్కారం సాధ్యమే

పాశ్చాత్యదేశాల్లోలాగే ఇప్పుడు మనదగ్గర కూడా పని సంస్కృతి విపరీతంగా పెరిగిపోయింది. తమరంగంలో రాణిం చడం కోసం రాత్రి-పగలు తేడా లేకుండా కృషి చేయడం అన్నది ఇప్పుడొక సాధారణ అంశంగా మారింది. దాంతో సరైనవయసులో పెళ్లి కాక, పెళ్లైన వాళ్లలో కూడా పై కారణాల వల్ల మానసిక ఒత్తిడి విపరీతంగా పెరిగి సంతానం కలగ డానికి అవసరమైన హార్మోన్లస్రావాలుసరిగ్గా జరగక, సమస్యలు తలెత్తి, అవి సంతానలేమికి దారి తీస్తున్నాయి. అయితే ఆధునిక విజ్ఞానం పెరిగిన ఈ రోజుల్లో సంతానలేమికి చక్కటి పరిష్కారాలు అందుబాటులో ఉన్నాయి కనుక ఆందోళన చెందనవసరం లేదు.చాలామంది మహిళల్లో నెలసరి సమస్యలున్నా, స్త్రీలలో భర్త కన్నా భార్య వయసు ఎక్కువగా ఉన్నా లేదా భార్యా భర్తలిద్దరూ ఎలాంటి సంతాన నిరోధక పద్ధతులు పాటించకుండా సంవత్సర కాలం పాటు సంతానం కోసం ప్రయత్నించినా గర్భధారణ జరగకపోవచ్చు. మరి కొంతమందిలో కేవలం ఏడాది మాత్రమే గాక.. ఏళ్లు గడుస్తున్నా గర్భం రాకపోవచ్చు. స్త్రీలకే కాదు.పురుషులకు కూడా.. సంతానం కలగలేదంటే అందుకు మహిళను కారణంగా చూపడం మన సమాజంలో పరిపాటి. ఇది కేవలం అపోహ మాత్రమే. సంతానలేమికి కారణాలన్నవి అటు మహిళలలోనూ, ఇటు పురుషుల లోనూ లేదా ఒక్కోసారి ఇద్దరిలోనూ ఉండవచ్చు. అంటేదంపతులిద్దరిలో లోపం ఎవరిలోనైనా ఉండవచ్చునన్న మాట. పురుషుల్లో వీర్యకణాల సంఖ్య తగినంతగా లేకపోవడం కూడా సంతానలేమికి కారణం కావచ్చు. అలాగే స్త్రీలలోనైతే హార్మోన్ల లోపం, థైరాయిడ్ సమస్య పీసీఒడి వంటి అనేక అంశాలు సంతానలేమికి కారణం కావచ్చు. దంపతులిద్దరూ ఎలాంటి గర్భనిరోధక సాధనాలు వాడకుండా, సంతాన నిరోధక ప్రక్రియలను అనుసరించకుండా.. తమ దాంపత్య జీవితాన్ని గడిపితే సాధారణంగా ఏడాదిలోపు 75% మందిలో గర్భం వస్తుంది. ఇక యాభై శాతం మందిలో ఐదు మాసాల లోపే 50% మందిలో గర్భం వస్తుంది. రెండేళ్లలో 90% మందిలో గర్భం వస్తుంది. కానీ ఎవరిలోనైనా అంతకాలం తర్వాత కూడా గర్భం రాలేదంటే, ఏదైనా సమస్య ఉందేమోనని భావించాలి. సమస్యను తెలుసుకోవడానికి స్త్రీలు ముందుకు వచ్చి వైద్య పరీక్షలు చేయించుకున్నట్లుగా, పురుషులు అంత తేలిగ్గా ముందుకు రారు. సంతానలేమికి ముఖ్య కారణాలు.. మన జీవనశైలితో పాటు కాలుష్యం, వాతావరణం,పొగ తాగడం, మద్యం సేవించడం, బిగుతైన దుస్తులు ధరిం చడం, అధికబరువు, మానసిక ఒత్తిడి, కొన్ని రకాల మందులు, ఆరోగ్యకరమైన వీర్యం ఉత్పత్తిపై ప్రభావం చూపిస్తాయి. పురుషుల్లో శుక్రకణాల సంఖ్య తగినంతగా లేకపోవడం, ఉన్నా... వాటిలో తగినంత చురుకుదనం లేకపోవడం వంటి లోపాలు ఉన్నప్పుడు వారి భాగస్వామి కి గర్భధారణ జరగడం కష్టమే, మరికొందరి వీర్యంలో అసలుశుక్రకణాలేఉండకపోవచ్చు. ఇక మహిళ విషయా నికి వస్తే.. నెలసరి సమస్యలు, అండాల విడుదల సరిగా లేకపోవడం లేదా విడుదలైన అండాలలో నాణ్యత లోపించడం వంటివి ప్రధాన కారణాలు, వయసు పెరిగే కొద్దీ అబార్షన్లు అయ్యే అవకాశాలూ ఎక్కువే. మహిళ వయసు 30 ఏళ్లు దాటాక సంతాన అవకాశాలు తక్కువగా ఉంటాయి. సంతానలేమికి ఇప్పుడు అందుబాటులో ఉన్న ఆధునిక పరిష్కారాలు... సంతాన లేమి ఉన్న వారికి ఇప్పుడు మూడు రకాల పరిష్కారాలు అందుబాటులో ఉన్నాయి. అవి 1) ఐ.యు.ఐ.భర్తనుంచి సేకరించిన వీర్యాన్ని ల్యాబ్‌లో పరీక్షించి, దానిలో నుంచి ఆరోగ్యంగా, చురుగ్గాఉన్న కణాలను మాత్రం వేరు చేసి సిద్ధం చేస్తారు. వాటిని ఒక సన్నని గొట్టం ద్వారా స్త్రీ గర్భాశయంలోకి ప్రవేశ పెడతారు. ఈప్రక్రియను అనుసరించడం వల్ల గర్భధారణకు 15% వరకు అవకాశం ఉంటుంది. ఇలా ఆరు రుతుచక్రాల పాటు ఈ చికిత్స చేసినా ఫలితం లేకుంటే అప్పుడు ఐ.వి.ఎఫ్ అనే ప్రక్రియను అనుసరించవచ్చు. 2)ఇక్సీ: స్త్రీ నుంచి సేకరించి న అండా ల్లోకి, పురుషుని శుక్ర కణాన్ని ఒక ప్రత్యేకమైన మైక్రో మానిప్యు లేటర్ సహాయంతో ప్రవేశ పెట్టి ఫలదీకరణం చెందిస్తారు. వాటిని తిరిగి గర్భాశయం లోకి ప్రవేశపెడతారు. ఈ పద్ధతి ద్వారా గర్భధారణ విజయవంతం కావడానికి 40% వరుకు అవకాశాలు ఉంటాయి. శుక్రకణాల సంఖ్య తక్కువగా ఉన్నవారిలో ఈ ప్రక్రియ మరింత ఉపయోగకరంగా ఉంటుంది.

3) ఐ.వి.ఎఫ్: దీన్నే టెస్ట్‌ట్యూబ్ విధానం అంటారు. ముందు గాపక్వమైనఅండాలను స్త్రీ నుంచి బయటకుతీసి, పురుషుడి శుక్ర కణా లతో బయటే ఫలదీకరణం చెందిస్తారు. ఇలా ఏర్పడిన తొలి దశపిండాల్లో రెండు లేదా మూడింటిని తిరిగి స్త్రీ గర్భా శయం లోకి ప్రవేశపెడతారు. ఈ ప్రక్రియ ద్వారా సంతానం కలగడానికి 30 నుంచి 35% విజయావకాశాలు ఉంటాయి. ఇటీవలి కాలంలో సంతాన సాఫల్యత చికిత్సలో మరెన్నో కొత్త విధానాలు అందుబాటు లోకి వచ్చాయి. ఫలదీకరించిన పిండాలలో అతిశీతల పరిస్థితుల్లో ఉంచి తరువాత వాటిని వాడతారు. అవసరాన్ని బట్టి అండాలను గాని శుక్రకణాలను గాని దాతల నుంచి స్వీకరించి వాడతారు. అందుకే సంతానం కలగడం లేదని ఏళ్ల తరబడి బాధపడే కన్నా ఆధునిక పద్ధతులు అనుసరించడం శ్రేయస్కరం.

**- డా॥ సి. జ్యోతి** ఫర్టిలిటీ స్పెషలిస్ట్
**ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం**




**"ఆర్యా, నవనిధుల వేటకు నేను ఎందుకు వెళ్ళాలి?" నిధి ప్రశ్నించాడు.**
**"నవనిధులకోసం నువ్వు వెళ్ళడం మంచిదని నాకు అనిపిస్తోంది."**
**"ఆ ప్రయత్నంలో నేను విజయం సాధిస్తానా?"**
**"నాకు తెలీదు"**
**"తెలీదా? మీకు అన్నీ తెలుసన్నారే, ఇందాకా?"**

"నాది తేజో శరీరం. 'అశ్వత్థామ బలిర్వ్యాసో..' అంటూ కొందరు చిరంజీవులలో నన్ను చేర్చారు. వాళ్ళందరూ వరాల ప్రభావంతో చిరంజీవులుగా ఉన్నారు. నేను శాప ప్రభావంతో ఉన్నాను. తేజో శరీరంతో ఉన్న కారణంగా కలియుగంలో నేను కనిపించను. అది అలా ఉంచితే శాపగ్రస్తుడైన కారణంగా నేను భవిష్యత్తును, జరగబోయేదాన్ని దర్శించలేను. వీరదశమి స్పర్థల సందర్భంలో, తదనంతరం రాజమందిరంలో నీతోబాటు నేనూ అదృశ్యరూపంలో ఉన్నాను. మహాభారతంలో కర్ణుడి కులం శస్త్ర విద్యాపాటవ పరీక్షలో అడ్డొచ్చిన ఐతిహ్యాన్ని స్ఫూర్తిగా తీసుకుని నీకు అన్యాయం చేశారు. అది రాజగురువు కుతంత్రం. శ్రమకు ప్రతిఫలం పేరుతో ఇచ్చిన ముత్యాలను విసిరికొట్టిన నీ వ్యక్తిత్వం నాకు నచ్చింది. అప్పుడే నిర్ణయించుకున్నాను, నీకు సహాయం.."

### జరిగిన కథ

**సు**భిక్ష రాజ్యంలో వీరదశమి సందర్భంగా జరిగిన తుది స్పర్థలో నిధిని విజయం వరించినా, అతడు క్షత్రియుడు కానందున పోటీని విరమిస్తున్నట్టు ప్రకటిస్తారు. చక్రవర్తి విజయానందులు బాకీపడ్డ కప్పం వడ్డీతో సహా చెల్లించాలని, లేనిపక్షంలో వియ్యమందాలని లేఖ పంపిస్తాడు. పరిష్కారమార్గంగా జ్యోతిష్కుడు నవనిధుల గురించి చెప్పి అందుకు సమర్థుడు నిధి అని చెబుతాడు. నవనిధులను సాధించి తీసుకురావాల్సిందిగా నిధిని కోరతాడు మహారాజు. వాలీశ్వరుడి ఆలయానికి వెళ్ళిన నిధి ముందు అశ్వత్థామ బహిర్గతమవుతాడు. అతణ్ణి నవనిధుల సాధనకు వెళ్ళమంటాడు.

ఆ తర్వాత...

"ఒక్కక్షణం ఆర్యా..." నిధి అడ్డు తగిలాడు. "ఏ విధమైన సహాయం చేస్తారు?"

అశ్వత్థామ గంభీర కంఠం చిన్నగా నవ్వింది. "ఏ విధమైన సహాయం చేస్తానో, ఏ విధంగా చేస్తానో, ఎప్పుడెప్పుడు చేస్తానో చెప్పను."

"ఆర్యా, నా సందేహం ఏమిటంటే, అవసరమైనప్పుడు నాకు మీరు.."

"జాగ్రత్తగా విను నిధి. నీకు సహాయం ఎప్పుడు అవసరమో నిర్ణయించాల్సింది నువ్వు కాదు. నేను! ఎప్పుడు? ఎలా? ఎందుకు? చేయూత ఇవ్వాలో నేను నిర్ణయించుకుంటాను. నీకు అర్థం కావడానికి చెప్తున్నా, విను. మానవుడికి అప్పుడప్పుడు విధి సహాయం లభిస్తూ ఉంటుంది. అది నిర్ణయించేది విధి. శ్రీకృష్ణుడి సహాయం ఉంటుంది. అయినా అర్జునుడు బాణాలు రువ్వాల్సిందే. యుద్ధం చేయాల్సిందే. ప్రత్యర్థుల బాణాల దెబ్బలు తిని, గాయపడాల్సిందే! అర్జునుడికి ఎప్పుడు సహాయం చేయాలో నిర్ణయించింది కృష్ణుడే! అర్థమైందా?"

నిధి మెల్లగా తలాడించాడు. "నవనిధుల సాహసం నాకు ఇష్టం లేదు. నాన్నకు ఇష్టం లేదు. అమ్మకు ఇష్టం లేదు. చెల్లికి ఇష్టం లేదు. అది ప్రాణాంతకమైన కార్యం అని మా అందరికీ తెలుసు. అందుకే వద్దనుకున్నాం. మీరేమో సాహసం చేయమంటున్నారు..."

"మీ గృహంలో మీ మధ్య జరిగిన సంభాషణంతా నేను స్వయంగా విన్నాను" అశ్వత్థామ కంఠం అంది. "సుభిక్ష రాజ్యంలోని ఏకైక వీరుడివి నువ్వు. అంతేకాదు. ఆస్థాన జ్యోతిష్కుడి జాతక గణన సక్రమంగా ఉంది. గ్రహాలు నీకు అనుకూలంగా ఉన్న విషయమూ నిజమే. అది అలా ఉంచితే రాజ్యంలో ఎవ్వరికీ, చివరికి కాబోయే రాజు కేసరికీ లభించని అవకాశం నీకు లభించింది. మహారాజు నీకు చెప్పింది వీరోచితమైన కార్యం. సాహసోపేతమైన కార్యం. ధైర్యసాహసాలతో సాధించాల్సిన మహత్కార్యం చేసే అవకాశం వచ్చినప్పుడు వీరుడు వదిలి పెట్టరాదు! అలాంటి కార్యసాధన వీరుడికీ, అతణ్ణి కన్నవారికీ, అతను జన్మిం





చిన రాజ్యానికీ కీర్తి ఆర్జించి పెట్టే అంశం! మహావీరుడుగా నిరూపించుకున్న నీ వ్యక్తిత్వానికి 'నవనిధి సాధన' ఒక పరీక్ష! స్వీకరించు!"

"ఆర్యా, నా సందేహం తీర్చండి. ఆ సాధన వల్ల నాకు ఏమిటి లాభం?" నిధి ప్రశ్నించాడు.

అశ్వత్థామ కంఠం చిన్నగా నవ్వింది. "ఒక సాహసకార్యం చేస్తూ స్వలాభాన్ని ఆపేక్షించడం ఉదాత్తుడైన వీరుడి లక్షణం కాదు."

"మీ సూచన గురించి నేను ఆలోచించుకోవాలి.."

"అందుకు అభ్యంతరం ఏముందీ? ఒకరి ఆలోచనా ప్రవాహానికి మరొకరు ఆనకట్ట కట్టలేరు. ఆలోచించుకో.."

"ఆర్యా...." నిధి పిలిచాడు.

సమాధానం రాలేదు. అశ్వత్థామ అదృశ్యరూపం దూరంగా వెళ్ళిపోయినట్టుంది. అంతసేపూ లీలగా అక్కడ వ్యాపించిన దుర్గంధం కూడా వెళ్ళిపోయింది.

నిధి బరువుగా నిట్టూర్చాడు. జరిగినదంతా నిజమా? తన భ్రమా? నిజానికి మహాభారతంలోని అశ్వత్థామ పాత్రే తనకు ఏ మాత్రమూ గుర్తులేదు. గుర్తేలేని ఒక పాత్రను ఆధారంగా చేసుకుని తను భ్రమకు లోనుకావడం ఎలా? ముఖ్యంగా క్రీడాంగణంలో, రాజమందిరంలో, తన ఇంట్లో జరిగిన సంఘటనలనూ, సంభాషణలనూ 'అశ్వత్థామగారి అదృశ్య తేజోరూపం' పొరపాటు లేకుండా ఉటంకించింది.

ఇప్పటికీ సజీవులుగా ఉన్న పురాణ పురుషులలో అశ్వత్థామ ఉన్నట్టు తనకి తెలుసు. అశ్వత్థామ తనను పలకరించడమే అంతులేని ఆశ్చర్యానికి గురి చేస్తోంది. అది భ్రమ కాదు. రామాయణ ప్రవచనం జరిగేచోట ఆంజనేయ స్వామీ, మహాభారత ప్రవచనం జరిగేచోట అశ్వత్థామ ఉంటారని తను విని ఉన్నాడు. భారత ప్రవచన ప్రదేశంలో వ్యాపించే దుర్గంధమే అశ్వత్థామ ఉనికిని నిర్ధారించే అంశం అని పెద్దలు చెప్పుకుంటూ ఉంటే తానూ విన్నాడు.

అశ్వత్థామతో 'ముఖాముఖి' తన భ్రమ కాదు, భ్రాంతీ కాదు. అది నిజం. నిధి ఆలోచిస్తూ బిల్వవృక్షం దగ్గర్నుంచీ కదిలాడు. నవ నిధులకోసం చేసే ప్రయత్నంలో తనకు విజయం లభిస్తుందని మాత్రం అశ్వత్థామ చెప్పలేదు. జరిగిన సంఘటనల్ని మాత్రం

## క్యారెక్టర్ కోసం తెగించింది

**క్యారెక్టర్** డిమాండ్ చేస్తే ఏదైనా చేస్తాం అంటూ చాలా మంది హీరోయిన్లు తరచూ చెబుతుంటారు. కొందరు మాటలకే పరిమితమైతే మరి కొందరు వాటిని ఆచరణలో చేసి చూపెడతారు. హీరోయిన్ పూర్ణ సరిగ్గా ఈ కోవకే చెందుతుంది అంటున్నారు సినీ జనాలు. ఇంత ఉపోద్ఘాతం ఎందుకంటే ఓ సినిమా కోసం పూర్ణ గుండు కొట్టించుకుంది అన్న వార్త ఇప్పుడు బాగా హల్‌చల్ చేస్తోంది. అప్పుడెప్పుడో బాలీవుడ్‌లో ఓ హీరోయిన్ సినిమా కోసం ఇలాంటిపని చేయగా ఇప్పుడు పూర్ణ చేసింది అంటున్నారు. సినిమాల కోసం ఏ త్యాగానికైనా సిద్ధం అని కబుర్లు చెప్పేవారు పూర్ణ త్యాగాన్ని ఆదర్శంగా తీసుకోవాలని సూచిస్తున్నారు.



చెప్పగలనన్నాడు. ప్రయత్నం చేయాలి. వీరుడు సాహసం చేయాలి అనే ప్రబోధం మాత్రం చేశాడు. అందుకు అర్జునుడిని ఉదహరించాడు. ప్రయత్నం చేయమని ప్రబోధించడంలో తనకు తెలియని పరమార్థం ఏదైనా ఉందా? అశ్వత్థామ గురించి నాన్నకు చెప్పాలి. ఆయన అభిప్రాయం తెలుసుకోవాలి. ఊహూ... నాన్న నమ్మడు. ఎవ్వరూ నమ్మరు. అది కొంత కాలం పాటు రహస్యంగానే ఉండాలి.

ఆలోచనల్లో మునిగిపోయిన నిధి తటాలున ఆగాడు. ఎదురుగా సుగాత్రి వస్తోంది. తనవైపే చూస్తూ చిరునవ్వు నవ్వుతోంది. సుగాత్రి తమ వీధిలోనే, నాలుగిళ్ళ అవతల ఉంటుంది. రాణివాసంలో ఆమె పరిచారిక ఉద్యోగం చేస్తోంది. 'రాణివాసం' ఆమెకు బహూకరించిన నగలు సాయంకాలం ఎండలో తళుక్కుమంటున్నాయి. సుగాత్రి తనకంటే పెద్దది.

"నిధీ..." అంది సుగాత్రి దగ్గరగా వస్తూ.

'ఏమిటిలా వచ్చావు?" నిధి ప్రశ్నించాడు.

"యువరాణిగారు వచ్చారు... రాణివాసం కదిలితే మేమూ కదలాలిగా!" సుగాత్రి నవ్వింది.

"ఓహ్... దర్శనానికా?"

"దర్శనానికే. అయితే, దైవదర్శనానికి కాదు; నీ దర్శనానికి!"

"అక్కాయ్, ఏమిటా మాటలు?" నిధి అన్నాడు.

"ఆలయంలో కూడా పరాచికాలేనా?"

సుగాత్రి నిధి ముందు నిలుచుని, తల పైకెత్తి అతని ముఖంలోకి చూసింది. "తమ్ముడితో పరాచికాలా! నిజంగానే నిధీ, నిన్ను చూడ్డానికే వచ్చాం..."

"వచ్చామా?"

"అదే... వచ్చారు.."

"ఎవరూ?"

"యువరాణిగారు.."

"ఇదిగో, అక్కాయ్.. అక్క అని కూడా చూడకుండా ఎప్పుడో నీ చెవులు మెలేసేస్తాను."

"నిజం నిధీ! అమ్మాయిగారు నిన్ను చూడాలన్నారు. అదిగో.. మళ్ళీ మాట దారితప్పింది. అమ్మాయిగారు నీతో మాట్లాడాలన్నారు."

నిధి కళ్ళు చిట్లించాడు. దేనికోసమో వెదుకుతున్నట్టు సుగాత్రి ముఖంలోకి చూశాడు.

"గర్భాలయం వెనక నడవాలో ఉన్నారు. నిన్ను ఒకసారి రమ్మన్నారు."

"...అక్కాయ్" నిధి సందేహిస్తూ అన్నాడు.

"నువ్వు ఇప్పుడు, ఇక్కడ ఉన్నట్టు ఎలా తెలిసిందనుకుంటున్నావా? నేనున్నాగా? నీ మీద ఓ కన్నేసి ఉంచాను. యువరాణిగారి ఆజ్ఞ! రా, వెళ్దాం!" అంటూ సుగాత్రి నిధి చేతిని పట్టుకుంది.

నిధి చేతిని విడిపించుకునే ప్రయత్నం చేయలేదు. ప్రతిఘటించకుండా సుగాత్రితో నడవసాగాడు. ఆలయం ముందు ఆవరణలో పల్లకీ బోయీలూ, నలుగురు పరిచారికలూ ఉన్నారు. సుగాత్రి గర్భాలయం చుట్టూ ఉన్న ప్రదక్షిణపథం వైపు దారితీసింది. కొన్నిక్షణాల్లో ఇద్దరూ గర్భాలయం వెనుకభాగం చేరుకున్నారు.

"అమ్మాయిగారూ, నిధి..." అంది తగ్గుస్వరంలో సుగాత్రి.

"సరే... నువ్వెళ్ళు!" యువరాణి మృదువుగా ధ్వనించింది.

సుగాత్రి నిధి చేతిని వదిలేసి, ముందుకు వెళ్ళమన్నట్టు తలాడించి, నిష్క్రమించింది.

"నిధీ..." యువరాణి ఉత్పల పిలిచింది.

"యువరాణిగారూ..." కొంచెం దూరంలో నిలుచున్న యువరాణి ఉత్పలను చూస్తూ అన్నాడు నిధి. ఆమె గర్భాలయం వైపు ముఖం ఉండేలా నిలుచుంది. ముఖం మేలి ముసుగులో దాగి ఉంది.

"నా మాటలు ఇతరులు వినకూడదు. కొంచెం సమీపానికి రా... సందేహం వద్దు" యువరాణి స్పష్టంగా అంది.

నిధి కొంచెం ముందుకు జరిగాడు. ప్రదక్షిణ పథంలో మసకచీకటిగా ఉంది. ఎక్కడినుంచో చల్లటి గాలి లోనికి వస్తోంది. ఆలయ నిర్మాణంలోని నేర్పరితనం అందుకు కారణం. రాకుమారి తలలో తురుముకున్న పువ్వులు గుబాళిస్తున్నాయి.

**నిధి ఆలోచిస్తూ వాలీశ్వరుడి దర్శనం చేసుకున్నాడు. ఆలోచిస్తూనే తీర్థప్రసాదాలు స్వీకరించాడు. ఆలోచిస్తూనే కొండ దిగుతున్నాడు. అతని ఆలోచనలన్నీ వాళ్ళిద్దరి మధ్యే తిరుగుతున్నాయి. అడ్డుకట్ట లేని నీటిప్రవాహం వలే నిధి ఎడతెగని ఆలోచనలతో సతమతమవుతున్నాడు. అసలు నిధి ఏమాలోచిస్తున్నాడు? అతను అంతగా పనిగట్టుకుని ఆలోచిస్తున్న ఆ ఇద్దరూ ఎవరు?**

"చెప్పండి యువరాణిగారూ.." నిధి గౌరవపూర్వకంగా అన్నాడు.

"మహారాజుగారు నిన్ను నవనిధుల సాధనకు వెళ్ళమన్నారు. ఆ నిధులు ఎందుకో చెప్పారా?" యువరాణి ప్రశ్నించింది.

"చక్రవర్తిగారికి రుణపడిన కప్పం చెల్లించాలనీ, చెల్లించకపోతే యుద్ధ ప్రమాదం ఉందనీ చెప్పారు. మారణహోమాన్నీ, ఇతర ప్రమాదాలనూ నివారించాలంటే ధనం కావాలన్నారు."

"ఇతర ప్రమాదం ఏమిటో నాన్నగారు చెప్పలేదా?" రాకుమారి ప్రశ్నించింది.

"లేదు యువరాణీగారూ."

"అదేమిటో నేను చెప్తాను" రాకుమారి అంది. ఆమె ముఖం గర్భాలయం గోడవైపే తిరిగి ఉంది.

"సంవత్సరాలుగా పేరుకుపోయిన కప్పం సొమ్మును నిర్ణీత సమయంలోగా చెల్లించకపోతే.. నేను.. నేను బలి అయిపోతాను."

నిధి ఆశ్చర్యంగా చూశాడు. రాకుమారి గోడ

## అందుకే అవకాశాలు రావడం లేదట!

శ్రుతిహాసన్ సినిమా చేస్తోందంటే ఆ సినిమా బ్లాక్‌బస్టర్ కావడం ఖాయం అన్న మాట వినిపించేది. ఇదంతా ఒకప్పుడు. ఇప్పుడు పరిస్థితులు తిరగబడ్డాయి. గతంలో ఆమె డేట్ల కోసం ఎదురు చూసిన వారే ఇప్పుడు మరో హీరోయిన్ వైపు చూస్తున్నారు. శ్రుతి పరిస్థితి ఇలా కావడానికి కారణం ఆమె స్వయంకృతాపరాధమే అంటున్నారు సినీ జనాలు. ఉన్నట్టుండి బరువు పెరిగి పోవడం, దానికి తోడు భారీగా రెమ్యున రేషన్ పెంచడం లాంటి కారణాలు శ్రుతిని సిని మాలకు దూరం చేస్తున్నాయనేది కొందరి మాట! శ్రుతి ఈ రెండు విషయాలలో జాగ్రత్త పడితే తిరిగి పూర్వ వైభవం తెచ్చుకోవచ్చు అంటున్నారు.



వైపు నుండి అతనివైపు తిరిగింది. మేలి ముసుగు కొద్దిగా తొలగింది. ఆమె సర్దుకోలేదు.

“కప్పం చెల్లించకపోతే, చక్రవర్తిగారి కుమారు డిని నేను పెళ్ళి చేసుకోవాలి. ఆ యువరాజు కళ్ళు లేని కబోది! పుట్టు గ్రుడ్డి! అంధుడి అర్ధాంగి కావడం నాకు ఇష్టం లేదు.”

నిధి ఆశ్చర్యంతో మౌనంగా ఉండిపోయాడు. ఈ ప్రమాదం గురించి రాజుగారు చెప్పలేదు. అంతః పురానికి సంబంధించిన ఆంతరంగిక విషయం అయి నందువల్ల చెప్పలేదేమో!

“యుద్ధాన్ని నివారించాలంటే కప్పం చెల్లిం చాలి. లేదంటే కన్యాదానం చేయాలి. కోశాగారంలో ధనం లేదు. కప్పం చెల్లించే అవకాశం లేదు. అంతః పురంలో కన్య ఉంది. నరమేధాన్ని తప్పించడానికి నా తండ్రిగారు నన్ను దానం చేసేస్తారు. అది నాకు ఇష్టం లేదు. ఆ ప్రమాదం తప్పించడానికి ఒకే ఒక ఉపాయం ఉంది” రాకుమారి ఆగింది. కొద్దిగా తొల గిన మేలి ముసుగులోంచి నిధి వైపు చూసింది.

“ఆ ఉపాయం ఏమిటో ఊహించగలవా నిధీ?”

ప్రశ్నించిన రాకుమారివైపు చూస్తూ, తల అడ్డంగా ఊపాడు నిధి.

“ఊహించలేను..”

“నేను చెప్తాను...చెప్పనా?”

“చెప్పండి” రాకుమారి ఆ విధంగా మాటలతో చదరంగం ఎందుకు ఆడుతోందో అర్థం చేసుకోలేని నిధి అన్నాడు.

“ఉపాయం.. నా ఆత్మహత్య.”

క్లుప్తంగా అన్న రాకుమారివైపు ఆశ్చర్యంగా చూశాడు నిధి.

“నా ఆత్మహత్యను ఆపే, నిరోధించే అవకాశం నీ చేతిలో ఉంది” రాకుమారి మేలి ముసుగును పూర్తిగా తొలగిస్తూ అంది.

“నా చేతిలోనా?!”

“ఔను నిధీ. నువ్వు ఏం చేస్తే నా ఆత్మహత్యను నివారించగలవో చెప్పనా?” రాకుమారి ప్రశ్నిం చింది.

నిధి మౌనంగా ఉండిపోయాడు. అంతుచిక్కని రాకుమారి మాటతీరు అతన్ని ఆశ్చర్యానికి గురి చేస్తోంది.

“నీ మౌనం చెప్పమంటోంది. చెప్తాను విను. ఆత్మహత్య చేసుకోకుండా నన్ను ఆపాలంటే, నువ్వు కప్పం చెల్లించే శక్తిని మహారాజుగారికి కల్పించాలి...”

“యువరాణిగారూ..”

“అందుకోసం నువ్వు నవనిధుల్ని సాధించి, కోశాగారానికి తీసుకురావాలి!” రాకుమారి అంది. “మహారాజుగారు నిన్ను అభ్యర్థించారు. సాహసం చేయడానికి నిర్ణ యించుకున్నావా?”

“....లే... లేదు”

“నా కన్నతండ్రి అభ్యర్థనకి నా అభ్యర్థనను జత చేస్తున్నాను. నవనిధుల్ని సంపాదించు. మాన ప్రాణాలను కాపాడు!” రాకుమారి అంది.

“మానప్రాణాలా!?” నంది ప్రశ్నార్థకంగా చూశాడు.

“అర్థం కాలేదా? మానం మహారాజుగారిది. ప్రాణం నాది. కప్పం కట్టలేక, యుద్ధం చేయలేక, కబోదికి కన్యను ధారపోస్తే మా తండ్రిగారి మాన మర్యాదలు మంట గలిసిపోతాయి. ఆయన మాన మర్యాదలూ, నా పంచప్రాణాలూ కాపాడబడా లంటే నీ సహాయం, నీ సాహసం అవసరం!” రాకు మారి కంఠం జీరగా ధ్వనించింది.

“నా బావ కేసరి నీతో తలపడ్డాడు. ఓడిపోయాడు. ఓడిపోయి కూడా గెలుపురంగు పులుముకున్నాడు. నవనిధి సాధనకు అతను చాలడు! అది నాకు తెలుసు. అందుకే నిన్ను అర్థిస్తున్నాను. నా ప్రార్థన మన్నిస్తావా?”

“యువరాణిగారూ..”

“ప్రతిఫలంగా నీకు ఏమీ ఇవ్వలేను. ఎందు కంటే ధన, కనక, వస్తు, వాహనాలు ఏవైనా ఇస్తే మహారాజుగారే ఇస్తారు. అలాంటివి బహూకరిస్తా ననడం నా విషయంలో అసంబద్ధంగా ఉంటుంది. నీ సహాయం అర్థించడం ఒక్కటే నేను చేయగలి గింది.”

“యువరాణిగారూ... నేను ఆలోచించుకోవాలి” నిధి మెల్లగా అన్నాడు.

“ఆలోచించవద్దు అనలేను. సానుకూలంగా ఆలోచించు అని మాత్రమే అనగలను..” రాకుమారి అంది. “వస్తాను”.

నిధి అప్రయత్నంగా తల ఊపాడు. రాకుమారి వెనుదిరిగి, గర్భాలయానికి ప్రదక్షిణగా వెళ్ళి పోయింది. నిధి కాసేపు విగ్రహంలా నిలబడి పోయాడు.

***

నిధి ఆలోచిస్తూ కొండ దిగుతున్నాడు. తాను ఆలోచించుకోవాలని ఇద్దరికి చెప్పాడు. అది ఒక సాకు కాదు. నిజంగానే నిధి ఆలోచనల్లో మునిగి పోయి ఉన్నాడు. రాకుమారి వెళ్ళిపోయాక, ఆలోచిస్తూ వాలీశ్వరుడి దర్శనానికి వెళ్ళాడు. ఆలోచిస్తూ దర్శనం చేసుకుని, దండం పెట్టుకున్నాడు. ఆలో చిస్తూ తీర్థం పుచ్చుకున్నాడు. ఇప్పుడు ఆలోచిస్తూ మెట్లమ్మట దిగుతున్నాడు!

నవనిధి సాధనకు ప్రయత్నించడం యోధు డిగా తనకు ఒక సదవకాశం అన్నాడు అశ్వత్థామ.

ధీర, ఉదాత్త యోధుడి ఆత్మగౌరవానికి అదొక పరీక్ష అన్నాడు. ఆ ప్రయత్నం, ఆ సాధన తన ఆత్మ హత్యను ఆపే అమృతస్పర్శ అంది రాకుమారి. అశ్వత్థామగారి మాట ఒక ప్రబోధంగా తనను ఉత్సాహంతో నింపుతోంది. రాకుమారి అభ్యర్థన జాలితో నింపేస్తోంది.

వెడల్పాటి రాతి మెట్లన్నీ దిగి, నిధి పర్వత పాదం చేరుకున్నాడు. ఆగి, ఒకసారి వెనక్కి తిరిగి కొండపైకి చూశాడు. ఆలయ గోపురం, ఒక వైపున బిల్వవృక్షం చిటారుకొమ్మ కనిపిస్తున్నాయి. ఏదో ఆలోచిస్తూ దట్టీలో దోపి ఉంచుకున్న బంగారు నాణేన్ని చేతిలోకి తీసుకున్నాడు. ఆలయంలో హారతి పళ్ళెంలో సమర్పించడానికి అమ్మను అడిగి తీసుకున్నాడు. బుర్రలో సంకుల సమరం సాగిస్తున్న ఆలోచనల ప్రభావంతో హారతి పళ్ళెంలో సమర్పించడం మరచిపోయాడు.

నిధి పెదవులను ఏదో కొత్త ఆలోచన కొద్దిగా విడదీసింది. చిరునవ్వు మొలకెత్తింది. తల పైకెత్తి ఆలయ గోపురం వైపు చూశాడు. గోపురం మీద




స్వర్ణకలశం నీరెండలో మెరిసిపోతోంది. నిధి పిడికిలి తెరచి అరచేతిలోని నాణేన్ని చూశాడు. నాణెం మీద రాజచిహ్నమైన కలశం మెరుస్తోంది. నిధి కళ్ళు మూసుకుని ఏదో సంకల్పించుకున్నాడు. అరచేతిలోని నాణేన్ని బొటన వేలు మీద పెట్టాడు. చూపుడు వేలిని బొటనవేలి కొసకు సంధించాడు.

నిధి బొటనవేలితో బంగారు నాణేన్ని బలంగా గాలిలోకి పైకి చిమ్మాడు. నాణెం మెరుస్తూ రివ్వున పైకి దూసుకెళ్ళింది. నిధి చూపులు నాణేన్ని వెంటాడుతున్నాయి. బాగా ఎత్తుకి చేరుకున్న నాణెం అధోముఖంగా తన ప్రయాణం ప్రారంభించింది. వెడల్పాటి రాతి మెట్టుమీద పడి, అంచు ఆధారంతో గిర్రున తిరగసాగింది. నిధి నాణెం ఉన్న మూడో మెట్టు పైకి చేరుకున్నాడు. బొంగరంలా కాసేపు తిరిగిన నాణెం చలనశక్తిని వ్యయం చేసేసి, వెల్లకిలా, విశ్రాంతిగా పడుకుంది. బొమ్మా? బొరుసా? నిధి మెట్టుమీద కూర్చుని, కళ్ళు చించుకుంటూ చూశాడు. అతనికోసం ఒక నిర్ణయం తీసుకున్న బంగారునాణెం కళ్ళని పొడుస్తున్నట్టు కనిపిస్తోంది. నిధి నాణేన్ని తీసుకోలేదు. తను ఊహించని నిర్ణయాన్ని కళ్ళకు కట్టుతోంది నాణెం.

తాను ఏంచేయాలో నిర్దేశిస్తోంది నాణెం. ఆత్మవిశ్వాసంతో, ధైర్యంగా ఏదో ఒక నిర్ణయం తీసుకోలేక పోయాడతను. నాణెం చెప్పే జోస్యం మీద ఆధార పడ్డాడు. యోధుడిలాగా కాకుండా, జూదరిలాగా ప్రవర్తించాడు! నిధి క్షణంసేపు సిగ్గుపడ్డాడు. తన ప్రవర్తనకి, బలహీనతకి సిగ్గుపడితే మహారాజూ, మహామంత్రీ, రాజగురువూ, ఆస్థాన జ్యోతిష్కుడూ అందరూ సిగ్గుపడాలి! రాకుమారి కూడా! వాళ్ళు జోస్యాన్ని నమ్మినప్పుడు తను నాణేన్ని నమ్మడం తప్పుకాదు.

***

రాకుమారి ఉత్పల నిలువుటద్దం ముందు నిలుచుంది. అద్దం ఆమె అందాన్ని హెచ్చవేత వేసి చూపిస్తోంది. అయితే ఆమె దృష్టి ప్రతిబింబ సౌందర్యం మీద లేదు. ఆమె దృష్టి ప్రతిబింబం కళ్ళమీద ఉంది. ఆ పెద్దపెద్ద కళ్ళలో నిరాశ, నిస్పృహ, ఆశ, ఉత్సాహం దోబూచులాడుతూ ప్రత్యక్షమవుతున్నాయి.

నిధి మాటతీరూ, అతని చూపులూ, గర్భాలయం వెనక వైపు ఏకాంతంలో అతని ప్రవర్తనా ఏదీ అంతుపట్టడం లేదు. 'ఆలోచించుకోవాలి' అన్నది ఒక్కటే తనకి అర్థమైంది. అతని ఆలోచన అనుకూలంగా ఉంటుందో, ప్రతికూలంగా ఉంటుందో ఆ దైవానికే తెలియాలి.

నిలువుటద్దంలో సుగాత్రి ప్రతిబింబం ఆమె వైపు వస్తోంది. ఆమె చేతుల్లో బంగారు పళ్ళెం ఉంది. సమీపంలో ఆగిన సుగాత్రి ప్రతిబింబం వైపు ప్రశ్నార్థకంగా చూస్తూ ఉత్పల వెనక్కి తిరిగింది. అందాకా అద్దంలో కుడి పైటతో కనిపించిన సుగాత్రి ఎడమపైటతో తన ముందు నిలుచుంది.

"ఆలయంలో అర్చకస్వామి మీకు ఆశీర్వాద పూర్వకంగా ఇచ్చిన ఈ తాంబూలాన్ని, తాంబూలంలో ఉన్న బంగారు నాణేన్ని మహారాణిగారి సన్నిధికి తీసుకువెళ్ళానమ్మాయి గారూ.."

"తీసుకెళ్ళావు! మళ్ళీ ఎందుకు తీసుకు వచ్చావ్?" ఉత్పల అడిగింది.

"మహారాణిగారు తాంబూలాన్ని తమకే ఇమ్మన్నారండీ. ఈ బంగారు నాణేన్ని మీ పైట కొంగులో భద్రంగా ముడివేసుకోమన్నారండి. అదృష్టరూపంగా అందివచ్చిన ఐశ్వర్యాన్ని ఎప్పుడూ కొంగున కట్టేసుకోవాలని చెప్పమన్నారండి" సుగాత్రి అంది.

"సరే... కొంగులో నువ్వే జాగ్రత్తగా ముడివేయ్!" రాకుమారి ఆజ్ఞాపూర్వకంగా అంది.

సుగాత్రి గోడవారగా వెళ్ళి పళ్ళేన్ని బల్లమీద ఉంచింది. తమలపాకుల మీద ఉన్న బంగారు నాణేన్ని చేత్తో తీసుకుని, రాకుమారివైపు తిరిగింది. బొటనవేలికీ, చూపుడు వేలికీ మధ్య పట్టుకున్న నాణేన్ని కళ్ళకి అద్దుకోడానికి పైకెత్తింది. నాణెం ఆమె వేళ్ళసందులోంచి జారి కింద పడింది. చిన్నగా చప్పుడైంది. సుగాత్రి భయభయంగా చూసింది.

"ఆలయంలో నెయ్యి అంటినట్టుంది యువరాణి గారూ.... చేతిలోంచి జారిపోయింది... మన్నించండమ్మా..."

"ఆగు!" నునుపుగా ఉన్న చలువరాతి పలకలమీద చక్రంలా దొర్లుకుంటూ వెళ్తున్న బంగారు నాణేన్ని చూస్తూ అంది రాకుమారి.

నాణేన్ని అందుకోడానికి ముందుకు వెళ్ళబోయిన సుగాత్రి ఆగి ప్రశ్నార్థకంగా చూసింది. రాకుమారి చూపులు చక్రంలా దొర్లుకుంటూ వెళ్తున్న నాణెం మీదే ఉన్నాయి. గది మధ్యలో పరచి ఉన్న రత్నకంబళి అంచు తగిలి, బంగారునాణెం ఒత్తిగిలి పడింది. రాకుమారి తల తిప్పి, సుగాత్రిని చూసింది.

"సుగాత్రీ... జాగ్రత్తగా విను. నాణెం ఒక వైపున్న బొమ్మ, కలశం పైన ఉండేలా పడి ఉంటే, ఆ నిధి మనం చెప్పిన పని చేస్తాడు. బొరుసు పైన ఉంటే చేయడు. అర్థమైందా? బొమ్మ అయితే నిధి మనకు అనుకూలం, బొరుసైతే ప్రతికూలం! చూడు. బొమ్మో, బొరుసో!"

సుగాత్రి నాణెం దగ్గరగా వెళ్ళి కిందికి వంగి పరిశీలనగా చూసింది. చేతుల్ని వెనకవైపున కట్టుకుని, మరోసారి కళ్ళు చిట్లించి చూసి, మెల్లిగా నిటారుగా నిలుచుని, రాకుమారివైపు చూసింది.

"ఏమిటే? బొమ్మా, బొరుసా?" రాకుమారి గద్దింపుగా అడిగింది.

"బొ...బొ... బొరుసేమ్మా.." సుగాత్రి నీరసంగా అంది.

రాకుమారి ముఖం వివర్ణమైపోయింది. బలహీనంగా ఆసనం మీద కూలబడింది. సుగాత్రి నాణేన్ని తీసుకుని ఆమె దగ్గరగా వచ్చింది.

"కొంగూ వద్దు; ముడీ వద్దు! ఆ పళ్ళెంలో పారేయ్!" రాకుమారి కసిరింది.

**(ఇంకావుంది)**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'అలర్జిక్ బ్రాంకైటిస్' సమస్యకు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



మారుతున్న ఆధునికతతో పాటు రోజురోజుకూ తీవ్రంగా పెరుగుతున్న వాతావరణ కాలుష్యం వలన మన శరీర అవయవాలు దుష్ప్రభావాలకు గురి అవుతున్నాయి. అందులో ప్రధానమైనవి శ్వాసకోశ ఇబ్బందులు. అందునా బ్రాంకైటిస్ సమస్యతో చాలా ఎక్కువ మంది బాధపడటం జరుగుతోంది.

సాధారణంగా వాతావరణంలోని గాలిని మనం పీల్చుకున్నప్పుడు అది ముక్కు ద్వారా వెచ్చగా మారి, నీటి ఆవిరిని కూడా కలుపుకుని ట్రకియా అనే శ్వాసనాళంలోకి ప్రవేశిస్తుంది. దాని చివరి భాగం 2 నాళాలుగా చీలి ఉంటుంది. వీటిని 'బ్రాంకై' అని అంటారు. ఈ 'బ్రాంకై' విడివిడి చీలికలుగా ఛాతీ కుహరంలో ఇరువైపులా ఉండే ఊపిరితిత్తులలోకి ప్రవేశించి కొన్ని వేల సంఖ్యలో చిన్నని–అతి సన్నని నాళాలుగా విభజింపబడతాయి. వీటిని 'బ్రాంకియోల్స్' అని అంటారు. ఈ నాళాలు మిక్కిలి తక్కువ పరిమాణం గల గుండ్రని వాయుతిత్తులుగా ఏర్పడతాయి. వీటిని ఆల్వియోలై అని అంటారు. ఈ శ్వాసనాళాల లోపలి భాగంలో ఒక శ్లేష్మపు పొర ఉంటుంది. ఏదైనా కారణం చేత ఇది శోథమునకు గురి కాబడిన సమస్యనే 'బ్రాంకైటిస్' అని అంటారు.



**అలర్జిక్ బ్రాంకైటిస్ అనగా:** ఏదైనా అలర్జీ కలిగించే పదార్థాలు వాయుద్వారాలను చేరినప్పుడు బ్రాంకై మరియు ఇతర దిగువ వాయుద్వారాలు శోథమునకు గురి కావడాన్ని 'అలర్జిక్ బ్రాంకైటిస్' అని అంటారు. ఈ సమస్య ఏ వయస్సు వారిలోనైనా కనిపిస్తుంది. నాన్ అలర్జిక్ బ్రాంకైటిస్ అనేది బ్యాక్టీరియా లేదా వైరస్‌ల వలన కలుగుతుంది.

మన శరీరానికి సరిపడని పదార్థాలను గాలి ద్వారా పీల్చుకున్నప్పుడు – వాయుద్వారాలు వాటికి బలంగా స్పందిస్తాయి. ఇలా స్పందించిన వాయుద్వారాల కండరాలు బిగించుకోబడతాయి. దీని వలన వాయుద్వారాలు కాస్త సన్నగా మారుతాయి. తదుపరి అవి శోథమునకు గురి అయి వాపు చెందడం ద్వారా మరియు సాధారణ స్థాయికి మించి శ్లేష్మాన్ని ఉత్పత్తి చేయడం వలన, అవి మరింత ఇరుకుగా మారి గాలి ప్రసరణకు ఆటంకాలు ఏర్పడతాయి.

**కారణాలు:** ఏదైనా అలర్జీ కలిగించే పదార్థాలు శ్వాస ద్వారా వాయుద్వారాలలో ప్రవేశించినప్పుడు, బ్రాంకియల్స్ రోగనిరోధక వ్యవస్థ సాధారణ స్థితికి మించి ఎక్కువగా ప్రతిక్రియ జరపడంతో 'అలర్జిక్ బ్రాంకైటిస్' సమస్య కలుగుతుంది. • పొగ త్రాగటం, దుమ్ము, వాతావరణ కాలుష్యం, బూజు, కొన్ని రసాయనాలు, వృత్తిరీత్యా కొన్ని వాయు కాలుష్యాలను ఎదుర్కోవడం, జంతు చర్మపు పొరలు, శ్వాసకోశ అలర్జీని ప్రేరేపించే కొన్ని ఆహార పదార్థాలు మరియు జన్యుపరమైన అంశాలన్నీ ఈ సమస్యకు కారణాలు అవుతాయి. **లక్షణాలు:** ఈ సమస్యలో కనిపించే ప్రధానమైన లక్షణం దగ్గు. కఫంతో కూడి లేదా కఫం లేకుండా కలిగే ఈ దగ్గు రాత్రి సమయంలో ఎక్కువగా ఉంటుంది. • ఊపిరి ఆడకపోవడం వంటి లక్షణం కనిపించినప్పుడు నిర్లక్ష్యం చేయకూడదు. ఈ సమస్య తీవ్రరూపం దాలిస్తే పని సమయాలలోనే కాకుండా విశ్రాంతి సమయంలో కూడా ఈ లక్షణం ఏర్పడి ప్రాణాంతకంగా మారవచ్చు. • పిల్లి కూతలు, నీరసం, ఛాతీలో నొప్పి, గొంతు నొప్పి, తలనొప్పి, పెదాల వాపు, అప్పుడప్పుడూ చర్మం నీలం రంగులోనికి మారడం మొదలగు లక్షణాలను గమనించవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** రోగి లక్షణాలను బట్టి ఛాతీ ఎక్స్‌రే, కఫం పరీక్ష, రక్త పరీక్ష, కొన్ని సందర్భాలలో ఊపిరితిత్తుల ఆకారం, వాటి పనితీరు స్పష్టతకై సి.టి. స్కాన్, PFT పరీక్షలు, అలర్జీ పరీక్షలు నిర్వహించవలసి వస్తుంది. **దుష్ప్రభావాలు:** ఈ వ్యాధి దీర్ఘకాలికంగా కొనసాగితే COPD, శ్వాస తీసుకోవడంలో తీవ్రమైన ఇబ్బందితో శ్వాసప్రక్రియ విఫలమై మరణానికి దారి తీయడం వంటి దుష్ప్రభావాలకు సైతం ఇది దారి తీస్తుంది.

**తీసుకోవలసిన జాగ్రత్తలు:** దుమ్ము–ధూళి, ఇతర రసాయనాలు మరియు వృత్తిరీత్యా ఎదుర్కొనే వాయు కాలుష్యం శరీరంలోకి ప్రవేశించకుండా జాగ్రత్తలు తీసుకోవడం. • బెడ్‌లను–దుప్పట్లను శుభ్రంగా ఉంచుకోవడం.• పెంపుడు జంతువులకు, ధూమపానానికి మరియు ఇతర అలర్జీ కలిగించే పదార్థాలకు దూరంగా ఉండటం. • ప్రాణాయామం వంటి వ్యాయామాలు చేయడం ద్వారా ఈ 'అలర్జిక్ బ్రాంకైటిస్' నుండి కొంత వరకు ఉపశమనాన్ని పొందవచ్చును.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** 'కాన్స్టిట్యూషనల్ హోమియోపతి' విధానంలో భాగంగా, సూక్ష్మీకరణ పద్ధతిలో తయారైన హోమియో మందులతో శరీర రోగనిరోధక కణాలకు పునరుజ్జీవం కల్పించి, ఎలాంటి దుష్ప్రభావాలు లేకుండా 'అలర్జిక్ బ్రాంకైటిస్'ను పూర్తిగా నయం చేయవచ్చు. కేవలం 'హోమియోకేర్ ఇంటర్‌నేషనల్'లో మాత్రమే అందించబడే ఈ విశిష్ట వైద్య రీతిలో, వ్యాధి రీత్యా – రోగి శరీర నిర్మాణం, రోగి మానసిక, వ్యక్తిగత లక్షణాల పరిశీలన తదుపరి మాత్రమే అందించబడే ఈ హోమియో చికిత్సతో వ్యాధిని ప్రేరేపించే పదార్థాలు శరీరంలోకి ప్రవేశించినా వ్యాధి మళ్ళీ తిరగబెట్టకుండా సంపూర్ణంగా నయం చేయవచ్చు.

8

# విజయ విలాసం-2

## స్టెప్స్ టు సక్సెస్

- ఎం. వెంకటేశ్వరరావు, సెల్: 90307 07037

**జీవితాన్ని అత్యంత ప్రభావితం చేసే అంశాల్లో ముఖ్యమైనది విజయం. ఒకసారి విజయం సాధించిన వ్యక్తికి సచ్ఛీలం, మంచి దృక్పథం, మంచి క్రమశిక్షణ, సద్భావన అలవడతాయి. విజయం తర్వాత కూడా ఈ గుణాలను నిత్యకృత్యాలుగా మలుచుకున్నప్పుడే ఆ 'విజయాన్ని' నిలబెట్టుకోగల్గుతారు.**

# అంతకుముందు... ఆ తర్వాత...



తొలి విజయంతోనే ప్రపంచాన్ని జయించినంత ఉద్వేగం, ఉన్మాదానికి లోనైన వ్యక్తులు మనకి తారసపడుతూ ఉంటారు. ఇటువంటివారి మాట, నడక, నడతలో మార్పు స్పష్టంగా కన్పిస్తుంది. ఇలాంటి వారిని 'బలహీనతలు' త్వరగా తమవైపు తిప్పుకుంటాయి. కోపం, జుగుప్స, ద్వేషం, వ్యామోహం, సోమరితనం, కామం ఒకటేమిటి రకరకాల వికారాలు ఆక్టోపస్‌లా చుట్టుముట్టేస్తాయి.

చివరికి విజయాన్ని అందించిన అంశాన్ని కూడా నిర్లక్ష్యం చేసే స్థితికి తీసుకెళ్తాయా వికారాలు.

ఏదో సమయంలో తప్పులు దిద్దుకునే యోచన చేస్తారు గానీ అప్పటికే వారిలో వేళ్ళూనుకున్న అరిషడ్వర్గాలు అడ్డుపడతాయి. మలిప్రయత్న ఫలితం ముందే వాళ్ళకి తెలిసిపోతుంది.

### టర్నింగ్ పాయింట్

సచిన్‌టెండూల్కర్, వినోద్ కాంబ్లీ క్లాస్‌మేట్స్. 1980వ దశకంలో క్రికెట్ చరిత్రలో వాళ్ళు ప్రపంచ రికార్డు సృష్టించారు. ముంబయ్ శివాజీపార్కులో జరిగిన స్కూలు మ్యాచెస్‌లో 700 పరుగులుచేసి క్రికెట్ ప్రపంచాన్ని ఆశ్చర్యపరిచారు. సచిన్, కాంబ్లీలకు అదే టర్నింగ్ పాయింట్. ఇంటర్నేషనల్ క్రికెట్ టీమ్‌లో ఎంపికై విజయ దుందుభి మోగిస్తూ ఛాంపియన్స్ అయ్యారు.

సచిన్ కన్నా వినోద్‌కాంబ్లీకి ఎక్కువ నైపుణ్యం, ఆటపై శ్రద్ధ, పట్టు ఉన్నాయని క్రికెట్ విశ్లేషకులు ఆనాడు అంచనా వేశారు. వరుస విజయాలు కాంబ్లీని ట్రిబుల్ సెంచరీలవరకూ తీసుకెళ్ళాయి. విజయాలతో బాటు అతనిలో ప్రతికూల దృక్పథం, అహంకారం, క్రికెట్ పట్ల నిర్లక్ష్యం కూడా పెరిగాయి.

1992లో ముంబయ్‌లో జరిగిన మ్యాచ్‌లో వెస్టిండీస్ కెప్టెన్ కోట్నీవాల్ష్ బౌన్సర్ బంతిని వినోద్ కాంబ్లీ ఎదుర్కోలేక, భారత్ ఓటమికి ప్రత్యక్ష పరోక్ష కారకుడయ్యాడు. దాంతో కాంబ్లీ క్రికెట్ జీవితం త్వరగా ముగిసింది.

### వినయమే విజయ లక్షణం

"ఫలకాలంలో చెట్లు కిందికి వంగి ఉంటాయి. వర్షించే మేఘాలు కొత్తనీటి బిందువుల బరువుతో క్రిందికి వంగి ఉంటాయి. విజేతలు కూడా ఎల్లవేళలా గర్వం లేకుండా నమ్రతతో ఒదిగి ఉంటారు".

కాంబ్లీతో బాటే క్రీడాజీవితం ప్రారంభించిన సచిన్ టెండూల్కర్ ఎదుగుదలకు సచ్ఛీలత, దృక్పథం, క్రమశిక్షణ, వినయమే ప్రధాన కారణాలు. ప్రతి వ్యక్తి మొదట అలవర్చుకోవాల్సిన విజయ లక్షణం 'వినయం'.

'అవినయ మపనయ విష్ణో' (అవినయాన్ని తొలగించు) అన్నారు శంకరాచార్యులవారు.

వీటినే ఆంగ్లంలో క్యారెక్టర్, యాటిట్యూడ్, డిసిప్లిన్, ఒబీడియన్స్ అంటాం. విజయం తర్వాత కూడా అంతకు రెట్టింపుస్థాయిలో వీటిని నిలబెట్టుకోగల్గిన వాళ్ళే శాశ్వతవిజయం పొందుతారు.

### సచ్ఛీలత

**"శక్తి డబ్బులో ఉండదు, మంచితనం, పవిత్రత, సచ్ఛీలతలోనే ఉంటుంది. ఈ మూడు ఉన్నవారికి ఓటమి కూడా గెలుపువంటిదే"**

**–వివేకానంద**

"నోబెల్ బహుమతి గ్రహీత డా. సి.వి.రామన్ బెంగళూరులో రామన్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ ప్రారంభించినప్పుడు, లిఖితపరీక్ష, ఇంటర్వ్యూలకు దేశం నలుమూలల నుంచి యువశాస్త్రవేత్తలు వచ్చారు. వడపోతలో పదిమంది ఎంపికయ్యారు. ఎంపికకాని అందర్నీ రామన్ సమావేశపరిచి, "నిరుత్సాహపడకండి, బాగా సాధనచేసి వచ్చే ఏడాది రండి" అని ప్రోత్సహించారు. వారందరికీ తిరుగు ప్రయాణ చార్జీలిమ్మని సెక్రటరీకి పురమాయించారు.

సమావేశం ముగించి రామన్ వెళ్తుంటే, ఇంటర్వ్యూలో సెలెక్టుకాని ఓ యువకుడు గేటు దగ్గర నిలబడ్డాడు. రామన్ గుర్తుబట్టి "ఏమిటి" అని ప్రశ్నించారు.

"నాకు ఐదు నిమిషాలు కేటాయించండి. నేను చాలాదూరం నుండి వచ్చాను. జీవితంలో మీవంటి

నోబెల్ గ్రహీతను మళ్ళీ కలిసే అవకాశం వస్తుందో రాదో" అన్నాడు వినయంగా.

"ఈరోజు వీలుకాదు, రేపు పదిగంటలకి రమ్మని చెప్పారు. మర్నాడు అరగంట ముందుగానే ఆ యువకుడు ఆఫీసుకొచ్చాడు. యువకుణ్ణి పిలిచి, "మీరేమైనా అడగ దల్చుకుంటే అడగండి" అన్నారు రామన్.

ఆ యువకుడు పది రూపాయల నోటు తీసి, రామన్ ముందుంచాడు.

రామన్ ఆశ్చర్యంగా "నాకెందుకు ఇస్తున్నావు?" అన్నారు.

"మన్నించండి! నాకు 100 రూపాయలు ప్రయాణ చార్జీలిచ్చారు. నా టిక్కెట్టుధర తొంభై రూపాయలే. మిమ్మల్ని స్వయంగా కలిసి ఈ డబ్బు మీకు అందజేద్దా మని..." అన్నాడు.

వెంటనే రామన్ సెక్రటరీని పిలిచి, "ఈ కుర్రాడికి అప్పాయింట్‌మెంట్ ఆర్డర్ ఇవ్వండి" అన్నారు.

"సార్, ఇతను గణితశాస్త్ర పరీక్షలో ఫెయి లయ్యాడు" అని చెప్పాడు సెక్రటరీ.

"నిన్న గణితంలో ఫెయిల్ కావచ్చు. కానీ ఈరోజు గుణగణాల పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు" అన్నాడు ఆయన.

డాక్టర్ రామన్ ఎలా నోబెల్ బహుమతి విజేత అయ్యారో అర్థం చేసుకోవడానికి ఈ ఒక్క సంఘటన చాలు. సచ్ఛీలతకున్న శక్తి ఇదే.

## దృక్పథం

***"సమాజంలో మన స్థాయిని నిర్ణయించేది మన దృక్పథమే (యాటిట్యూడ్)"***

**–జేస్సీజాక్సన్**

మనిషికి బాల్యం నుండి అలవడే కొన్ని దృక్పథాలు స్థిరంగా ఉండవు. మారిపోతుంటాయి. చిన్నప్పుడు డాక్టరవుదామనుకున్నవారు యాక్టరుగా స్థిరపడి గొప్ప పేరు సంపాదిస్తారు.

చూసి నేర్చుకునే దృక్పథాల్లో కొన్ని స్థిరంగానూ, మరి కొన్ని సందర్భానుసారంగా, వంశానుగతంగా మారు తూనూ ఉంటాయి. వంశానుగత దృక్పథాలు అంటే డాక్టర్ కొడుకు డాక్టరే అవటం: ఉదా: కాకర్ల సుబ్బారావు గారి కుటుంబంలో 11 మంది డాక్టర్లే. ఎన్.టి.ఆర్, ఏఎన్నార్ కుటుంబాల్లో ఎక్కువమంది యాక్టర్లే.

పరిసరాలు కూడా మన దృక్పథాల్లో మార్పు తెస్తుంటాయి. ఆర్థిక వెసులుబాటు లేకపోతే దృక్పథం స్థిరంగా ఉండదు. నిన్నటిదాకా బాగున్నవ్యక్తి అంగ వికలుడైతే అతడి దృక్పథం మారిపోతుంది.



### హేట్సాఫ్ మహానటి సావిత్రి



*సినీ వినీలాకాశంలో ధృవతార మహానటి సావిత్రి. తెలుగు సినీకళామతల్లి సిగలో పరిమ ళించి, వెండితెర నుదుట సిందూరమై వెలుగొం దిన నటి. సినీ తళుకుబెళుకుల చెక్కిలిపై ఘనీభ వించి, కన్నీటిచుక్కగా మారి, మహానటిగా రాణించి, తెరవెనుక మనుషుల నటనమధ్య ఇమడ లేక ఇరవైనెలలు కోమాలో గడిపారామె. దయనీ యమైన స్థితిలో మృత్యువు ఒడిలో సేదదీరింది ఆమె.*

*మహానటి బిరుదు ఒక్క సావిత్రికే సొంతం. ఒక భూమి, ఒక ఆకాశం, ఒక సూర్యుడు, ఒక చంద్రుడు, ఒక సావిత్రి. 'నిండైన విగ్రహం, నట నలో నిగ్రహం' అభినేత్రి సావిత్రి... సినీధాత్రి" అని సావిత్రిని ప్రశంసించారు బాపు.*

*గుంటూరుజిల్లా చిర్రావూరులో 1934లో జన్మిం చారు. విజయవాడలో కొన్నాళ్ళున్నారు. పెదనాన్న గారి ప్రోద్బలంతో సినీరంగప్రవేశం చేశారామె. తొలినాళ్ళలో అవకాశాలు లభించక కష్టాలెదురై నాయి. దేవదాసు చిత్రంలో పార్వతి పాత్రతో ఇక ఆమె వెనుదిరిగి చూడలేదు.*

*అందం, అభినయంతో దక్షిణాది భాషాచిత్రా లకు ప్రాణప్రతిష్ఠ చేశారామె. అంది వచ్చిన 'విజయాలు' ఆమెని ఉన్నత శిఖరాలెక్కించి మకుటం లేని మహారాణిని చేశాయి. అంతటి మహానటి వ్యక్తిగత జీవితంలో ఓడిపోయింది.*

*ప్రేమించడం, ప్రేమని పంచడమే తెల్సిన సావిత్రి అతి సున్నితమనస్కురాలు. వివాహితు డైన జెమినీగణేశన్‌ను పెళ్ళి చేసుకోవడంతో ఆమె కష్టాలు మొదలయ్యాయి. మొదట్నుంచీ చేతికి వెన్నెముక లేకుండా దానధర్మాలు చేసేది. ఎవ్వరైనా పంక్తిస్లకి పిలిస్తే వెండి బిందెలు చదివించేది. విభే దాలు తలెత్తడంతో భర్త దూరమయ్యాడు. కూతురు చాముండేశ్వరితో విభేదాలు, సినిమాల నిర్మాణంతో ఆర్థికంగా పతనమై ఆస్తులు కోల్పో యింది. ఐ.టి. శాఖ దాడులు ఆమెను మానసి కంగా, ఆర్థికంగా కోలుకోలేని దెబ్బతీశాయి. క్రమంగా ఆ మహానటి మద్యం మత్తుకు అలవాటు పడింది. చివరికి 500 రూపాయలిచ్చి కొడుకుతో కలిసి రెండు గదుల ఇంట్లో అద్దెకు ఉండే స్థితికి వచ్చింది. అయినా మద్యం మహమ్మారి ఆమెను వదిలిపెట్టలేదు.*

*ఓ అజ్ఞాత అభిమాని చేసిన ఆర్థిక సహాయం తెలిసి, అతనికి తనకొచ్చిన షీల్డులోని వెండిని కరి గించి, అతనికి పెళ్ళి జరిపించిన అభిమాన గని. 20 నెలలు కోమాలో గడిపి, అతి దారుణమైన పరి స్థితుల్లో అంతిమశ్వాస విడిచారు. ప్రతిభ పట్టం గట్టినా, ఆ విజయాలతో వ్యక్తిగత జీవితంలో నిల దొక్కుకోలేకపోయిందామె. నాటికీ నేటికీ మహా నటి ఆమె ఒక్కరే. కళామతల్లి ముద్దుబిడ్డ సావిత్రి.*

ఒకప్పటి మొగల్ సామ్రాజ్య చక్రవర్తి ఔరంగజేబు సంతతి, వారి వారసులు ఈనాడు కలకత్తాలో రెండు గదుల ఇంట్లో దారిద్ర్యంతో జీవిస్తోంది.

కానీ సచ్ఛీలత, స్థిరదృక్పథం గలవారు పరిస్థితులు తారుమారైనా చలించక విజయంవైపే పయనిస్తారు.

డకవుట్, ఒక్కరన్ తేడాతో సెంచరీ కోల్పోవడం లేదా డబుల్‌సెంచరీతో నాటవుట్‌గా మిగలడం... సందర్భం ఏదైనాగానీ సచిన్ టెండూల్కర్ ప్రదర్శించిన స్థితప్రజ్ఞతే అతడిని భారతరత్న స్థాయికి తీసుకెళ్ళింది.

## క్రమశిక్షణ

క్రమశిక్షణ పాటించే వ్యక్తుల్లో ఏకాగ్రత ఉంటుంది. క్రమశిక్షణ అంటే, సైనిక కవాతులో సిపాయిలు ఒక అడుగు ఒకేసారి వెయ్యటం లాంటిది.

కఠోరమైన క్రమశిక్షణకు మంచి ఉదాహరణ 'దంగల్' చిత్రం. క్రమశిక్షణ కఠినంగా ఉన్నా దాని ఫలితాలు శాశ్వతంగా ఉంటాయి.

క్రీస్తుపూర్వంనాటి గ్రీకు తత్వవేత్త డెమొక్రిటస్. ఒకరోజు కట్టెలమోపు తలపై మోసుకెళుతున్న బాలు డొకడు ఆయనకు తారసపడ్డాడు. ఆ బాలుడిలోని తేజస్సును గమనించాడు డెమొక్రిటస్. ఆ బాలుణ్ణి నిలబెట్టి "బాబూ! ఈ కట్టెలమోపు ఎవరు కట్టారు?" అని అడిగాడు.

"నేనే" అన్నాడా బాలుడు.

"ఏం చేస్తుంటావు?" అనడిగాడు డెమొక్రిటస్.

"కట్టెలమ్ముకుని జీవిస్తున్నాను. చదువుకుంటు న్నాను. బాగా చదువుకుని డెమొక్రిటస్ అంతవాడిన వుతాను" అన్నాడు. అతనే డెమొక్రిటస్ అని ఆ బాలు డికి తెలీదు.

"అయితే ఈ కట్టెలమోపు విప్పి, మళ్ళీ అదే పద్ధ తిలో కట్టగలవా?" అని అడిగాడు డెమొక్రిటస్.

"తప్పకుండా!" అని మోపుదించి, విప్పదీసి మళ్ళీ అంతకంటే చక్కగా, గట్టిగా కట్టి చూపించాడు. అత్యంత ఏకాగ్రతతో ఆ పనిచేస్తున్న బాలుణ్ణి చూసి ముచ్చటపడి, తన ఇంటికి తీసుకెళ్ళి చదువు, తిండి, వసతి ఏర్పాటుచేశాడు డెమొక్రిటస్.

తర్వాతి కాలంలో ఆ బాలుడే గొప్ప రేఖాగణిత శాస్త్ర పండితుడయ్యాడు. అతడే పైథాగరస్. విజయ పరంపర శాశ్వతంగా కొనసాగించే వ్యక్తులు సచ్ఛీ లత, క్రమశిక్షణలతో విజయానికి ముందెలా ఉంటారో ఆ తర్వాత కూడా స్థితప్రజ్ఞతతో జయాపజయాలకు అతీతంగా ఉంటారు.

**(ఇంకా వుంది)**



# గమ్మత్తైన గొడుగులు

**వేసవి తర్వాత వర్షం ఓ ఆహ్లాదం. వర్షం ఓ ఆనందం. వర్షం ఓ సరదా. అంతకుమించి వర్షం మన మనుగడ. అందుకే ఆ వర్షంలో తడిసిముద్దయిపోతాం. వయసు తేడా లేకుండా వానావానా వల్లప్పా...అంటూ వర్షంలో ఆటలాడుకుంటాం. వర్షాకాలం వాన ప్రకృతి సహజం. ఆ వానలో తడిసినా ఆనందమే, తడవకపోయినా ఆనందమే!**

కానీ ఆ తడిసే తపనకూ ఓ పరిమితుంటుంది. దాన్ని ఖచ్చితంగా పాటించేవారు జాగ్రత్తలు పాటిస్తారు. 'ఏ ఎండకాగొడుగు' సంగతేమో గానీ ఇప్పుడు వర్షాలకు మాత్రం రకరకాల గొడుగులొచ్చేశాయ్. వామనావతార కాలం మొదలు వ్యోమగామి వరకు కాలం ఏదైనా గొడుగుకు మాత్రం కాలం చెల్లలేదు. కాలానుగుణంగా గొడుగులిప్పుడు పర్సులోనూ ఇమిడిపోతున్నాయి. మార్కెట్లో సరికొత్త మాన్‌సూన్ స్పెషల్ గొడుగులు హల్‌చల్ చేస్తున్నాయి. ఆ విశేషాలేంటో మీరూ చదివేసేయండి!

ఎండా వానలనుండి రక్షణనిచ్చే గొడుగు ఒకప్పుడు స్టేటస్ సింబల్, బ్లాక్ కలర్‌కి అంబాసిడర్. ఇప్పుడిప్పుడే వివిధ రంగుల్లో ఇవి అందంగా తయారవుతున్నాయి. ఎన్నో వెరైటీల్లో దొరుకుతున్నాయి. పూర్వకాలం అన్నీ తాటాకు గొడుగులే. రానురాను అవి కనుమరుగయ్యాయి. జోరసంచులు, ప్లాస్టిక్ కవర్లతో తయారు చేసిన గొడుగులకు డిమాండ్ పెరిగింది.



### అంబ్రెల్లా దినోత్సవం

ఆంగ్లంలో అంబ్రెల్లా, తెలుగులో గొడుగు, ఛత్రము, అతపత్రము, వారిత్రము, ఉష్ణవారణం... ఇంకా ఎన్నోపేర్లు. యూరప్‌లో దీన్ని రూపొందించిన వ్యక్తి పేరు మడోన్నాడెల్ అంబెరెల్లా. ఆమె పేరు మీదే దానికాపేరు వచ్చింది. 1530లో గొడుగు రూపొందించారు. ఈస్ట్‌ఇండియా కంపెనీ తొలిసారి 1676లో దీనిని మన దేశంలో ప్రవేశపెట్టింది. 1880నుంచి అంబ్రెల్లా వినియోగం మొదలైంది. గొడుగుల ప్రాధాన్యం, అవసరం దృష్టిలో ఉంచుకుని 1928లో ప్రపంచ గొడుగుల (అంబ్రెల్లా) దినోత్సవం ప్రవేశపెట్టారు. అప్పటి నుంచి ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 10వ తేదీన ఛత్రీల దినోత్సవం జరుపుకుంటున్నారు.

### అధికారానికి ప్రతీక

వర్షం పడితేనో, ఎండకాస్తేనో గొడుగు వాడుతున్నాంగానీ అప్పట్లో గొడుగులకు వర్షాలకు సంబంధమే ఉండేది కాదు. అవి ప్రత్యేకమైన వర్గానికి, గౌరవానికి ప్రతీకగా ఉండేవి. ప్రముఖులకు మాత్రమే పరిమితం అయ్యేవి. అస్సీరియా, ఈజిప్టు, పర్షియా, భారత్‌లకు చెందిన వేల ఏళ్ళనాటి పురాతన శిల్పాలు, చిత్రాలలో పాలకులకు ఛత్రం పడుతూ సేవకులు వెంట నడిచే దృశ్యాలు మనకు కనిపిస్తాయి. అస్సీరియాలో గొడుగు ఉపయోగించే అధికారం కేవలం రాజుకు మాత్రమే ఉండేది.

### ఇరవైనాలుగు గొడుగుల ప్రభువు!

చరిత్రను గమనిస్తే ముఖ్యంగా ఆసియా దేశాలలో గొడుగు అధికారానికి ప్రతీకగా కనిపిస్తుంది. అంటే ఎన్ని గొడుగులు వాడుతున్నారో దాన్ని బట్టి పరిపాలకుల స్థాయి నిర్ణయించబడేది. ఎంతలా అంటే అప్పట్లో బర్మా రాజును ఇరవై నాలుగు గొడుగుల ప్రభువు అని పిలిచేవారట. దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు అప్పట్లో గొడుగుకు ఎంత ప్రాముఖ్యత ఇచ్చేవారో. కొన్నిసార్లు వాటికుండే దొంతరల సంఖ్య ప్రాముఖ్యమైనదిగా ఎంచబడేది. చైనా చక్రవర్తి గొడుగుకు నాలుగు దొంతరలు ఉండేవి, సియాము రాజు గొడుగుకు ఏడు లేదా తొమ్మిది దొంతరలు ఉండేవి. నేడు కూడా కొన్ని ప్రాచ్య, ఆఫ్రికా దేశాల్లో గొడుగు అధికారానికి ప్రతీకగా నిలుస్తోంది.

### వెరైటీ గొడుగులు

రకరకాల గొడుగులు ఈ మధ్య మార్కెట్లోకి వచ్చాయి. వివిధ రంగులు, ఆకారాల్లో ఆకర్షిస్తున్నాయి. మరి ఆ వింతైన గొడుగులు ఏంటో మీరూ తెలుసుకుని వీలైతే కొనుక్కోవడానికి ప్రయత్నించండి!

### ఫుల్ బాడీ అంబ్రెల్లా

పెద్ద వర్షం వస్తే కొన్నిసార్లు గొడుగు ఉన్నా లాభం ఉండదు. తల మినహా శరీరమంతా తడిసిపోతుంది. అలా తడవకుండా ఉండాలంటే ఫుల్ బాడీ అంబ్రెల్లా వాడితే సరి. ఈ ఫుల్ బాడీ అంబ్రెల్లా తల నుండి పాదాల వరకు రక్షణ కవచంలా ఉంటుంది. పట్టుకునే అవసరం ఉండదు.

## నలుపు రంగే ఎందుకు?

ఇప్పుడైతే మార్కెట్‌లో రంగు రంగుల గొడుగులు దొరుకుతున్నాయిగానీ ఒకప్పుడు గొడుగు నలుపురంగు వస్త్రంతో చేసేవారు. అంతకంటే ముందు మందపాటి నేతవస్త్రంతో గొడుగును తయారు చేసేవారు. అయితే తడిసిన గొడుగు ఆరడానికి చాలా టైమ్ పట్టేది. బ్లాక్ కలర్ క్లాత్ తొందరగా పొడిబారుతుందని తెలుసుకున్న తర్వాత ఆ రంగుక్లాత్‌తోనే తయారు చేయడం మొదలుపెట్టారు.

లేతరంగుల కన్నా నలుపురంగు లేదా ఇతర ముదురు రంగులు పరిసరాల నుంచి ఎక్కువ ఉష్ణోగ్రత గ్రహించడం వల్ల బాష్పీభవన ప్రక్రియ వేగంగా జరిగి త్వరగా ఆరిపోతాయి. ప్రస్తుతం గొడుగులకు సింథటిక్ క్లాత్ వాడుతున్నారు. ఇవి ఇంకా త్వరగా ఆరిపోతాయి. అందుకే ప్రస్తుతం గొడుగులు అన్ని రకాల రంగుల్లోనూ మనకు దొరుకుతున్నాయి.

థర్డ్ స్కిన్‌లా ధరిస్తేచాలు. ఈ అంబ్రెల్లా ఒక పలచని పొరలాగా శరీరాన్ని కప్పి ఉంటుంది కాబట్టి బయట పరిసరాలన్నీ మనకు అద్దంలోంచి చూసినట్టుంటాయి.

### క్లాక్ పారాసోల్

చీకటివేళ వర్షం పడుతుంటే మనకు సమయం కూడా సరిగ్గా తెలియదు. ఒక్కోసారి ఏదిక్కుకు వెళుతున్నామో కూడా తెలియకుండా ఉంటుంది. క్లాక్ పారాసోల్ గొడుగు ఉపయోగిస్తే మనకు ఆ బాధే అక్కర్లేదు. పర్వతారోహకులకు, అడవుల్లో సంచరించేవారికి ఈ క్లాక్ పారాసోల్ బాగా ఉపయోగపడుతుంది. ఈ క్లాక్ పారాసోల్ వాతావరణాన్ని బట్టే మనకు టైమ్ ఎంతైందో చెప్తుంది. అదే విధంగా దిశలను కూడా చూపిస్తుంది. సూర్యరశ్మిని ఆధారం చేసుకుని టైమ్ ఇండికేట్ చేస్తుంది. దీన్ని జపాన్ వాళ్లు తయారుచేశారు.

### డ్యుయల్ బ్రెల్లా

భార్యాభర్తలిద్దరూ వర్షంలో ఎంచక్కా చెట్టాపట్టాలేసుకుని ఎంజాయ్ చేస్తూ నడుస్తూ ఉంటే ఎంత బాగుంటుందో కదా! కానీ ఒక్క గొడుగు పట్టుకుని అందులో ఇద్దరు నడవాలంటే కష్టమే. వర్షంలో సగం తడిసిపోతారు. అదే ఒకే హ్యాండిల్‌కి రెండు గొడుగులుంటే...? ఇద్దరికీ వచ్చేలా రెండు గొడుగులు ఒకచోటనే ఉంటే చాలా బాగుంటుంది కదూ. అదే డ్యుయల్ బ్రెల్లా. ఒకే గొడుగు ఒకే అడుగు అన్నట్లు ప్రత్యేకంగా కపుల్ కోసమే దీన్ని తయారు చేశారు.

### కప్ హోల్డర్ అంబ్రెల్లా

చల్లని వర్షంలో ఉన్నప్పుడు ఆ చల్లదనానికి వేడి వేడి కాఫీ లేదా టీ తాగాలనిపిస్తుంది చాలా మందికి. అసలే వర్షం, ఎక్కడా ఆగడానికి వీలుండదు. అందుకోసమే ఈ కప్ హోల్డర్ అంబ్రెల్లా. ఈ అంబ్రెల్లాకి ఉన్న హ్యాండిల్ దగ్గర కాఫీ కప్ పెట్టుకునే వీలుంటుంది. ఇహనేం...! పైనుంచి వర్షం పడుతుంటే గొడుగులో దూరి ఒకచేత్తో గొడుగు హ్యాండిల్ పట్టుకుని మరో చేత్తో వేడివేడిగా కాఫీ తాగుతూ చలినీ, వెచ్చదనాన్నీ రెంటినీ ఆస్వాదిస్తూ వెళ్ళొచ్చన్నమాట.

### వాటర్ గన్ అంబ్రెల్లా

వర్షంలో తడిస్తే జలుబు, దగ్గు, జ్వరం వస్తాయి. పిల్లలకైతే ఇంకాస్త త్వరగా వచ్చేస్తాయి. అయినాగానీ పిల్లలు వర్షంలో ఆటలాడటం మానరు. పెద్దవాళ్లకే వర్షంలో ఆడుకోవాలని పిస్తుంది ఇక చిన్నపిల్లల సంగతి చెప్పేదేముంది? అసలు వానలో తడవకుండా ఎంచక్కా అంబ్రెల్లాతోనే ఆడుకుంటే...? అలాంటి పిల్లలకు ఉపయోగపడేదే ఈ వాటర్ గన్ అంబ్రెల్లా. ఈ అంబ్రెల్లా హ్యాండిల్‌కి ఒక వాటర్‌గన్ ఉంటుంది. వర్షం పడుతున్నప్పుడు ఆ గొడుగు పట్టుకొని దానికి అమర్చిన గన్‌తో ఎంచక్కా తోటి మిత్రులతో ఆడుకోవచ్చు.

### ద బ్యాక్‌ప్యాక్ అంబ్రెల్లా

రెండు చేతుల్లో లగేజీ ఉన్నప్పుడు వర్షం వస్తే ఏం చెయ్యాలి? మన దగ్గర గొడుగు ఉన్నా ప్రయోజనం ఉండదు. అందుకోసమే ఈ బ్యాక్‌ప్యాక్ అంబ్రెల్లా. దీన్ని చేత్తో పట్టుకునే అవసరం లేదు. వెనుక తగిలించుకుంటే చాలు. దర్జాగా లగేజీ పట్టుకుని వెళ్ళిపోవచ్చు.



### పెంపుడు కుక్కలకీ ఓ గొడుగు!

వర్షంలో తడిసిపోకుండా గొడుగులు మనకు రక్షణ ఇస్తాయి. మరి మన పెంపుడు జంతువులు తడిసిపోకుండా ఉండాలంటే ఎలా? వాటికి కూడా గొడుగులు వచ్చేశాయి. అవే ద డాగ్‌బ్రెల్లా. ప్రత్యేకంగా కుక్కల కోసం ఈ గొడుగు తయారు చేశారు. కానీ పిల్లలకు కూడా వాడుతున్నారు.

### లైట్ డ్రాప్స్ అంబ్రెల్లా

పగలు వర్షం వస్తుంటే కాంతి ఉండదు. రాత్రి వర్షం కురిస్తే చీకట్లో అసలేమీ కనిపించదు. పాదచారులు, వాహనాలు, గుంతలు... ఏమీ కనిపించవు. ఎదురుగా వచ్చేవారికి మన ఉనికే తెలియదు. చీకట్లో మనం ప్రయాణిస్తున్నామని ఎదుటివారికి తెలిసేలా మన గొడుగుకు లైటింగ్ ఉంటే? అందరం అందరికీ కనిపిస్తాం. అదే ఈ లైట్ డ్రాప్స్ అంబ్రెల్లా. అంబ్రెల్లాకి అమర్చిన ఎల్‌ఈడీ బల్బులు, వర్షం నీటిధారలతో వెలుగుతాయి.

– విజేత

## వాన రాకడ చెప్పే గొడుగు

వానరాకడ ప్రాణం పోకడ ఎవరూ చెప్పలేరంటారు. వాన పడితే ఏ బస్ షెల్టర్ దగ్గరో, ఏ చెట్టుచాటునో తలదాచుకోవడంతప్ప అదెప్పుడు వస్తుందో తెలుసుకోవడం కష్టమే. కనిపించే ఎండ క్షణంలో మాయమై వాన కురుస్తుంది. ఇలాంటి సందర్భాల్లో వర్షం రాకడ మనకు ముందే తెలిస్తే...? ఈ గొడుగు చేసే పని అదే! అదేంటి వాన ఎప్పుడొస్తుందో గొడుగు చెప్పేస్తుందా! అనుకుంటున్నారా? గంట ముందే మనకి ఆ విషయం చెప్పేస్తుందీ గొడుగు. 'వెజా' అనే ఫ్రెంచ్ కంపెనీ ఈ గొడుగును రూపొందించింది. దీనిని 'ఊంబ్రెల్లా' బ్రాండ్ పేరిట మార్కెట్‌లోకి విడుదల చేశారు. స్మార్ట్ ఫోన్‌కు అనుసంధానమైన ఈ గొడుగు పై భాగంలో ఏర్పాటు చేసిన సెన్సర్లు వాతావరణ మార్పులను ఎప్పటికప్పుడు నమోదు చేస్తాయి. ఎండ తీవ్రత, గాలిపీడనం, తేమ వంటి ప్రతి అంశాన్నీ స్మార్ట్‌ఫోన్‌కు చేరవేస్తాయి. రాబోయే గంట వ్యవధిలో వాతావరణంలో తలెత్తబోయే మార్పులను ముందుగానే అంచనా వేసి మీ ఫోన్‌కు హెచ్చరికలు జారీ చేస్తాయి. మనం ఈ గొడుగును ఎక్కడైనా మర్చిపోయినా అయ్యో పోయిందే అని బాధపడక్కర్లేదు. జీపీఎస్ ఆధారంగా మన ఫోనుకు ఎస్‌ఎంఎస్ వచ్చేస్తుంది. ఎండ నుంచి, వాన నుంచి రక్షణ ఇవ్వడం మాత్రమే కాదు వాతావరణ కేంద్రంలాగా కూడా ఈ గొడుగు ఉపయోగపడుతుంది. దీని ధర సుమారు ఆరువేలు. ఈ ఒక్క గొడుగుంటే చాలు ఓ చిన్న వాతావరణ కేంద్రం మీచేతిలో పెట్టుకున్నట్లే!



# CRIME మోనా డార్లింగ్...

**గోవాలో పెద్ద బిజినెస్ మాగ్నెట్ డేవిడ్ థామస్.**

**నడి వయసు దాటినా మనిషి దృఢంగా ఉంటాడు. శృంగార కాంక్ష, అమ్మాయిలపై మోజు ఇంకా పోలేదు. గదిలో అసహనంగా అటూ ఇటూ తిరుగుతున్నాడు. పక్కనే అందంగా అలంకరించిన గులాబిరంగు బర్త్ డే కేక్ మీద "టు మోనా డార్లింగ్" అని వ్రాసి ఉంది.**

బర్త్‌డే బేబీ మోనా షవర్ కింద జలకాలాడుతున్నా ఆమె ఆలోచనలు మాత్రం హాట్ హాట్‌గా ఉన్నాయి. చల్లనినీళ్ళలో తడిసిన ఆమె అందాలు మరింత మెరిసి పోతున్నాయి.

మగవాళ్ళలో మోహం రేకెత్తించడంలో మోనా సిద్ధహస్తురాలు. బాత్రూమ్ కీ హోల్లోంచి డేవిడ్ తన అందాలను ఆశగా చూస్తున్నాడని ఆమెకు తెలుసు. అందుకే కావాలనే బాత్రూమ్‌బోల్ట్ వేయలేదు. మోనా అందాలను మైమరచి చూస్తున్న డేవిడ్ చెయ్యి అప్రయత్నంగా డోర్‌మీద పడి తలుపు తెరచుకుంది.

"ఓ గ్గాడ్" అంటూ వగలు ఒలకబోస్తూ టవల్ ఒంటికి చుట్టుకుంది మోనా. పాల నురుగుల ఆమె అందాలను ఆ టవల్ ఏ మాత్రం దాచలేకపోయింది. మోనాను చూడగానే మోహంతో వాటేసుకుని ఎత్తుకొచ్చి బెడ్‌పై కుదేశాడు డేవిడ్. "యూ నాటీ... ఆ టేబుల్‌మీద కేక్ అలాగే వదిలేస్తావా" కొంటెగా అడిగింది మోనా. "టేబుల్‌మీద కేక్ కన్నా ముందు ఈ బెడ్ మీదున్న కేక్‌నే నమిలి మింగేయాలని ఉంది" అంటూ కసిగా ఆమె పెదవుల్ని అందుకున్నాడు. అతని కౌగిలిలో కరిగిపోతూ అతని కాంక్షను మరింతగా ఎగదోస్తోంది. మోనా. కాలింగ్‌బెల్ మోగడంతో రసభంగమైంది. "డ్రెస్ వేసుకో" అంటూ బెడ్రూమ్ తలుపుమూసి బయటకొచ్చాడు డేవిడ్.

***

డేవిడ్ మెయిన్‌డోర్ తెరవగానే ముగ్గురు ముసుగు యువకులు లోపలికొచ్చారు. అతన్ని కదలకుండా బంధించారు. వాళ్ళల్లో పొడుగాటి యువకుడు డేవిడ్‌కు రివాల్వర్ గురిపెట్టి "నోరెత్తకు" అని హెచ్చరించాడు. డేవిడ్ అటూ ఇటూ చూడసాగాడు.

"సెక్యూరిటీవాళ్ళు మా అధీనంలో ఉన్నారు, నిన్నెవ్వరూ కాపాడలేరు" అన్నాడా పొడుగు యువకుడు. "వీణ్ణి పక్కగదిలో పడేసి మీరుకూడా అక్కడే ఉండండి" తనవాళ్ళకు ఆదేశించాడు. డేవిడ్‌ని తీసుకుని వాళ్ళు బయటకెళ్ళగానే తలుపు గడియపెట్టి బెడ్రూములోకెళ్ళాడతను. ఆమె బెదిరిపోయింది. "ఎవరు మీరు? మీకేం కావాలి?" బిగ్గరగా అరచింది మోనా.

"ష్....అరవకు" అంటూ మోనాను బెడ్ మీదకు లాక్కెళ్ళాడు.

ఆమె గింజుకుంటూ "హెల్ప్.." అని అరుస్తోంది.

పక్కగదిలో డేవిడ్‌కి మోనా ఆర్తనాదాలు విని పిస్తున్నాయిగానీ నిస్సహాయంగా ఉండిపోయాడు.

***

బెడ్‌పైకి చేరగానే మోనాను కౌగిలించుకున్నాడు ఆ యువకుడు.

బలమంతా ఉపయోగించి పెనుగులాడింది మోనా. ఆ పెనుగులాటలో అతడి ముసుగు ఊడిపోయింది. అతడిని చూడగానే ఆమె మొహం సంతోషంతో వెలిగిపోయింది. గట్టిగా కౌగలించుకుని, "విక్రమ్! ముసుగులో నిన్నుచూసి ఎంత భయపడిపోయానో తెలుసా? అవునూ! పదకొండుగంటలకు రమ్మంటే అప్పుడే ఎందుకొచ్చావ్? ఆ ఇద్దరినీ వెంటబెట్టుకొచ్చావెందుకు?" అడిగింది మోనా.

"అవన్నీ తరువాత చెబుతా, ముందు మనం వెంటనే బయలుదేరాలి, టైమ్ లేదు" తొందర పెట్టాడు విక్రమ్.

"ఐ యామ్ రెడీ, ఇవిగో బీరువా తాళాలు" అంటూ అతడి చేతికిచ్చింది మోనా.

క్షణం ఆలస్యం లేకుండా బీరువా తెరచి పది కోట్లు క్యాష్, నగలు, వజ్రాలన్నీ బ్రీఫ్‌కేస్‌లో సర్దాడు.

"విక్రమ్ మరి నన్ను దోచుకోవా" కొంటెగా అడిగింది.

> **పుట్టినరోజు కేక్ సిద్ధం చేసి ఆమెకోసం ఎదురుచూస్తున్నాడతను. బాత్రూమ్‌లో స్నానం చేస్తోందామె. మగాణ్ణి మత్తెక్కించి, మోహంలో ముంచెత్తడంలో ఆమె సిద్ధహస్తురాలు. బాత్రూమ్ బయట కీహోల్‌లోంచి అతడు తన అందాలు ఆస్వాదిస్తున్నాడని ఆమెకు తెలుసు. అందుకే బాత్రూమ్ బోల్ట్‌కూడా బిగించలేదు. అనుకున్నంతా అయింది. తలుపుతీసి ఆమెను ఎత్తుకుని బెడ్‌మీద పడేశాడతను. ఇద్దరూ కౌగిలిలో పరవశించిపోతున్నారు. అంతలో....?**

"ఓకే" అంటూ ఆమె ఒంటిమీదవన్నీ ఒలుచుకున్నాడు. వజ్రపుటుంగరం కూడా తీసి ఇచ్చేసింది. "గుడ్, డార్లింగ్ అంటే నీలా ఉండాలి" అంటూ ఆమెను కౌగలించుకున్నాడు.

"చాల్లేగానీ, నా సూట్ కేస్ కూడా సర్దే ఉంచా, ఇక పోదామా" అంది మోనా హుషారుగా.

"మన ప్లాన్‌లో చిన్న ఛేంజ్" అన్నాడు విక్రమ్.

"ఏమిటది?"

"నువ్వు ఇప్పుడు మాతో రావట్లేదు."

"అదేంటి?" విస్మయంగా అడిగింది మోనా.

"ఇప్పుడు నువ్వు మాతో వస్తే నీ మీదే అనుమానం వస్తుంది, మన ప్లానంతా ఫ్లాప్ అవుతుంది"

"అంతేనంటావా..." అంది. ఆమె మొహంలో రంగులు మారాయి. మనసులో ఆలోచనలు కూడా మారిపోయాయి. అవేమీ పైకి కనబడనీయకుండా, "సరే నువ్వు చెప్పినట్టే చేద్దాంగానీ, డైనింగ్ టేబుల్ మీద హాట్ ప్యాక్‌లో వేడి వేడి బిర్యానీ ఉంది, రా" అంది.

"ఇప్పుడు టైమ్‌లేదు, తీసుకెళ్ళి దార్లో తింటాం లే" అంటూ బెడ్రూమ్‌లోంచి బయటకు వచ్చాడు.

విక్రమ్ ఫ్రెండ్స్ కూడా పక్కగదిలోంచి వచ్చారు. "ముసలాడు ఏం చేస్తున్నాడు?" అడిగాడు విక్రమ్.

"డోంట్ వర్రీ బాస్, వాడికి ఫుల్ డోస్ ఇంజెక్షన్ చేశాం, రేపు ఉదయం వరకు లేవడు" చెప్పారు వాళ్ళు.

"గుడ్, హర్రీఅప్" అంటూ కదిలారు. ఇంతలో మోనా బిర్యానీ ప్యాక్ తెచ్చిచ్చింది.

"మోనా మీ ఫోర్డ్ కారు తీసుకెళ్తున్నాం, అంతా సద్దుమణిగాక మేం ఎక్కడున్నదీ మెసేజ్ పెడతా వచ్చెయ్, ఫారిన్ చెక్కేద్దాం" అన్నాడు విక్రమ్.

"నిన్ను నమ్మేదెలా?" అనుమానంగా అడిగింది మోనా.

"నమ్మినా నమ్మకపోయినా జరిగేది అదే. ఈ లోపు నీక్కూడా ఓ షాట్ ఇస్తా, హాయిగా పడుకో" అన్నాడు.

"వద్దు...వద్దు" అని మొత్తుకుంటున్నా మోనా నరాల్లోకి ఇంజెక్షన్ గుచ్చాడు విక్రమ్.

"మోసం... మోసం" అంటూ మత్తులోకి జారిపోయింది మోనా.

***

నార్త్ గోవాలో మపాసా పోలీస్ స్టేషన్. ఎస్.ఐ మనోజ్ మంగేష్కర్ బిజీగా ఉన్నాడు. ఆ సమయంలో అతని సెల్ మోగింది. సెల్ ఆన్ చేశాడు. అవతలి వైపు చెప్పిన సమాచారం వింటూనే తన సిబ్బందితో బయలు దేరాడు.

"సార్.. ఎక్కడికి?" జీపు స్టార్ట్ చేస్తూ అడిగాడు డ్రైవర్.

"పోండా ఘాట్ రోడ్లో యాక్సిడెంట్ కేస్...పద" అన్నాడు.

కారు వేగంగా ఘాట్‌రోడ్‌వైపు వెళ్ళింది. ఆ రోడ్‌లో కొద్ది దూరంలో ఓ ఫోర్డ్ కార్ చెట్టును ఢీకొని లోయలోకి దొర్లిపోయింది. కారులో ముగ్గురు వ్యక్తులు అపస్మారక స్థితిలో ఉన్నారు.

ఆగమేఘాలమీద కారును బయటకు తీయించి, గాయపడిన ముగ్గుర్నీ పనాజీ సివిల్ హాస్పిటల్‌లో



చేర్పించాడు ఎస్.ఐ. మనోజ్ మంగేష్కర్.

***

డేవిడ్ కళ్ళు తెరచి చూసేసరికి ఎదురుగా పోలీసులు!

డేవిడ్ కట్లు విప్పారు పోలీసులు.

వాళ్ళను చూడగానే డేవిడ్‌కి ప్రాణం లేచి వచ్చింది.

"రాత్రి మీ ఇంట్లో దొంగతనం జరిగిందా" ప్రశ్నించాడు ఎస్.ఐ. మనోజ్ మంగేష్కర్.

"మామూలు దొంగతనం కాదు, పెద్ద దోపిడీ జరిగింది. డబ్బు..నగలు మొత్తం దోచుకుపోయారు" ఘొల్లుమన్నాడు డేవిడ్.

"అరే మరచిపోయా, పక్క గదిలో నా భార్య మోనా ఉండాలి" డేవిడ్ అనగానే ఆ గది తలుపులు తెరిచారు పోలీసులు. మోనా ఇంకా స్పృహలోకి రాలేదు.

"దొంగలు మీ ఫోర్డ్ కారు కూడా ఎత్తుకెళ్ళారు తెలుసా" అడిగాడు ఎస్.ఐ.

"రాత్రి నుండి ఇలా స్పృహ లేకుండా ఉన్నా, అసలేం జరిగిందో నాకు తెలియదు."

"మీ కారు, నగలు, నగదు అన్నీ దొరికాయి."

"నిజంగానా!" ఆశ్చర్యంగా అడిగాడు డేవిడ్.

"ఘాట్ రోడ్డులో వెళుతూ యాక్సిడెంట్‌కు గురయ్యారు దొంగలు."

మీ ఇంటి గురించి బాగా తెలిసిన వాళ్ళే ఆ దొంగలు. చూస్తే గుర్తుపడతారా?"

"వాళ్ళంతా ముసుగు దొంగలు. వాళ్ళెవరో నాకు తెలియదు"

"యూ ఆర్ సో లక్కీ."

"ఎందుకు అలా అంటున్నారు?" అడిగాడు డేవిడ్.

"రాత్రి మీ ఇల్లు దోచుకున్న ఆ ముగ్గురు దొంగలూ మరణించారు. మీరు అనుకున్నట్టు యాక్సిడెంట్‌లో చనిపోలేదు."

"మరి? ఏం జరిగింది?"

"వాళ్ళమీద విషప్రయోగం జరిగింది. ఆ ముగ్గురులో ఒకడు విక్రమ్."

***

విక్రమ్ ఇచ్చిన వాంగ్మూలం ప్రకారం, మోనా డేవిడ్ భార్యగా అతని ఇంటిలోకి చేరింది. తరువాత మూడు సంవత్సరాలు బాగానే సాగింది. తరచూ డేవిడ్ బిజినెస్ వ్యవహారాల్లో ఎక్కువగా బొంబయి, ఢిల్లీ, ఫారిన్ కంట్రీస్ తిరుగుతూ ఉండేవాడు. అతను లేని సమయంలో మోనా ఇంట్లో ఒంటరిగా ఉండేది. దాంతో పార్టీలకు పబ్బులకు తిరగడం ప్రారంభించింది.

అక్కడ కొత్తకొత్త కుర్రాళ్ళతో పరిచయాలు, స్నేహాలు పెరిగాయి. అలా పరిచయమైనవాడే విక్రమ్.

విక్రమ్ పరిచయం తర్వాత మోనాకి తనున్న బంగళా ఓ పంజరం లాగా, డేవిడ్ ఓ ముసలి నక్కలా కనిపించసాగాడు. వీలైనంత తొందరగా ఈ ముసలినక్కను వదిలించుకుని స్వేచ్ఛా విహంగంలా ఎగిరి పోవాలనుకుంది. అవకాశం కోసం వెయిట్ చేసింది.

విక్రమ్‌తో కలిసి ఈ దోపిడీ ప్లాన్ వేసింది. మోనా ఆహ్వానం ప్రకారమే విక్రమ్ ఆ దోపిడీకి పాల్పడ్డాడు. విక్రమ్, మోనా మధ్య అభిప్రాయభేదాలొచ్చాయి. విక్రమ్‌ని అనుమానించిన మోనా ఎందుకైనా మంచిదని సొంత ఏర్పాట్లు చేసుకుంది. అతను వెళ్ళేటప్పుడు విషం కలిపిన బిర్యానీ ప్యాక్ అతడికి ఇచ్చింది. కార్లో ప్రయాణిస్తూ బిర్యానీ తిన్నారు వాళ్ళు. ఈలోపు కారు యాక్సిడెంటైంది. కానీ బిర్యానీ ప్రభావంవల్ల ప్రాణాలు కోల్పోయారు" వివరించాడు ఎస్.ఐ.

అప్పుడే కళ్ళు తెరచింది మోనా.

హత్యానేరం కింద ఆమెను అరెస్ట్ చేశారు. నాకేం తెలియదని బుకాయించబోయింది మోనా. కానీ అప్పటికే హతుల తాలూకు పోస్ట్‌మార్టం రిపోర్ట్ రావడంవల్ల విషప్రయోగం జరిగిందని రూఢీ అయింది.

"మీరొకసారి పోలీస్ స్టేషన్‌కు వచ్చి కంప్లయింట్ ఇవ్వండి"

మోనాను జీపులో పోలీస్ స్టేషన్‌కు తీసుకెళుతూ చెప్పాడు ఎస్.ఐ. మనోజ్.

మోనా తలపెట్టిన ఘోరం తల్చుకుంటే భయంతో వణికిపోవాలి డేవిడ్. కానీ అతను వణికిపోలేదు.

***

రాత్రి కట్ చేయకుండా ఉంచిన బర్త్‌డే కేక్ టేబుల్‌పైన అలాగే ఉండిపోయింది.

పోలీసులు అందరూ తన ఇంటి పరిసరాల నుండి వెళ్ళిపోయారని నిశ్చయించుకున్నాక ఫ్రిజ్ లోంచి ఓడ్కా బాటిల్ తీసి గ్లాసులో ఒంపుకున్నాడు డేవిడ్. దానికి లెమెన్ కార్డియల్ కలిపి గ్లాసును మంచు ముక్కల్తో నింపాడు. ఆ గ్లాసు టేబుల్‌పై ఉంచి "మోనా డార్లింగ్" అని పిలిచాడు.

'మ్యావ్.....' అంటూ పెంపుడు నల్లపిల్లి అక్కడికి చేరుకుంది.

దాన్ని నిమురుతూ కేక్ దగ్గర వదిలాడు. ఆవురావురుమంటూ ఆ కేక్‌ను పిల్లి తిన్నది.

మరో రెండు నిమిషాల్లో అది గిరగిరా తిరిగి కళ్ళు మూసుకుని పడుకుంది.

దాని కంఠం నుండి ఎలాంటి శబ్దం రాలేదు.

డేవిడ్ పెదాలు సన్నగా విచ్చుకున్నాయి.

చెడుతిరుగుళ్ళకు అలవాటుపడిన మోనాను ఎలాగైనా వదిలించుకోవాలనుకున్నాడు డేవిడ్. ఆమె పుట్టినరోజునాడు విషం కలిపిన కేక్ తెచ్చి అక్కడ పెట్టాడు. ఆమెకు కేక్ తినిపిద్దామనుకున్నాడు. కానీ తన చేతికి మట్టి అంటకుండానే మోనా జైలుపాలు కావడం అతనికి నమ్మశక్యం కాకుండా ఉంది. మరో పక్క ఆనందంగా కూడా ఉంది.

ఈ ఆనందాన్ని సెలబ్రేట్ చేసుకోవడానికి "చీర్స్ టూ మోనా డార్లింగ్" అంటూ గ్లాస్ పైకెత్తాడు డేవిడ్.

—యం.ఉదయభాను
సెల్: 99482 13953




ఐదో తరగతి పరీక్షలు అయిపోయాయి. ఎండాకాలం సెలవులు. రోజులో ఎక్కువభాగం స్నేహితులతో ఆడుకోవటంతోనే సరిపోతుంది.

ఆ రోజు ఆదివారం. ఉదయం చద్దన్నం తిని నాన్న పొలం పనికి వెళ్ళాడు. పదకొండు గంటలు దాటితేగాని వంట మొదలుపెట్టని అమ్మ తొమ్మిదింటికే కూర గాయలు తరిగి వంటపనిలో నిమగ్నమైంది.

పదిన్నరకల్లా వంటపని పూర్తిచేసి నా దగ్గరకొచ్చి కూచుంది. నేను పిల్లల కథల పుస్తకంలోని కథలు చదువుతున్నా.

"ఆకలేస్తోందా కన్నా" నా తలమీద చేయి వేసి జుట్టును సవరిస్తూ అడిగింది. తలయెత్తి అమ్మ వైపు చూశాను, ఆమె కళ్ళలో ఎప్పటికిమల్లే అనంతమైన ప్రేమ. అమ్మగొంతు ఎంత మృదువుగా, శ్రావ్యంగా ఉంటుందో... ఏం మాట్లాడినా పాట పాడినట్టు ఉంటుంది. అమ్మ నన్ను కన్నా అని పిలిచినప్పుడు మరీ తీయగా విన్పిస్తుంది. నాకలా పిలిపించుకోవడం ఎంతిష్టమో.

"లేదమ్మా" అన్నాను మళ్ళా పుస్తకంలోకి తల దూరుస్తూ.

"ఎప్పుడూ పుస్తకాలేనా... నాతో కొద్దిసేపు మాట్లాడొచ్చుగా" అంది అమ్మ.

అమ్మ అలా అడగటం కొత్తగా అన్పించింది. నాకు అమ్మంటే చాలా ఇష్టం. నేనే అవసరమున్నా లేకున్నా అమ్మతో మాట్లాడి విసిగిస్తుంటా. 'వసపిట్టలా వాగుతావు. నోరు నొప్పి పుట్టదా' అని అమ్మ ముద్దు ముద్దుగా కసురుకుంటూ ఉంటుంది. అంతేతప్ప తనతో కొద్దిసేపు మాట్లాడమని అమ్మ అడగటం ఇంతకు ముందెన్నడూ జరగలేదు.

"కథ సగంలో ఉన్నానమ్మా. మర్రిచెట్టు మీదున్న బ్రహ్మరాక్షసి ఓ కుర్రాడి అమ్మని అమాంతం ఎత్తుకెళ్ళిపోయింది. అమ్మను రక్షించుకోడానికి ఆ కుర్రాడు బయల్దేరాడు. బ్రహ్మరాక్షసి చెర నుండి అమ్మను ఎలా విడిపిస్తాడో చదవాలి."

అమ్మ చనువుగా నా చేతిలో ఉన్న పుస్తకాన్ని మూసేసి నా వైపు నవ్వుతూ చూసింది. "మొదట ఈ అమ్మ గురించి ఆలోచించు కన్నా" అంది.

"సరేనమ్మా, ఏం మాట్లాడమంటావు? నువ్వు మాట్లాడు వింటాను"

"అలాగైతే నాకిష్టమైన పాట పాడనా?"

"ఏ పాట?"

అమ్మ గొంతు సవరించుకుని పాటందుకుంది. అమ్మకు పాత సినిమాల్లోని పాటలంటే చాలా ఇష్టం. "అనుకున్నావని జరగవు అన్నీ... అనుకోలేదని ఆగవు కొన్నీ... జరిగేవన్ని మంచికనీ.. అనుకోవడమే మనిషి పని..." అంటూ సాగే పాట. అమ్మ పాడుతుంటే నేను మైమరచిపోతూ విన్నాను. పాట పూర్తి కాగానే అమ్మ కళ్ళలో నీళ్ళు..

"ఎందుకేడుస్తున్నావమ్మా" కన్నీళ్ళను చేత్తో తుడుస్తూ అడిగాను.

"ఏమో కన్నా... ఊరికే కన్నీళ్ళు వచ్చాయి."

"నువ్వలా ఏడ్వకు. నేను చూళ్ళేను. నాకూ ఏడుపొస్తుంది."

"సర్లే. ఇంకెప్పుడూ ఏడ్వను. అన్నం తింటావా? నీకిష్టమని ముద్దపప్పు చేశాను. బంగాళాదుంప వేపుడు.. మజ్జిగ మిరపకాయలు వేయించాను. ఇంకేమైనా కావాలా?"

"ఇంకేం వద్దమ్మా" అన్నాను అమ్మ చేతిలోంచి కథల పుస్తకాన్ని తీసుకోడానికి ప్రయత్నిస్తూ.

అమ్మ నా చేతికి పుస్తకం అందకుండా తన చేతిని వెనక్కి తీసుకుంది. "నాకు బైటికెళ్ళే పనుంది. నేను వెళ్ళాక నీకు బోలెడు తీరిక దొరుకుతుందిలే. అప్పుడు చదువుకుందువుగానీ" అంది.

"ఎక్కడికెళ్ళాలి?"

"రావులమ్మ ఆంటీ లేదూ.. వాళ్ళింటికెళ్ళాలి."

రావులమ్మ ఇల్లు పక్క వీధిలోనే ఉంది. అమ్మ తరచు వాళ్ళింటికెళ్ళి కొద్దిసేపు పిచ్చాపాటి మాట్లాడి వస్తూ ఉంటుంది. కొన్నిసార్లు రావులమ్మ ఆంటీ కూడా మా ఇంటికి వస్తూ ఉంటుంది.

అమ్మ కొద్దిసేపు నా మొహంలోకి దీక్షగా చూసింది. దేనికోసమో వెతుక్కుంటున్నట్టు ఆమె కళ్ళు నా మొహమంతా తడిమాయి.

"పెద్దయ్యాక ఈ అమ్మను మర్చిపోతావా కన్నా" అడిగింది.

నేను అమ్మను అల్లుకుపోతూ "అమ్మనెవరైనా మర్చిపోతారా? ఎప్పటికీ జరగదు" అన్నాను.

"అందరూ అలానే అంటారు. పెళ్ళయి పెళ్ళాం వస్తే ఈ అమ్మ జ్ఞాపకమే రాదు."

"అలాగైతే పెళ్ళే చేసుకోను.."

"తప్పు నాన్నా.. అలా అనకూడదు. మంచి అమ్మాయిని చూసి పెళ్ళి చేసుకో. దగ్గరుండి నీ అవసరాలన్నీ చూసుకుంటుంది. ఈ అమ్మ దూరంగా ఉన్నా అమ్మలేని లోటు తీరుస్తుంది."



"అమ్మ దూరంగా ఎందుకుంటుంది? అమ్మ నాతోనే ఉంటుంది."

అమ్మ కళ్ళల్లో మళ్ళా నీళ్ళూరాయి. నా తల మీద చేయివేసి జుట్టు నిమురుతూ "బాగా చదువుకో. నాన్నలా వ్యవసాయం చేయకుండా పెద్ద ఉద్యోగం తెచ్చుకో. అందరిచేతా మంచివాడు అనిపించేలా నడుచుకో" అంది.

నాకు వెంటనే ఆవు–పులి కథ గుర్తొచ్చింది. లేగదూడకు పాలిచ్చి తిరిగి పులి దగ్గరకు వెళ్ళే ముందు ఆవు కూడా తన బిడ్డకు ఇలానే మంచి మాటలు చెప్తుంది.

"ఎందుకమ్మా మళ్ళా ఏడుస్తున్నావు? ఏమైనా గుర్తొచ్చిందా?" అని అడిగాను.

"లేదు నాన్నా. ఎందుకో తెలియదు. ఈరోజు ఊరికే కన్నీళ్ళు వస్తున్నాయి."

"నువ్వలా ఏడిస్తే చూడలేనమ్మా" అన్నాను అమ్మను మరోసారి చుట్టుకుపోతూ.

"ఏడవనులే. నేనంటే నీకు చాలా ఇష్టం కదూ..."

"చాలా ఇష్టం అమ్మా. నాకు నువ్వుంటే చాలు. నేను అమ్మకూచిని కదా.."

"నాకు తెలుసు నాన్నా. నాక్కూడా నువ్వంటే చాలా ఇష్టం. నువ్వు నా ప్రాణం" అంటూ అమ్మ వెక్కివెక్కి ఏడ్చింది.

అమ్మ పదేపదే ఎందుకు ఏడుస్తోందో అర్థం కాలేదు. ఇంట్లో బాధపడే సంఘటనలేవీ జరగలేదు. నాకు ఊహ తెలిశాక నాన్న అమ్మతో పోట్లాడటమో, అమ్మను తిట్టడమో నేనెరుగను. నాన్నకు కోపం రావడం తను కూడా చూళ్ళేదని పెదనాన్న తరచూ అంటుంటాడు. మరి అమ్మను బాధపెడుతున్న విషయం ఏమై ఉంటుంది? అని ఆలోచించాను. ఎంత ఆలోచించినా ఏమీ తట్టలేదు.

కొద్దిసేపు మౌనంగా ఉన్నాక "రావులమ్మ ఆంటీ వాళ్ళింటికెళ్ళి ఓ గంటలో తిరిగొస్తాను. అప్పటి దాకా చదువుకుంటూ ఉంటావా?" అంది.

"సరేనమ్మా" అన్నాను.

అమ్మ నా నుదుట ముద్దుపెట్టి లేచి మొహం కడుక్కుంది. అద్దం చూసుకుంటూ తల దువ్వుకుని మొహానికి పౌడర్ రాసుకుంది. కళ్ళకు కాటుక దిద్దుకుంది.

అమ్మ చాలా అందంగా ఉంటుంది. చాలా పెద్ద కళ్ళు.. అమ్మ నవ్వితే నా కళ్ళకు ఇంకా అందంగా కన్పిస్తుంది. అయినా ఆంటీ వాళ్ళింటికెళ్ళడానికి అలా సింగారించుకుంటుంటే, "ఆంటీ వాళ్ళింట్లో ఏమైనా పేరంటమా?" అని అడిగాను.

"అవును. ఏదో వ్రతం మొదలెట్టబోతుందట. చుట్టుపక్కల అమ్మలక్కల్ని అందర్నీ పిలిచిందిలే" అంది అమ్మ.

లేత ఊదారంగు షిఫాన్ చీర కట్టుకుంది. అదే రంగు జాకెట్ వేసుకుంది. తడిగుడ్డలో చుట్టి ఉంచిన పూల చెండు తీసి తన వదులుజడలో తురుముకుంది.

వెళ్ళడానికి తయారయ్యాక ఏమనిపించిందో ఏమిటో "ఇప్పుడే వెళ్ళాలని లేదు కన్నా. నువ్వు అన్నం తినేవరకు ఉండి వెళ్తాలే" అంది.

"పర్లేదమ్మా. నేను పెద్దవాణ్ణి అయ్యాగా. పెట్టుకుని తింటాలే" అన్నాను.

"ఈ రోజెందుకో నాచేత్తో నీకు అన్నం తిన్పించాలని ఉంది కన్నా.."

"నీకు ఆలస్యమవుతుందమ్మా"

"పర్లేదులే. నీకు ఆకలేసినప్పుడు చెప్పు. అన్నం కలుపుకుని వస్తాను" అంది.

అప్పుడు సమయం పన్నెండు కావస్తోంది. అమ్మకు ఆలస్యమవుతుందని "ఆకలేస్తోందమ్మా... ఇప్పుడే తినేస్తాను" అన్నాను.

అమ్మ కంచంలో అన్నం వడ్డించుకుని వచ్చి దాన్లో ముద్దపప్పు, నెయ్యి కలిపి, బంగాళాదుంప వేపుడు నంజుతూ గోరుముద్దలు తినిపించింది.





## బీర్‌ని ఇలా కూడా వాడతారా?

బీరు సీసా కనపడగానే ఎత్తి గటగటా తాగేవారి గురించే ఎక్కువమందికి తెలుసు. కానీ టాలీవుడ్, కోలీవుడ్ హీరోయిన్ ఆనంది మాత్రం బీరుతో శిరోజాల్ని శుభ్రం చేసుకుంటుందట! తెలుగులో 'బస్‌స్టాప్' సినిమాలో సెకండ్ హీరోయిన్‌గా నటించిన ఆనంది ఆ తరువాత తెలుగువైపు కన్నెత్తి కూడా చూడలేదు. వరుస సినిమాలుచేస్తూ కోలీవుడ్‌కి అంకితమైపోయింది ఆనంది. సహజంగా ఆనంది అందమైన అమ్మాయి. ఆ అమ్మాయి జుత్తు ఆ అమ్మాయికన్నా అందంగా ఉంటుందట! కారణం తన జుత్తుకి బీరు అప్లయ్ చేసి కొద్దిసేపటి తరువాత స్నానం చేస్తానని చెబుతోంది ఆనంది. పనిలో పనిగా అప్పుడప్పుడు బీరు కూడా టేస్ట్ చేస్తూంటానని అంటోంది. ఆనంది ధైర్యంగా తనకు బీరు తాగే అలవాటు ఉందని చెప్పడం చూసి పలువురు ఆశ్చర్యపోతున్నారు.

"ఎందుకమ్మా ఈ రోజు ఇలా తిన్పించాలని నీకనిపించింది" అడిగా.

"ఎప్పుడో నీ చిన్నప్పుడు ఇలా గోరుముద్దలు తిన్పించాను నాన్నా. చానా ఏళ్ళయిందిగా. అప్పటి రోజులు గుర్తొచ్చి తినిపించాలనిపించింది."

అమ్మ అలా తిన్పిస్తుంటే కడుపునిండా తిన్నాను. నీళ్ళు తాగించి, తన పైట చెంగుతో మూతి తుడిచి, "వెళ్ళనా?" అని అడిగింది.

"సరేనమ్మా" అన్నాను.

"జాగ్రత్తగా ఉంటావుగా?"

"ఉంటానమ్మా..."

అమ్మ నన్ను దగ్గరకు తీసుకుని గుండెలకు హత్తుకుంది. ఆమె కళ్ళల్లో ఉబుకుతూ కన్నీళ్ళు... పదేపదే వెనక్కి తిరిగి నన్ను చూస్తూ కళ్ళు తుడుచుకుంటూ కనుమరుగైంది.

అమ్మ వెళ్ళాక మళ్ళా కథ చదవటంలో నిమగ్నమైపోయాను. సమయమే తెలియలేదు. కథలన్నీ చదవడం పూర్తిచేశాక కొద్దిసేపు నిద్రపోయి లేచాను. అప్పటికీ అమ్మ రాలేదు. నాన్న వచ్చి అమ్మ ఏదని అడిగాడు. రావులమ్మ ఆంటీ వాళ్ళింట్లో పేరంటానికి వెళ్ళిందని చెప్పాను. అన్నం పెట్టుకుని తింటూ "మీ అమ్మ ఏది వండినా ఎంత రుచిగా వండుతుందో కదా. ఆకలిగా లేదు. కొద్దిగా మజ్జిగన్నం తిందామని వచ్చి ఎంత తిన్నానో చూడు" అంటూ తృప్తిగా త్రేన్చాడు. కొద్దిసేపు విశ్రాంతి తీసుకుని మళ్ళా పొలానికి వెళ్తూ "ఇంతసేపైనా రాలేదేమిట్రా? ఈ ఆడంగులు మాటల్లోబడితే పిల్లల్నీ, మొగుళ్ళని కూడా మర్చిపోతారు" అన్నాడు.

ఇన్నిగంటలు అమ్మ ఆంటీ వాళ్ళింట్లో ఏం చేస్తోందో అర్థం కాలేదు. స్నేహితులు ఆడుకోడానికి పిల్చారు. మూడు పుల్లలు గుచ్చి బంతితో క్రికెట్ ఆట. ఆ ఆటలో మునిగిపోయి అమ్మ విషయమే మర్చిపోయాను. పొద్దు వాలిన కొద్దిసేపటికి పొలం నుంచి నాన్న తిరిగొచ్చాడు.

అమ్మ ఇంట్లో లేకపోవడం చూసి "అమ్మింకా రాకపోవడమేమిటి?" అన్నాడు.

"నువ్వెళ్ళి పిల్చుకురాపో. ఇన్నిగంటలు వాళ్ళింట్లో ఏం చేస్తున్నట్టు" అన్నాడు కొద్దిగా చిరాకు పడుతూ.

పరిగెత్తుకుంటూ రావులమ్మ ఆంటీ వాళ్ళింటికి వెళ్ళాను. నేను వెళ్ళేటప్పటికి ఇంటి బయట దండెం పైన ఆరవేసి ఉన్న బట్టలు తీసి మడతపెడుతోంది ఆంటీ.

నన్ను చూసి "ఏంటి రామక్రిష్ణా ఇలా వచ్చావు?" అని అడిగింది.

"మా అమ్మ కోసం" అన్నాను.

"మీ అమ్మ ఇక్కడెందుకుంటుంది?"

"మీ ఇంట్లో ఏదో పేరంటం ఉందని మధ్యాహ్నామనగా వచ్చిందిగా"

"పేరంటమా? మా ఇంట్లోనా? ఏమీలేదే" అందామె ఆశ్చర్యపోతూ.

నాకు నోటమాట రాలేదు. "అయితే అమ్మ ఇక్కడికి రానేలేదా?" అని అడిగాను.

"రానేలేదు. మా ఇంటికెళ్తున్నానని చెప్పి వచ్చిందా? ఆశ్చర్యంగా ఉందే" అంది.

"పేరంటం అని బాగా తయారై వెళ్ళింది ఆంటీ."

"నువ్వు నా పేరు పొరపాటున వినివుంటావు. బహుశా ఒంగోల్లో ఎవరింటికైనా వెళ్ళిందేమో. లేదా ఏదైనా ముఖ్యమైన పని ఉండి వెళ్ళిందేమో. కంగారు పడాల్సిన అవసరం లేదు. చీకటి ముదిరేలోపల తిరిగొస్తుందనుకుంటా..."

నాకు బాగా గుర్తుంది. అమ్మ రావులమ్మ పేరే చెప్పింది.

"అమ్మకు కంసాలోళ్ళ సరోజ కూడా స్నేహితురాలేగా. అలానే కిరాణాకొట్టు పక్కనున్న మిద్దె ఇంట్లో ఉండే పార్వతి... ఎందుకైనా మంచిది. వాళ్ళని కూడా అడిగి చూడు" అంది.

నేను సరోజ ఆంటీ వాళ్ళింటికెళ్ళాను. అమ్మ రాలేదనీ, అమ్మను చూసి నాలుగు రోజులు దాటిందనీ చెప్పింది. అక్కడినుంచి పార్వతి ఆంటీ వాళ్ళింటికెళ్ళాను. అదే సమాధానం.

"అమ్మ రావులమ్మ వాళ్ళింటికి వెళ్ళలేదట నాన్నా. అసలు వాళ్ళింట్లో ఈ రోజు పేరంటమేదీ లేదట" అన్నాను నాన్నతో.

"అమ్మ ఎప్పుడూ అబద్ధం చెప్పదే. నా మనసేదో కీడు శంకిస్తోంది" అన్నాడు నాన్న. పెదనాన్నతో కలిసి అమ్మను వెతకడానికి బయల్దేరాడు.

పెదనాన్న కొడుకు సుందరాన్ని తోడు తీసుకుని నేను మరోవైపు బయల్దేరాను. సుందరం నాకన్నా మూడేళ్ళు పెద్దవాడు. అమ్మకు తెలిసిన ప్రతి ఇంటికీ వెళ్ళి వాకబు చేశాం. అమ్మ జాడ తెలియలేదు.

మా ఊరు రావిచెట్టు దగ్గరకొచ్చాం. చాలా పెద్ద రావిచెట్టు. దాని చుట్టూ సిమెంట్‌తో నలుచదరంగా దిమ్మెకట్టి ఉంటుంది. ఒంగోలుకు బస్సులో వెళ్ళాలంటే మా ఊరువాళ్ళెవరైనా ఇక్కడి కొచ్చి బస్సు ఎక్కాల్సిందే. కొంతమంది సిమెంటు చప్టామీద కూచుని బస్సు రాకకోసం ఎదురు చూస్తున్నారు.

బస్సుకోసం వేచిచూసే ప్రయాణికుల సౌకర్యం కోసం ఏర్పాటుచేసిన వీధి దీపం వెలుతురులో కొంతమంది కుర్రాళ్ళు గోలీలాట ఆడుతున్నారు. అందులో సూర్యం కూడా ఉన్నాడు. మా ఇంటికి నాలుగిళ్ళవతలే వాళ్ళ ఇల్లు. వాడూ, మా సుందరం అన్న ఒకే క్లాస్ చదువుతున్నారు. ఎనిమిదో తరగతి.

**అతడు లేవగానే అమ్మ మొహం చూసి గాని మంచం దిగడు. ఆ అలవాటుకొద్దీ కళ్ళు మూసుకునే "అమ్మా త్వరగా రా" అని పిలిచాడు. ఎవరెవరివో గొంతులు వినిపిస్తున్నాయి కానీ అమ్మ గొంతు మాత్రం వినిపించలేదు. మళ్ళీ పిలవబోయి ఆగిపోయాడు. రాత్రి జరిగిన సంఘటన గుర్తొచ్చింది. అసలింతకీ ఏంజరిగింది? అతడి తల్లి ఎక్కడికెళ్ళింది?**

"ఒరే సుందరం.. నువ్వూ రా రా... ఆడదాం. గోలీలు నేను అప్పిస్తాలే" అని పిలిచాడు సూర్యం.

"ఇప్పుడు కాదురా. మా పిన్ని కన్పించడం లేదు. వెతుకుతున్నాం" అన్నాడు సుందరం.

"రామకృష్ణ వాళ్ళమ్మనా? మధ్యాహ్నం తోటలో కెళ్ళి నాలుగు టమాటాలు కోసుకురమ్మని అమ్మ చెప్తే ఈ దారిగుండానే వెళ్ళాను. అప్పుడు కన్పించింది. బస్సుకోసం ఈ చెట్టుకింద నిలబడి ఉంది" అన్నాడు.

అమ్మను చూశానని వాడు చెప్పగానే నాలో ఉత్సాహం వచ్చేసింది. "ఎటువైపు వెళ్ళే బస్సు ఎక్కింది? ఒంగోలు వెళ్ళే బస్సా లేక చేకూరుపాడు వైపెళ్ళే బస్సా" అడిగాను. చేకూరుపాడులో అమ్మ

తరఫు బంధువులున్నారు.

"నేను చూశ్శేదురా. తోట నుంచి తిరిగొచ్చేసరికి ఆమె లేదు. బస్సొస్తే ఎక్కి ఉంటుంది" అన్నాడు.

"ఒంగోలు వెళ్ళి ఉంటుందేమోనని రావులమ్మ ఆంటీ చెప్పిందిగా. అక్కడికే వెళ్ళి ఉంటుంది" అన్నాను సుందరంతో.

"అసలు ఈ పాటికే పిన్ని ఇంటికి తిరిగొచ్చేసి ఉంటుంది. పద ఇంటికెళ్దాం" అన్నాడు.

"ఒంగోలు నుంచొస్తే అమ్మ ఇక్కడే బస్సు దిగాలిగా. వచ్చి ఉండదు. ఈ చెట్టుకింద కూచుని అమ్మ వచ్చేవరకు ఎదురుచూద్దాం అన్నా" అన్నాను.

సుందరం నవ్వాడు. "ఒరేయ్, అమ్మ బస్సులోనే రావాలని లేదురా. రిక్షానో, ఆటోనో మాట్లాడుకుని వచ్చేయవచ్చు. ఒంగోలు మన ఊరికెంత దూరమని.. రెండు మైళ్ళేగా"

ఈ పాటికే అమ్మ ఇంటికొచ్చేసి ఉంటుందన్న ఊహకే నాలో కొత్త శక్తేదో ప్రవహించింది. అప్పటి వరకు తిరిగితిరిగి కాళ్ళు నొప్పెడుతున్న విషయం మర్చిపోయి పరుగు లంకించుకున్నాను.

"ఒరేయ్ తమ్ముడూ.. ఉండరా... పరిగెత్తకురా. రాళ్ళు తట్టుకుని పడతావురా" అంటూ వెనక నుంచి సుందరం అరుస్తున్నా ఆగకుండా పరుగెత్తాను. సుందరం నా వెనకే పరుగెత్తుకుంటూ వచ్చాడు.

ఇంటికి చేరుకోగానే అమ్మకోసం చూశాను, వసారాలో ఎవ్వరూ కన్పించలేదు. ఇల్లు నిశ్శబ్దంగా ఉంది. రెండు గదుల ఇల్లు.. ఒక వంట గది.. ఇంటి పక్కన స్నానాల గది. తలుపు దగ్గరగా చేరవేసి ఉంది. లోపల లైట్ వెలుగుతోంది. వసారాలో కూడా ట్యూబ్‌లైట్ వేసి ఉంది. మేము అమ్మని వెతకడానికి బయల్దేరినప్పుడు ఇంట్లో లైట్లు వేసి లేవని గుర్తొచ్చింది. అమ్మ వచ్చాకే లైట్లు వేసి ఉంటుంది. చాలా ఆశగా తలుపు తీసుకుని లోపలికెళ్ళాను. ఖాళీగది వెక్కిరించింది. ఆశ చావక పక్క గది, వంటగది, స్నానాల గది కూడా వెతికాను. అమ్మ లేదు.

"అన్నా... అమ్మ లేదు" సుందరాన్ని కౌగిలించుకుని ఏడ్చాను.

"చిన్నాన్న, నాన్న వెతకడానికెళ్ళారుగా. తప్పకుండా పిలుచుకుని వస్తారు. అప్పటివరకు మా ఇంటికెళ్దాం రా" అన్నాడు.

"రాను. అమ్మ వచ్చేవరకు ఇక్కడే కూచుంటాను" అన్నాను. వసారాకున్న మూడు మెట్లలో మధ్య మెట్టు మీద కూచున్నాను. పాపం ఏమనుకున్నాడో ఏమో సుందరం కూడా నా పక్కనే కూచున్నాడు.

కొద్దిసేపటి తర్వాత పెద్దమ్మ బైటికొచ్చి "ఇక్కడ కూర్చొని ఏం చేస్తున్నారు? మొదట లోపలి కొచ్చి అన్నం తినండి" అంది.

సమయం ఎనిమిది దాటి ఉంటుంది. నేను కదల్లేదు. రోడ్డుకి అటువైపున్న వీధిలైటు వెలుతురులో అమ్మ వస్తూ కన్పిస్తుందన్న ఆశతో అటువైపే చూస్తూ కూచున్నా.

సుందరం లేచాడు. "నాకు ఆకలేస్తోంది. అన్నం తిందాం రారా" అన్నాడు.

"నాకు అన్నం వద్దు. అమ్మ కావాలి" అన్నాను.

"అమ్మ వస్తుందిలే. మొదట అన్నం తిను" అంది పెద్దమ్మ.

సుందరం నన్నులేపి ఇంట్లోకి తీసుకెళ్ళాడు. నాకు, సుందరానికి, సుందరం చెల్లెలు కీర్తికి అన్నం వడ్డించింది పెద్దమ్మ. జొన్నసంగటి.. ఎండుచేప ఇగురు.. నాకిష్టమైన కూర. కానీ తినాలనిపించలేదు. కొద్దిగా తిని మళ్ళా మెట్లమీదకెళ్ళి కూచున్నా.

"పురుగూ పుట్రా ఉంటాయి నాన్నా. లోపలికి రా పడుకుందువుగానీ" అంది పెద్దమ్మ.

"నేను రాను. ఇక్కడే ఉంటాను" అన్నాను.

"వీడు అమ్మకూచిరా. ఆవిడ వచ్చేవరకూ రాడు. ఆ మహాతల్లి ఎక్కడికెళ్ళిందో. అయినా చిన్నపిల్లాణ్ణి వదిలి వెళ్ళడానికి ఆవిడకు మనసెలా ఒప్పిందో" అంది సుందరంతో.

నేను మెట్లమీద నుంచి వసారాలోకెళ్ళి గచ్చు మీదే పడుకున్నాను. ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు.

అమ్మ వచ్చింది. నన్నెత్తుకుని ముద్దు పెట్టుకుంది.

"ఎక్కడికెళ్ళావమ్మా, నీకోసం ఎంత ఏడ్చానో తెలుసా" అన్నాను.

## మనమీదేనర్రోయ్!

సరసి





"నీ కోసమే వెళ్ళాను కన్నా" అంది.

"నా కోసమా? ఎందుకూ?"

"నీకు మన ఊరి చెరువులో ఉండే తామర పూలంటే ఇష్టం కదా. కోసుకొద్దామని వెళ్ళాను. ఇవిగో పూలు..."

అమ్మ చేతినిండా తామరపూలు... అమ్మ నవ్వు తోంది తామరపూవు విచ్చుకున్నట్టు... నన్నెత్తుకున్న అమ్మ చేతులు తామర తూడుల్లా ఉన్నాయి.

"నన్నొదిలి వెళ్ళకమ్మా. నువ్వింక రావేమోనని భయమేసింది తెలుసా?" అన్నాను అమ్మ మెడని కౌగిలించుకుంటూ.

"నిన్నొదిలి ఎక్కడికి పోతాను కన్నా? నువ్వు నా ప్రాణం కదా. నేనెప్పుడూ నీతోనే ఉంటాను. సరేనా" అంది అమ్మ.

"అమ్మ మంచిది" అంటూ అమ్మ చెంపమీద ముద్దు పెట్టుకున్నాను. అమ్మ బుగ్గలు తెల్లగా నున్నగా ఎంత మెత్తగా ఉన్నాయో.. స్నానాలగదికెళ్ళే దోవ నిండా అమ్మ పెంచిన ముద్దబంతి పూలస్పర్శలా...

ఏవో శబ్దాలు విన్పిస్తున్నాయి. మాటలు.. ఎవ




రెవరో పెద్దపెద్దగా మాట్లాడుకుంటున్నారు. నాన్న గొంతు.. పెదనాన్న గొంతు.. పెద్దమ్మ గొంతు...

మెలకువొచ్చింది. కళ్ళు నులుముకుని అమ్మ కోసం చూశాను. కన్పించలేదు. నాన్న గోడకాను కుని కూచుని ఉన్నాడు. "అమ్మేది నాన్నా" అని అడి గాను.

"అమ్మలేదు బొమ్మలేదు. పడుకో" అన్నాడు కోపంగా. నాతో నాన్న ఎప్పుడూ ఇలా మాట్లాడ లేదు. ఒక్కసారిగా ఏడుపు తన్నుకువచ్చింది. "నాకు అమ్మ కావాలి" అంటూ ఏడ్చాను.

"అమ్మ ఊసెత్తావా నాలిక చీరేస్తాను" అన్నాడు మరింత కోపంగా. ఎప్పుడూ పరుషంగా ఒక్క మాట కూడా మాట్లాడని నాన్న కోపంగా కళ్ళెర్ర చేసి మాట్లాడుతుంటే మరింత ఏడుపొచ్చింది.

"ఇందాకేగా అమ్మ నన్నెత్తుకుంది. నాకోసం తిరిగొచ్చానందిగా. ఏదీ అమ్మ? అమ్మా.. అమ్మా.." అని పిలుస్తూ ఇంట్లోకి వెళ్ళబోయాను.

"మళ్ళా అమ్మ అన్నావంటే చంపేస్తాను వెధవా" అంటూ నాన్న నన్ను ఒడిసి పట్టుకుని వీపు మీద రెండు దెబ్బలు వేశాడు. నేను కిందపడిపోయి పెద్దగా ఏడుపు లంకించుకున్నాను.

పెదనాన్న పరుగున వచ్చి నన్ను ఎత్తుకున్నాడు. "వాడు చిన్నపిల్లాడు. వాడికేం తెలుసని కోప్పడ తావు?" అన్నాడు.

నన్ను తీసుకెళ్ళి పెద్దమ్మకిచ్చి "వీణ్ణి నీ దగ్గరే పడుకోబెట్టుకో" అన్నాడు.

అమ్మ ఏమైందో అర్థం కావటంలేదు. నాన్న ఎందుకు కోప్పడ్డాడో, ఎందుకు కొట్టాడో తెలియటం లేదు. పెద్దమ్మ పక్కన పడుకుని ఆమె జోకొడు తుంటే ఏడుస్తూనే నిద్రలోకి జారుకున్నాను.

ఉదయం మెలకువ వచ్చేటప్పటికే ఇల్లంతా సందడిగా ఉంది. ఎవరెవరివో గొంతులు విన్పిస్తు న్నాయి. నేను కళ్ళు తెరవగానే అమ్మ మొహం చూసి గాని మంచం దిగను. ఆ అలవాటుకొద్దీ ఎప్పటికి మల్లే కళ్ళు మూసుకునే "అమ్మా త్వరగా రా" అని పిలిచాను. అమ్మ రాగానే 'నేను వచ్చేశా.. నా బంగారుకొండ కోసం వచ్చేశా' అనేది పాట పాడుతున్నట్టు. అమ్మ గొంతు విన్పించకపోయే టప్పటికి మళ్ళా అమ్మా అని పిలవబోయి నిన్న రాత్రి జరిగిన విషయం గుర్తొచ్చి చప్పున కళ్ళు తెరిచాను.

నేను మా ఇంట్లో మంచం మీద ఉన్నాను. ఉదయం ఎవరో ఎత్తుకొచ్చి మా ఇంట్లో పడుకోబెట్టి ఉంటారు. వసారాలో అత్త గొంతు విన్పిస్తోంది. మా నాన్నకు చెల్లెలు. పేరు రమాదేవి. నాకు అత్తంటే చాలా ఇష్టం. ఒంగోల్లోనే కాపురం. వాళ్ళకి ఇంట్లోనే కిరాణా కొట్టుంది. ఓ కూతురు. నాకంటే రెండేళ్ళు చిన్నది.

తలుపు తీసుకుని "అత్తా" అంటూ ఆమె వైపు పరిగెత్తాను. "రా నాన్నా" అంటూ నన్ను ఒళ్ళోకి తీసుకుంది రమత్త.

పెద్దమ్మా పెదనాన్నా అక్కడే మంచం మీద కూచుని ఉన్నారు. గోడకానుకుని రమత్త కూచుని ఉంది. ఆమెకు కొద్దిగా ఎడంగా నాన్న కూచుని ఉన్నాడు.

"ఇంతకూ నిజంగానే వదిన వెళ్ళిపోయింది అంటావా అన్నయ్యా" పెదనాన్నను ఉద్దేశించి అడి గింది రమత్త.

"అందులో అనుమానం లేదు. ఒంగోలు బస్టాండ్‌లో కిళ్ళీకొట్టు నడిపే మస్తాన్ లేడూ, వాడు వసుధని చూశాట్ట. రెండూ రెండున్నర ప్రాంతంలో విజయవాడ వెళ్ళే బస్సెక్కిందట. పక్కన ఎవరో మగతను ఉన్నాడట."

"వదిన ఇలా చేస్తుందని కలలో కూడా ఊహించ లేదన్నయ్యా. ఎంత ఒద్దికగా ఉండేది.. తల్లో నాలి కలా మెసిలేది. నా పెళ్ళికాక ముందు నన్నెంత బాగా చూసుకుంది... అమ్మ బతికుంటే అచ్చం ఇలానే నా గురించి శ్రద్ధ తీసుకుని ఉండేది అనిపిం చేది. పెళ్ళయ్యాక కూడా ఇక్కడికొస్తే ఎంత ఆప్యా యంగా చూసుకునేదో. ఎప్పుడు చూసినా సంతో షంగా చలాకీగా ఉండే వదిన ఎవరితోనో వెళ్ళి పోయిందంటే నాకిప్పటికీ నమ్మకం కుదరటం లేదు అన్నయ్యా."

"అంటే ఎక్కడికెళ్ళి ఉంటుందని నీ అను మానం?" పెద్దమ్మ అడిగింది.

"ఏమో.. ఏ చెరువులోనో, దిగుడుబావిలోనో పడిపోయిందేమో"

"ఆత్మహత్య చేసుకుని ఉంటుందనా" అంది పెద్దమ్మ.

"అలా అనుకోను. వదినకు ఆత్మహత్య చేసు కోవాల్సిన అగత్యం ఏముంది? చిన్నన్నయ్య ఎంతబాగా చూసుకుంటాడో మనకు తెల్సిందేగా. ఇద్దరూ చాలా అన్యోన్యంగా ఉంటారని మన బంధు వుల్లో అందరూ అనుకుంటారుగా. ఇంట్లో తిండికీ, బట్టకూ లోటు లేదాయె. జీవితంలో అసంతృప్తి లేన ప్పుడు ఆత్మహత్య చేసుకోవాలన్న ఆలోచన ఎందు కొస్తుంది? పొరపాటున జారి ఏ దిగుడుబావిలోనో పడిపోయిందేమోనని..."

దానికి పెదనాన్న సమాధానమిచ్చాడు. "నిన్న ఆమె విజయవాడ వెళ్ళే బస్సు ఎక్కిందని తెలియక ముందు ఇదే అనుమానంతో ఊళ్ళో ఉన్న దిగుడు బావులన్నీ వెతికాం. పెద్దచెరువూ, రామాలయానికి ఆనుకుని ఉన్న కోనేరూ.. అవి కూడా వెతికించాం. తర్వాత తెలిసింది బస్సెక్కి వెళ్ళిందని."

"విజయవాడ ఎవరితో వెళ్ళిందంటావు? నాకు తెలిసి వదినకెవరూ విజయవాడలో బంధువులు లేరుగా. తన ఇష్టప్రకారమే వెళ్ళిందా? ఎవరైనా బెది రించి బలవంతంగా పిల్చుకెళ్ళారేమో ఆలోచించావా?"

"మస్తాన్ చెప్పేదాన్నిబట్టి అతనితో నవ్వుతూ మాట్లాడిందట. చాలా సంతోషంగా కనిపించిందట. బలవంతంగా వెళ్ళిందని అనుకోను."

"మస్తాన్ మాటలు ఎంతవరకు నమ్మగలం? కొట్లో కూచుని తమలపాకులకు సున్నం రాసు కుంటూ యథాలాపంగా చూసి ఉంటాడు. అసలు ఎవర్నిచూసి ఎవరనుకున్నాడో? ఒక వేళ వదిన్ని గుర్తుపట్టినా ఆమెతో పాటు బస్సెక్కిన వ్యక్తి పరిచయ స్థుడు కావచ్చుగా. అతనితో నవ్వుతూ మాట్లాడి నంత మాత్రాన అతనితో లేచిపోయిందని అనడం ఎంతవరకు న్యాయం? మగవాళ్ళు ఇలాంటి విష యాల్లో వంకరగానే ఆలోచిస్తారన్నయ్యా. అవి నిజాలు కాకపోవచ్చు".

**(ఇంకా వుంది)**

**హైదరాబాద్ జూబ్లీహిల్స్‌లో కేర్ ఆసుపత్రి.. వందల మంది పేషెంట్లు.. రకరకాల భాషలు.. యాసలు.. రూపాలు.. ఒక్కసారి అక్కడికి వెళ్తే చాలు.. మన చుట్టూ ఉన్న ప్రజలు ఇన్ని జబ్బులతో బాధపడుతున్నారా? అనిపిస్తుంది. రిసెప్షన్ ముందు లైన్లు.. బిల్ కౌంటర్‌లో లైన్లు.. ఆఖరికి లిఫ్ట్ ముందు కూడా లైన్లు..**




# 'లిఫ్ట్ గర్ల్' సంధ్య

ఆమెను నేను తొలిసారి చూసింది అక్కడే. హోటళ్లలో, ఆసుపత్రుల్లో లిఫ్టులు ఆపరేట్ చేయటానికి సాధారణంగా అబ్బాయిలుంటారు. అమ్మాయిలుండటం చాలా అరుదు. అబ్బాయిలనైతే లిఫ్ట్ బోయ్ అంటాం! మరి అమ్మాయిలనో.. లిఫ్ట్ గర్ల్ అనాలా? నా ముందో పదిమంది ఉన్నారు. లిఫ్ట్ పైకి వెళ్తోంది.. కిందకి వస్తోంది. నా చిన్నప్పుడు బాంబే వెళ్లినప్పుడు అక్కడ హోటల్‌లో ఆడిన లిఫ్ట్ ఆట గుర్తుకొచ్చింది. అప్పుడు మనుషులు లేరు.. ఇప్పుడున్నారు. అంతే తేడా. నా వంతు వచ్చేసింది. లిఫ్ట్ ఎక్కేశా. మూడో ఫ్లోర్‌లో దిగాను. పరీక్షలన్నీ పూర్తయ్యేసరికి గంట పట్టింది. మళ్లీ లిఫ్ట్ దగ్గర పెద్ద క్యూ. ఆరుగురు ఎక్కాల్సిన లిఫ్ట్‌లో తొమ్మిది మంది ఎక్కారు. రకరకాల బరువులు.. సైజులు. మళ్లీ మర్నాడు కూడా హాస్పిటల్‌కు వెళ్లాల్సి వచ్చింది. ఆ రోజు ఎందుకో ఎక్కువ మంది లేరు. 'దిగండి మేడం..మీ ఫ్లోర్ వచ్చేసింది' అందా లిఫ్ట్ గర్ల్. 'నీ పేరేంటి?' అని అడిగా లిఫ్ట్ నుంచి బయటకు వస్తూ. 'సంధ్య..' అంది ముసిముసిగా నవ్వుకుంటూ. మన చుట్టూ ఉన్న సమాంతర ప్రపంచాలలో మసలేటప్పుడు రిసెప్షనిస్ట్, పేపర్‌బోయ్, ప్లంబర్ ఇలా వృత్తుల పేర్లే తప్ప మనుషుల పేర్లు గుర్తుండవు. అలా ప్రారంభమైన మా పరిచయం బాగా పెరుగుతుందని కానీ.. పెరగాలని కానీ అనుకోలేదు.

మా క్లోజ్ ఫ్రెండ్ తీవ్రంగా జబ్బు పడటంతో రోజూ ఆఫీసు నుంచి వెళ్లేటప్పుడు పలకరించేదాన్ని. అప్పుడు నా వాహకురాలు సంధ్యే. ఆమె పుట్టింది.. పెరిగింది హైదరాబాద్‌లో. 18 ఏళ్లకే పెళ్ళయింది. 20 ఏళ్లకు ఇద్దరు పిల్లలు పుట్టేశారు. "పిల్లలు స్కూలుకు వెళ్లటం మొదలుపెట్టారు. ఇంట్లో కూర్చుని ఏం చేయాలమ్మా! నాకా చదువు లేదు. ఆఫీసులో ఉద్యోగాలు ఇవ్వరు. పిల్లలు స్కూలుకు వెళ్తున్నారుగా.. డబ్బు అవసరం. అందుకే ఆలోచించి ఆసుపత్రిలో చేరా" అని తన గురించి చెబుతుంది సంధ్య. ఆసుపత్రిలో ఉద్యోగమంటే అంత సులభం కాదు. రోజుకు పన్నెండు గంటల డ్యూటీ. లిఫ్ట్‌లో నిలబడే ఉండాలి. రకరకాల మనుషులు లిఫ్ట్ ఎక్కుతూ ఉంటారు. "పేషెంట్లు బానే ఉంటారు. వాళ్ల అటెండెట్స్‌తోనే సమస్య. కుర్రాళ్లతో ప్రోబ్లం లేదు. అంకుల్స్ మాత్రం టచ్ చేయాలని చూస్తూ ఉంటారు. లిఫ్ట్‌లో ప్రయాణమంటే హైదరాబాద్‌లో సిటీ బస్సు ఎక్కినట్లే.." అనే సంధ్యకు అలాంటి అనుభవాలెన్నో. "కొన్నిసార్లు ఈ ఉద్యోగం ఎందుకు చేయాలి అనిపిస్తుంది. ఇవి ఎవరికీ చెప్పలేం. సూపర్‌వైజర్‌తో ఒకసారి చెప్పగలం. ప్రతి రోజూ చెప్పలేం. ఒక్కోసారి ఇంటికి వెళ్లి మా ఆయనతో చెప్పి గట్టిగా ఏడ్చేస్తా. ఆ తర్వాత మళ్లీ మామూలే! మొదట్లో నా మీద నాకే కోపం వచ్చేది. తప్పు నాది కానప్పుడు నేనెందుకు ఏడవాలి?" అంటుంది సంధ్య. "అలాంటి వాళ్లను ఏం చేస్తావు?" అని అడిగితే "చేయటానికి ఏం ఉండదమ్మ.. దూరంగా జరగటమే. ఒకప్పుడు అసహ్యం వేసేది. ఆ తర్వాత కోపం వచ్చేది. ఇప్పుడు జాలి వేస్తోంది..' అంటుంది సంధ్య. తనకే కాదు మన సమాజంలో అమ్మాయిలకు ఏదో ఒక సందర్భంలో ఇలాంటి అనుభవాలు ఎదురవుతూనే ఉంటాయి.



అందరినీ లిఫ్ట్‌లో తీసుకువెళ్లే సంధ్యకు చిన్నప్పుడు లిఫ్ట్‌లాంటి సౌకర్యం ఒకటుంటుందని కూడా తెలియదు. "ఐమ్యాక్స్‌లో మొదటిసారి కదిలే మెట్లు (ఎస్కలేటర్) ఎక్కా. నేను పైపైకి వెళ్లిపోతుంటే నా కింద అందరూ చిన్న పిల్లల్లా కనిపించారు. ఆసుపత్రిలో చేరినప్పుడు కూడా ఏ వార్డులోనో వేస్తారనుకున్నా. లిఫ్ట్‌లో పనిచేయాలని చెప్పినప్పుడు చాలా భయమేసింది. ఆ తర్వాత అలవాటైపోయింది.." అంటుంది సంధ్య. మన చేతికి కొద్దిగా మట్టి అంటుకుంటే దాన్ని పదిసార్లు కడుక్కుంటాం. బొద్దింక పాకితే వైరస్ వచ్చేస్తుందని భయపడతాం. అలాంటిది ప్రతి రోజు రకరకాల జబ్బులతోను, వ్యాధులతో బాధపడేవారితో పన్నెండు గంటల జీవనం. ఆఫీసులో పక్కవాళ్లకు జలుబొస్తే వాళ్ల కన్నా ముందు నేను ట్యాబ్‌లెట్ వేసుకుంటా. అలాంటిది ప్రతి రోజు రకరకాల వ్యక్తులను చూస్తూ.. వారి బాధలు వింటూ ఉండటం అంత సులభం కాదు. "ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం లిఫ్ట్‌ను క్లీన్ చేస్తారు. వైరస్‌ల భయం లేదమ్మా. కానీ పేషెంట్ల బాధలు వింటూంటే జాలేస్తుంది. ఒక రోజు ఒకావిడ తన బిడ్డను ట్రీట్‌మెంట్‌కు తీసుకొచ్చింది. రెండుగంటల్లో మళ్లీ ఆ బిడ్డను పొత్తిళ్ళలో ఎత్తుకొని తీసుకెళ్లిపోయింది. ఆ సాయంత్రం నాకు మా ఫ్రెండ్స్ చెప్పారు. ట్రీట్‌మెంట్ చేస్తుంటేనే బిడ్డ చనిపోయాడట. ఆమె ఆ మాట నమ్మలేదట. బిడ్డను తీసుకుని వెళ్లిపోయిందట. ఆ మాటలు వినగానే షాక్ కొట్టినట్లయింది. ఆ రోజు రాత్రంతా ఆమె కలలే! ఇప్పటికీ ఎవరైనా బిడ్డను ఎత్తుకొని వస్తే చాలా భయమేస్తుంది" అని తన అనుభవాన్ని చెబుతుంది సంధ్య.

"ఈ ఆసుపత్రికి ఎవరూ రాకూడదమ్మ! అందరూ తాము పనిచేసే ఆఫీసులు డెవలప్ అవ్వాలనుకుంటారు. బహుశా ఆసుపత్రికి ఎవరూ రాకపోతే బావుండును అనుకునేది మేమేనేమో!" అన్న సంధ్య మాటలు వింటుంటే మనుషుల్లో ఇంకా మానవత్వం మిగిలే ఉందనిపించింది.

—సీత

**email: fbackfm@gmail.com**



కలుపుకోవాలని బీజేపీ తహతహలాడుతోంది. నితీశ్ కూడా మోదీ లాగా అధికారం కోసం అవినీతికి పాల్పడని అరుదైన రాజకీయ నాయకుడిగా పేరున్న వ్యక్తి. కానీ, 2015 అసెంబ్లీ ఎన్నికల్లో ఆయన అప్పటికే అవినీతి నాయకుడుగా పేరున్న లాలూతో చేతులు కలిపారు. ఇది బీజేపీ మీద కోపంతో తప్ప లాలూ మీద ప్రేమతో చేసింది కాదని రాజకీయ విశ్లేషకులు అప్పట్లో వ్యాఖ్యానాలు చేశారు.

### ఒక ఒరలో రెండు కత్తులు

పశువుల దాణా కుంభకోణంలో లాలూ సుమారు 960 కోట్ల రూపాయల అవినీతికి పాల్పడినప్పుడు, ఆయన 'ఆటవిక' పాలన మీదా, అవినీతి మీదా నితీశ్ అవిశ్రాంత పోరాటం జరిపారు. లాలూనే కాదు, ఆయన కుటుంబ సభ్యులను సైతం నితీశ్ వదిలి పెట్టలేదు. అయితే, 2014 లోక్‌సభ ఎన్నికల్లో బీజేపీ రంగంలోకి దిగి, జేడీ (యు), ఆర్‌జేడీలను తుడిచి పెట్టేసినప్పుడు, నితీశ్ తనకు ఇష్టం లేకపోయినా

# ఊహించని వ్యూహం




- రాజశుక

**లాలూ ముందరి కాళ్లకు బంధం వేయడానికి బిహార్ ముఖ్యమంత్రి నితీశ్ కుమార్‌కు రాష్ట్రపతి ఎన్నికల వ్యవహారం ఓ బ్రహ్మాస్త్రంలాగా ఉపయోగపడింది.**

రాష్ట్రీయ జనతాదళ్ అధినేత, బిహార్ మాజీ ముఖ్యమంత్రి లాలూప్రసాద్ యాదవ్ ఆస్తుల మీద ఇటీవల సీబీఐ అధికారులు దాడి చేసినప్పుడే అర్థమైపోయింది మహాకూటమిలో చీలికలు తప్పవని. ముఖ్యమంత్రిగా ఉండగానే కాక, రైల్వే మంత్రిగా ఉన్నప్పుడు కూడా లాలూప్రసాద్ యాదవ్ తన ఆదాయానికి మించి కోట్లాది రూపాయల ఆస్తులు సమకూర్చుకున్నారని సీబీఐ ఆరోపిస్తోంది. దేశంలో ఈ మధ్య కాలంలో ఇంతగా అవినీతికి పాల్పడిన రాజకీయ నాయకుడెవరూ లేరు. రాష్ట్రీయ జనతాదళ్ (ఆర్‌జేడి), ప్రస్తుత బిహార్ ముఖ్యమంత్రి నితీశ్ కుమార్ నాయకత్వంలోని జనతాదళ్ (యు), కాంగ్రెస్ పార్టీల మధ్య బిహార్‌లో ఏర్పడిన మహాకూటమి లాలూ ఘనకార్యాలతో చీలిపోయే సూచనలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. లాలూతో తెగ తెంపులు చేసుకోవాల్సిందిగా బీజేపీ కూడా నితీశ్‌కు ఇప్పటికే సూచించింది.

విచిత్రమేమిటంటే, లాలూతో విడిపోవాలని అంతకు ముందు నుంచే ఎదురు చూస్తున్న నితీశ్ కుమార్‌కు లాలూ అవినీతి ఓ సదవకాశంగా అంది వచ్చింది. రాష్ట్రపతి ఎన్నికల సందర్భాన్ని ఆయన చక్కగా వినియోగించుకుని, మహా కూటమి అభిప్రాయానికి భిన్నంగా బీజేపీ రాష్ట్రపతి అభ్యర్థి రామ్‌నాథ్ కోవింద్‌కే రాష్ట్రపతి ఎన్నికల్లో ఓటు వేయబోతున్నట్టు ప్రకటించారు. లాలూను దూరం పెట్టడానికి కారణం అవినీతంటే నితీశ్‌కు నచ్చక కాదు. లాలూను దూరం పెడితే తాను సంపూర్ణ అధికారాన్ని అనుభవించవచ్చన్నదే ఆయన ఉద్దేశం. లాలూ పార్టీతో రాష్ట్రంలో అధికారం పంచుకోవాల్సి రావడం ఆయనకు కొంతకాలంగా ససేమిరా నచ్చడం లేదని ఆయన సన్నిహితులు చెబుతున్నారు. లాలూను వదల్చుకుంటున్నట్టు, బీజేపీతో చేతులు కలుపుతున్నట్టు ఆయన బహిరంగ ప్రకటన చేస్తారని అంతా ఆశిస్తున్నారు కానీ, ఆయన బహిరంగ ప్రకటన చేసే సూచనలు మాత్రం ఎక్కడా కనిపించడం లేదు. నితీశ్ మాటల మనిషి కాదు, చేతల మనిషి.

ఈ ఏడాది మేలో పది పన్నెండు బినామీ ఆస్తులకు సంబంధించి లాలూ కుటుంబానికి చెందిన 22 ఇళ్లు, కార్యాలయాలు, కంపెనీలపై ఆదాయపు పన్ను శాఖ అధికారులు దాడులు చేసినప్పుడు కూడా లాలూను ఇక దూరం పెట్టి తమతో చేతులు కలపాల్సిందిగా బీజేపీ అగ్ర నాయకత్వం నితీశ్‌కు సూచించింది. సుమారు 17 ఏళ్ల మైత్రి అనంతరం 2013లో తమ నుంచి హఠాత్తుగా విడిపోయిన నితీశ్‌ను ఏదో విధంగా మళ్లీ తమతో లాలూతో చేతులు కలిపారు. అసెంబ్లీ ఎన్నికల్లో విజయం సాధించి తాను మళ్లీ ముఖ్యమంత్రిని కావాలంటే, బీజేపీని దూరం పెట్టి, లాలూ పార్టీతో చేతులు కలపడం ఆయనకు అనివార్యంగా కనిపించింది. వాస్తవానికి అసెంబ్లీ ఎన్నికల నాటికీ ఇప్పటికీ పరిస్థితిలో ఏమీ మార్పు రాలేదు. పైగా ఈ ఏడాది ఆదాయపు పన్ను, సీబీఐ అధికారుల దాడులు మరీ ఎక్కువ కావడం, బిహార్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడే కాకుండా రైల్వే మంత్రిగా ఉన్నప్పుడు కూడా లాలూ కోట్లాది రూపాయల ఆస్తులు కూడకట్టు కున్నారంటూ కొత్త ఆరోపణలు వెల్లువెత్తాయి. దర్యాప్తు సంస్థలు ఈ ఆరోపణలు చేస్తున్నాయే తప్ప న్యాయ స్థానాలు వీటిని నిర్ధారించలేదన్నది వేరే విషయం.

అయితే, 2015కి ముందు మాత్రం పశువుల దాణా కేసులో లాలూ దోషిగా నిలిచారు. ఆయన కొంత కాలం కారాగారవాసం కూడా చేశారు. ఆయనపై వచ్చిన అవినీతి ఆరోపణలు నిజమే



నంటూ కోర్టు ధ్రువీకరించింది. సుప్రీం కోర్టు తీర్పు తరువాత లాలూ లోక్‌సభకు పోటీచేసి ఓడి పోయారు. మరో ఆరేళ్లపాటు ఆయన ఎన్నికల్లో పోటీచేయకుండా కోర్టు నిషేధం కూడా విధించింది. అటువంటి సమయంలో కూడా లాలూతో చేతులు కలిపిన నితీశ్ కేవలం ఆదాయపు పన్ను శాఖ, సీబీఐ దాడులకే ఆయనను దూరంగా పెడతారా? నితీశ్ ఉద్దేశాలు వేరు కావచ్చు. ఆయన తన మన సులో మాటని ఒకపట్టాన బయటపెట్టరనేది ఆంత రంగికుల మాట. మొత్తానికి ఎన్డీయే రాష్ట్రపతి అభ్యర్థి రామ్‌నాథ్ కోవింద్‌కు మద్దతు తెలియజేయడం ద్వారా నితీశ్ కుమార్ అటు కాంగ్రెస్‌తోనూ, ఇటు ఆర్‌జేడీతోనూ తెగతెంపులు చేసుకున్నట్టయింది. ఆయన లాలూకు దూరం అవుతున్నారని, బీజేపీకి సన్నిహితులవుతున్నారని ఆయన నిర్ణయం చెప్ప కనే చెప్పింది.

మోదీ, అమిత్ షాల నాయకత్వంలోని బీజేపీకి నితీశ్ అనుకూలంగా మారడం చాలా కాలం కిందటే మొదలైందని రాజకీయ విశ్లేషకులు గుర్తు చేస్తు న్నారు. గత ఏడాది మోదీ ప్రభుత్వం వాస్తవాధీన రేఖ వద్ద మెరుపు దాడులు సాగించినప్పుడు, పెద్ద నోట్లను రద్దు చేసినప్పుడు నితీశ్ బహిరంగంగానే ఈ రెండు నిర్ణయాలనూ సమర్థించారు. ఈ రెండు నిర్ణయాలను కాంగ్రెస్, ఆర్‌జేడీలు గట్టిగా ఖండి స్తున్న సమయంలోనే ఆయన వాటిని సమర్థిస్తూ ప్రకటనలు చేయడం అందరినీ ఆశ్చర్యపరిచింది. అవినీతిని నియంత్రించడానికి నోట్ల రద్దు కంటే మంచి అస్త్రం మరొకటి లేదని ఆయన ప్రకటించడం దేశంలోని ప్రతిపక్షాలన్నిటినీ కలవరపరిచింది. తన అభిప్రాయాలు తనకున్నాయని, తనది గొర్రెల మనస్తత్వం కాదని ఆయన అనేక సందర్భాల్లో తన చేతల ద్వారా తేటతెల్లం చేస్తూనే ఉన్నారు. రాజకీయ కారణాలతో ఓ విధానాన్ని లేదా నిర్ణ యాన్ని వ్యతిరేకించడమో, సమర్థించడమో తాను చేయనని అనేక పర్యాయాలు నితీశ్ తెలియజేశారు.

## వెనుకటి అనుభవాలు

ఆయన ఏం చెప్పినప్పటికీ ఒక్కటి మాత్రం నిజం. ఆయనకు తన రాజకీయ ప్రయోజనాలే ముఖ్యం. ఈ విషయంలో ఆయన రాజీ పడరు. అందుకు తగ్గట్టుగానే ఆయన ఆచితూచి అడు గులు వేస్తుంటారు. ఆయన కోవింద్ అభ్యర్థిత్వాన్ని ఎందుకు అంగీకరించారు? బిహార్ గవర్నర్‌గా పని చేసిన కోవింద్‌కు మోదీ ప్రభుత్వంతో సాన్నిహిత్యం ఎక్కువ. నితీశ్ ప్రభుత్వం ప్రవేశపెట్టదలచుకున్న మద్యపాన నిషేధం ఆర్డినెన్స్‌లో కొన్ని నిబంధనలు దారుణంగా ఉన్నాయంటూ రాష్ట్ర బీజేపీ నాయ కులు గట్టిగా నిరసన తెలియజేస్తున్నా కోవింద్ ఆ ఆర్డినెన్స్‌కు పచ్చజెండా చూపించారు. మద్యపాన నిషేధానికి అడ్డుపడడం కోవింద్‌కు ససేమిరా ఇష్టం లేదు. బిహార్‌లో ఏ గవర్నర్ పనిచేసినా రాష్ట్ర ప్రభు త్వాన్ని ఏదో విధంగా ఇరకాటంలో పెట్టేవారు. ముఖ్యంగా వైస్‌చాన్సలర్ల నియామకంలో ఎన్నో అడ్డంకులు సృష్టించేవారు. కానీ, కోవింద్ మాత్రం





నితీశ్‌తో సన్నిహితంగా ఉండేవారు. నితీశ్ సమ స్యల్లో ఉన్నప్పుడు కోవింద్ వీలైనంతగా ఆయనను ఆదుకునేవారు.

రాష్ట్రపతి ఎన్నికల్లో కోవింద్ విజయం సాధిం చడం ఖాయమని నితీశ్‌కు బాగా తెలుసు. ప్రతి పక్షాల అభ్యర్థి మీరా కుమార్ ఎటువంటి పరిస్థితు ల్లోనూ విజయం సాధించే అవకాశం లేదని ఆయ నకు అర్థమైపోయింది. రాష్ట్రపతి భవన్‌లో తనకు అనుకూలమైన వ్యక్తి ఉంటే తనకు, తన పార్టీకి అన్ని విధాలా ఉపయోగమని ఆయన భావిస్తున్నారు. బిహార్‌లో ఎటువంటి రాజకీయ సంక్షోభం తలెత్తినా

> **జనతాదళ్ (యు) పార్టీ గతంలో 17 ఏళ్లు బీజేపీతో పొత్తు కొనసాగించింది. కానీ ఎప్పుడూ నితీశ్ ప్రభుత్వంపై బి.జె.పి సవారీ చేయలేదు. నాలుగేళ్లుగా మహాకూటమిలో ఉన్న నితీశ్‌కుమార్ బలవంతంగా ఆర్.జె.డిని భరిస్తున్నారు. ఎందుకంటే ఆ పార్టీ ఆధిపత్య ధోరణిని నితీశ్ ఎంతమాత్రం సహించలేకపోతున్నారు. లాలూను దూరం పెడితే సంపూర్ణ అధికారం అనుభవించవచ్చుననేదే నితీశ్ ఉద్దేశం.**

ఆయన తనకు అండగా నిలవగలరని కూడా ఆయన అభిప్రాయపడుతున్నారు. అయితే, ప్రతిపక్షాల అభ్యర్థి మీరా కుమార్ ఓడిపోవడం ఖాయమనే ఉద్దేశంతో ప్రతిపక్షాల వైఖరికి వ్యతిరేకంగా నితీశ్ వెళ్లడం సమంజసమేనా అన్నది ప్రశ్న. 2007లో యూపీఏ అధికారంలో ఉన్నప్పుడు బీజేపీ నిల బెట్టిన ప్రతిపక్ష అభ్యర్థి భైరాన్ సింగ్ షెఖావత్‌కు నితీశ్ మద్దతు ఇచ్చిన విషయాన్ని మరచిపోకూ డదు. అప్పట్లో ఆయన బిహార్‌లో బీజేపీతో కలిసి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. అందువల్ల షెఖావత్‌కు మద్దతునివ్వక తప్పలేదు. అప్పటికీ, ఇప్పటికీ నితీశ్ రాజకీయ ఆకాంక్షల్లో పెను మార్పులు చోటుచేసు కున్నాయి. ఇప్పుడాయనకు లాలూ అన్నా, ఆర్‌జేడీ అన్నా ఏమాత్రం నచ్చడం లేదు. బిహార్‌లో నితీశ్ ముఖ్యమంత్రి అయినప్పటికీ, తమదే పాలన అన్న రీతిలో లాలూ వ్యవహరిస్తుండడం ఆయనకు దుర్భరంగా ఉంది.

## బీజేపీతో సాన్నిహిత్యం

నితీశ్ గతంలో బీజేపీతో కలిసి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసినప్పుడు, ఆ పార్టీ ద్వితీయ స్థాయి పార్టీగానే ఉండేది. నితీశ్ అభీష్టానికి వ్యతిరేకంగా నడుచుకునేది కాదు. దాదాపు 17 ఏళ్ల పాటు ఆ పొత్తు నితీశ్‌కు అనుకూలంగానే కొనసాగింది. ఇప్పుడు ఆర్‌జేడీతో అలా జరగడం లేదు. ఎనభై మంది సభ్యులతో ఆ పార్టీ 'ఆధిపత్య' స్థాయిలో ఉంది. లాలూతో సహా ఆర్‌జేడీ నాయకులు తరచూ నితీశ్‌కి ఆ విషయం గుర్తు చేస్తుంటారు. అవినీతి ఆరోపణలతో కోర్టుల చుట్టూ, సీబీఐ కార్యాలయం చుట్టూ తిరుగుతున్నా, కోర్టు ఆరేళ్ల పాటు ఎన్నికల్లో పాల్గొనకుండా బహిష్కరించినా లాలూ ఇప్పటికీ నితీశ్ మీద స్వారీ చేయడం మానలేదు. ఒకప్పుడు తాను నితీశ్‌కు నాయకుడనే విషయాన్ని కూడా లాలూ తరచూ బహిరంగంగా గుర్తు చేస్తుంటారు. మోదీ అధికారంలోకి వచ్చేవరకూ కొనసాగిన బీజేపీ, జేడీ(యు)ల పొత్తును ఆయన లాలూతో పొత్తుతో ఎప్పుడూ పోల్చి చూసుకుంటుంటారు. గత 17 నెలల నుంచీ నితీశ్ ఆర్‌జేడీతో పొత్తును మౌనంగా భరించాల్సి వస్తోంది. ఇప్పటికైనా ప్రత్యా మ్నాయ మార్గాలు వెతుక్కోపోతే, తాను ముఖ్య మంత్రిగా తన విధులు నిర్వర్తించడం కూడా అసా ధ్యమైపోతుందని ఆయన లోలోపల భావిస్తున్నా రని సన్నిహితులు చెబుతున్నారు.

భవిష్యత్తులో ఆయన ఆర్‌జేడీతో, ముఖ్యంగా లాలూతో తెగతెంపులు చేసుకుని, బీజేపీతో సాన్ని హిత్యం పెంచుకున్నారంటే, అందుకు ప్రధాన కారణం లాలూ అవినీతి కానేకాదు. అవినీతి విషయంలో నితీశ్‌కు అభ్యంతరమేమీ లేదు. తన ప్రభుత్వంలో భాగస్వామి లేకుండా తాను సంపూర్ణ అధికారాన్ని అనుభవించాలనుకోవడమే అందుకు తిరుగులేని కారణం. అందుకు ప్రస్తుతానికి రాష్ట్రపతి ఎన్నిక దోహదం చేస్తోంది. ఆయనకు తనే ముఖ్యం. ఆయ నకు తన నిర్ణయాలు, తన అధికారమే ప్రధానం. దాని కోసం ముందుముందు ఆయన ఏం చేసినా, ఏ నిర్ణయం తీసుకున్నా ఆశ్చర్యపోనక్కరలేదు.

# అతి సర్వత్ర వర్జయేత్

గొల్లపూడి బాల సుబ్రహ్మణ్యం

**"మిస్టర్ హరి...ఐ వాంట్ దిస్ రిపోర్ట్ బై నైన్ ఇన్ ది మార్నింగ్" అప్పటి దాకా ఆఫీస్‌లో అలిసిపోయి ఇంటికి వచ్చిన నరహరి భోజనం చేస్తూ తన బ్లాక్‌బెర్రీలో మెయిల్ చూసి ఉసూరుమన్నాడు. "ఇవాళ రాత్రి జాగారం తప్పదు నీరూ" అన్నాడు భార్యవైపు నీరసంగా చూస్తూ.**

"ఏమైంది? మళ్ళీ పనా? ఇప్పటిదాకా ఆఫీస్ పనిమీదే ఉన్నారుగా, కనీసం నిద్ర అయినా సరిగా పోనీరా మీ ఆఫీసు వాళ్ళు?" రుసరుసలాడింది నీరజ సాంబారు వడ్డిస్తూ.

"ఏం చెయ్యను! బాస్ మెయిల్ పంపించాడు. ముఖ్యమైన ఒక పని రేప్పొద్దున తొమ్మిదికల్లా పూర్తి చెయ్యమని. ఆపని తొమ్మిదికల్లా కావాలంటే నేను రాత్రంతా పని చెయ్యాల్సిందే" అన్నాడు నరహరి పూర్తి నిస్సహాయంగా.

"గత కొన్నేళ్ళుగా దాదాపు ఇదే వ్యవహారం. సరైన తిండి లేదు. నిద్ర లేదు. ఆఫీస్ నుంచి వచ్చాక కూడా ఆఫీస్ మెయిల్స్ చూడడం... పని ఉందంటూ నిద్ర పాడుచేసుకోవడం. సంపాదించింది చాలు. ఇక ఆ ఉద్యోగం మానుకుని స్వంతంగా ఏమైనా చూసుకోరాదూ. యాభయ్యో ఏట ప్రవేశించారు. ఇక ఇప్పట్నుంచీ ఆరోగ్యం మీద కూడా శ్రద్ధ వహించాలి" నిష్ఠూరంగా అన్నది నీరజ.

"నిజమే నీరూ. నువ్వన్న దాంట్లోనూ పాయింటు ఉంది. కానీ నీకు తెలియంది కాదు కదా. పిల్లలిద్దరూ పెద్ద క్లాసులకి వస్తున్నారు. ఏడాదికి ఇద్దరికీ కలిపి కనీసం రెండున్నర నుంచి మూడులక్షల దాకా కావాలి. ఇంటి లోన్, కారు లోన్, మొన్న మొదలెట్టిన చిట్ ఇలా బోలెడు ఖర్చులు. అది కాక వెనకేమీ ఆస్తులు లేవు మనకి. కూర్చుని తింటే ఇప్పటిదాకా వెనకేసింది రెండేళ్ళలో కరిగిపోతుంది. నీ హెల్త్ ప్రాబ్లంవల్ల నువ్వు ఉద్యోగం చెయ్యలేవు. ఒక్క సంపాదనమీద ఇల్లు గడవాలి. ఈ పరిస్థితుల్లో కష్టమైనా, ఇష్టం లేకపోయినా ఉద్యోగం చెయ్యడం మనకి చాలా అవసరం. ఆఫీస్ వాళ్ళంతే. జీతం రూపాయి ఇస్తే పని నాలుగు రూపాయల మేర పిండుతారు. అదే వాళ్ళ బిజినెస్. ఎవ్వరినీ ఏమీ అనలేం, సర్దుకుపోవడమే" చెయ్యి కడుక్కుంటూ అన్నాడు నరహరి.

"అదంతా సరే. ఆఫీస్ టైమ్‌లో పని చెయ్యడం వరకూ తప్పదు. నా కోపమంతా ఈ రాత్రిళ్ళు నిద్ర మానుకొని మరీ పని చెయ్యడం మీదే" వంటిల్లు సర్దుతూ అన్నది నీరజ.

"అవును మరి, ఇరవైఏళ్ళ క్రితం ఆరు గంటలకి ఆఫీసు వదిలితే మళ్ళీ మర్నాడు పొద్దున్న ఆఫీస్ చేరే దాకా పని గోల ఉండేది కాదు. కానీ టెక్నాలజీ పెరిగిపోయి ఈ ల్యాప్‌టాప్‌లు, మొబైల్‌ఫోన్లు వచ్చాక మనిషితో పాటు ఆఫీస్ పని కూడా ఇల్లు చేరుతోంది. ఆఫీస్‌కీ, ఇంటికీ తేడా లేకుండా పోయింది. పైగా ఈ బ్లాక్‌బెర్రీ స్మార్ట్‌ఫోన్లు వచ్చాక ఇల్లు కాదు, చివరికి బాత్రూంలో ఉన్నా పని చెయ్యాల్సిందే. ఇదుగో ఇప్పుడు చూడు, ఈ రాత్రివేళ ఒక చిన్న మెయిల్ పంపించాడు బాస్. అంతే, ఆయన పని అయిపోయింది. ఇప్పుడు నేను పని పూర్తి చెయ్యలేదనుకో, ఈ రిపోర్టు పూర్తి చెయ్యాలని తెలిసీ పనిచెయ్యని అసమర్థుడని పేరొస్తుంది, కెరీర్ దెబ్బతింటుంది" ల్యాప్‌టాప్ తెరుస్తూ అన్నాడు నరహరి.

"మరే, అందుకే ఈ ప్రైవేట్ ఉద్యోగాలు మనకి వద్దని ఆ గవర్నమెంటు జాబ్ వదిలేసే ముందే నేను మొత్తుకున్నాను. కానీ విన్నారా, డబ్బులు బాగా వస్తాయన్నారు. ఇక్కడ అరవైఏళ్ళల్లో సంపాదించేది అక్కడ



యాభై ఏళ్ళల్లో సంపాదించి సుఖంగా ఉండొచ్చని నచ్చ చెప్పారు. ఇప్పుడు ఇలా బాధపడుతున్నారు" అన్నది నీరజ.

"మొదట్లో ఇక్కడ బాగానే ఉండేది కదా నీరూ. బ్యాంక్‌లో ఉన్నంత సేపే పని. ఈ ఎలక్ట్రానిక్ గాడ్జెట్స్ వల్ల ఇంట్లో కూడా ఆఫీస్ పని ఒత్తిడి పెరిగిపోయింది. అసలు మనుషులు తీరికగా కూర్చుని మాట్లాడుకోవడం తగ్గిపోయింది. ఎంతసేపూ మొబైల్‌నో, ఫేస్‌బుక్కునో, వాట్సప్‌నో గంటల తరబడి చూస్తూ కూర్చోవడం, అదీ కాకపోతే టీవీ, కంప్యూటర్. ఇలా జీవితమంతా యాంత్రికమయమైపోయింది. వీటి వల్ల మనుషుల నడవడి మారిపోయింది. వింతగా ప్రవర్తిస్తున్నాం. కొత్త రోగాలు వస్తున్నాయి.



కుటుంబంలో ఉన్న నలుగురు ఈ నాలుగు గోడల మధ్యే చెట్టుకొకరు, పుట్టకొకరు లాగా ఉంటున్నారు. అందుకే ఒకరి మీద ఒకరికి అనుబంధాలు అనురాగాలు పెరగడం లేదు. ఈ ఊబిలోంచి బయటకు వచ్చే మార్గమే కనిపించట్లేదు" ఆవేశంగా అన్నాడు నరహరి.

"అంతే మరి, మా అమ్మ చిన్నప్పుడు అంటూ ఉండేది... వాళ్ళ చిన్నప్పటిలాగా మన స్నేహాలు ఉండట్లేదనీ, ఇలా ఒక తరానికి ఇంకొక తరానికి మధ్య జీవన విధానంలో ఎన్నో మార్పులు వస్తున్నాయనీ. కాలంతో పాటు మనమూ మారుతూ వెళ్ళడమేగా జీవితమంటే. మనం చిన్నప్పటి రోజుల్లోలానే ఇప్పుడుకూడా ఉండాలంటే ఎలా కుదురుతుంది? అప్పటి మన స్నేహితులు ఎంతోమంది ఇప్పటికీ మనకి మంచి స్నేహితులే. అప్పుడు మనుషులకి మనుషులతోనే కాలక్షేపం. అందుకే ఆ జ్ఞాపకాలు ఇప్పటికీ పదిలంగా ఉన్నాయి. ఈ కాలంలో స్నేహం యంత్రాలతోనో లేదా యంత్రాల ద్వారానో. అది కూడా అవసరం మేరకే. అందుకే ఈ బ్రేకప్‌లు, విడాకుల శాతం నానాటికి పెరిగిపోతున్నాయి. 'సర్దుకుపోవడం' అనే మాట ఎవరికీ నచ్చట్లేదు. సరే, ఈ గోల మనకి ఎప్పుడూ ఉండేదే. మనం చెయ్యగలిగినదేమీ లేదు, కాలంతో పాటు మనమూ మారకతప్పదుగానీ, పిల్లలు ఎప్పుడో నిద్రపోయారు. మీరు త్వరగా పని పూర్తి చేసి వీలైనంత పెందరాళే పడుకోండి. నేను పడుకుంటున్నాను" అని హాల్లోకి నడిచింది నీరజ.

"ఆ పాత రోజులు మళ్ళీ రావు" అని నిట్టూరుస్తూ పనిలోకి దిగాడు నరహరి. పనిలో ఉన్నా నరహరి మనసు నీరజ అన్న మాటల మీదే ఉంది. 'పాత రోజులు ఎంత అద్భుతంగా ఉండేవి! మా బాల్యం ఎంత మధురంగా గడిచేది. ఇప్పటికీ ఆ జ్ఞాపకాలు తాజాగా ఉన్నాయి. అందుకే ఇంగ్లీషు వారు అన్నారు...ఓల్డ్ ఈజ్ గోల్డ్ అని. నిజమే కదా!' అనుకుంటూ పని పూర్తి చేసేసరికి పన్నెండు దాటింది. పక్కమీదకి చేరి కాసేపు అటూ ఇటూ దొర్లాడు నిద్రపట్టక. "హే శ్రీమన్నారాయణ ప్రభో!! ఎక్కడున్నావు స్వామీ? ఎందుకీ జీవితాలు? ఎందుకు ఇలా మమ్మల్ని మరబొమ్మల్లా మారుస్తు న్నావు? బ్రతుకంతా డబ్బు సంపాదన కోసమే జీవిస్తూ, పనితోనే మా పని అయిపోయేలా ఎందుకు చేస్తున్నావు స్వామీ?" అనుకుంటూ మెల్లగా నిద్రలోకి జారాడు.

***

"ఏమయ్యా నరహరీ, నేను శ్రీహరిని. లేవయ్యా, రమ్మని పిలిచి ఏమిటీ మొద్దు నిద్ర?" ఎవరో పరిచయం లేని గొంతుతో నిద్ర లేవమని పిలవడం లీలగా వినిపిస్తోంది నరహరికి.

ఠక్కున మెలకువ వచ్చింది నరహరికి. ఎదురుగా తన ఇష్టదైవం సాక్షాత్తూ శ్రీమహావిష్ణువే! దేదీప్యమానమైన వెలుగుతో కనిపించాడు.

"స్వామీ కరుణించావా? ఈ అర్భకుడి ప్రార్థన విని ప్రత్యక్షమయ్యావా దేవా?" ఆర్తిగా అడిగాడు.

"కాలంతో పాటు ముందుకునడిచి ప్రగతిని ఆస్వాదించడమే నేను సృష్టించిన ఈ కలికాల ధర్మం. మళ్ళీ పాతరోజుల్లా వెనక్కు వెళ్ళడం జరగదు నరహరి" ఆప్యాయంగా అన్నాడు శ్రీహరి.

"కానీ స్వామీ, ఈ యంత్రాల మాయలోపడి మనుషుల మధ్య సంబంధ బాంధవ్యాలు తగ్గిపోవడం ఎంతవరకూ ధర్మం? మళ్ళీ ఆ పాతరోజుల్లోలాగా ఒత్తిడి లేని బ్రతుకులు బ్రతకలేమా? నా కోసం ఆ వరమియ్యలేవా?" దీనంగా అడిగాడు నరహరి.

"ఆ నేరం నాది కాదు హరి. నేను కేవలం యంత్రాలను సృష్టించే మేధస్సు మనుషులకి ఇచ్చానుగానీ వాళ్ళ మనసుల మధ్య గోడలు నేను సృష్టించలేదు. అవి మీరు సృష్టించుకున్నవే. యంత్రాల మాయలో పడడం మానవ తప్పిదం. అది మీరే సరిదిద్దుకోగలరు. నా వరం ఎందుకు?" నవ్వుతూ అన్నాడు శ్రీహరి.

"లేదు స్వామీ, ఈ పరిస్థితి మారాలంటే మేము మారడం కాదు. యంత్రాలు మాయం కావడం ఒక్కటే పరిష్కారం. మీరు ఆ వరమియ్యాల్సిందే, కనికరించండి" వేడుకున్నాడు నరహరి.

"పురాణాలు చదివే తీరికలేక ఇలాంటి విపరీతమైన కోరికలు కోరడం విపరీతాలకి దారి తీస్తుందని తెలియక అడుగుతున్నావ్ నరహరీ! సరే, అనుభవించు. తథాస్తు.." అని మాయమయ్యాడు శ్రీహరి.

***

"శ్రీ సూర్యనారాయణ మేలుకో...హరి సూర్యనారాయణ..." తనకి ఎంతో ఇష్టమైన సుప్రభాతం చాలా రోజుల తరువాత లీలగా వినిపించడంతో మెలకువ వచ్చింది నరహరికి.

"అబ్బ! ఎన్ని రోజులైంది ఈ పాట విని! ఎక్కడ నుంచి వస్తోంది" అనుకుంటూ హాల్లోకి నడిచాడు. తన పెళ్ళైన కొత్తల్లో కొన్న చిన్న ట్రాన్సిస్టర్‌లోనించి వస్తోందా పాట. "నీరూ...ఎక్కడున్నావ్? ఈ ట్రాన్సిస్టరు ఎక్కడ నుంచి బయటకి తీశావ్?" తన్మయంగా పాట వింటూ అడిగాడు నీరజని.

"అది మీ టేబుల్‌మీదే ఉంది. చాలా కాలమైంది కదా అని రేడియో పెట్టాను. ఇదిగో ఈ సుప్రభాతం వస్తోంది" అన్నది నీరజ. "అవును నా బ్లాక్‌బెర్రీ ఎక్కడ పెట్టాను నిన్న రాత్రి? కనిపించట్లేదు, అదేంటీ నా ల్యాప్‌టాప్ కూడా కనిపించట్లేదు! కోపమొచ్చి ఎక్కడైనా దాచేశావా? ఒకసారి ఇలా వచ్చి వెతుకు ఆఫీస్‌కి వెళ్ళేలోగా ఏమైనా ముఖ్యమైన మెయిల్స్ ఉంటే చూసుకోవాలి. పొద్దున్నే నా మొదటి పని అదే అని నీకు తెలుసు కదా?" కంగారుగా వెతుకుతూ అన్నాడు నరహరి.

"ఏమో, అక్కడే ఎక్కడో పెట్టి ఉంటారు చూడండి. నేను చూడలేదు" అన్నది నీరజ వంటింట్లోంచి వచ్చి. ఇద్దరూ కలిసి మొత్తం ఇల్లంతా వెతికారు. ఎక్కడా కనిపించలేదు వాళ్ళకి.

"నాన్నా, నా ట్యాబ్ కూడా కనబడట్లేదు" అరుస్తున్నాడు రాహుల్. "కొంపదీసి దొంగలు కానీ పడ్డారా? నీరూ, ఒకసారి బీరువా చూడు ఇంకా ఏమైనా పోయాయేమో? అసలే ఇవాళ ఆఫీస్‌లో ముఖ్యమైన మీటింగ్ ఉంది. పొద్దున్నే ఈ గోల ఏమిటి? సెలవు పెట్టడానికి కూడా కుదరదు" అన్నాడు నరహరి.

"లేదండీ...బీరువాలో ఏ వస్తువూ పోలేదు. అన్నీ అలానే ఉన్నాయి" లోపల నుంచి అన్నది నీరజ.

"అమ్మా, టీవీలో ఒక్క ఛానల్ మాత్రమే వస్తోందే! మన కేబుల్ వాడి దగ్గర కరెంట్ పోయిందేమో" హాల్లోంచి అరచింది అనన్య. "పొద్దున్నే స్కూల్‌కి తయారవకుండా టీవీ పెట్టుక్కూర్చున్నావా? అసలే ఒక పక్క బ్లాక్‌బెర్రీ

దొరక్క అందరం టెన్షన్‌లో ఉంటే...!" హాల్‌లోకి వస్తూ కోప్పడ్డాడు నరహరి.

ఒక్క దూరదర్శన్ ఛానల్ మాత్రం వస్తోంది. అది కూడా వార్తలు. మిగతావి ఏ ఛానల్సూ రావట్లేదు. కేబుల్ వాడికి ఫోన్ చేద్దామంటే మొబైల్ కనిపించట్లేదు. "సరే ఇప్పుడు టీవీ సంగతి దేవుడికి ఎరుక. నేను అర్జంట్‌గా ఆఫీస్‌కి వెళ్ళి లీవు తీసుకుని పోలీస్ కంప్లయింట్ ఇవ్వాలి" అని హడావిడిగా బాత్రూంలోకి పరిగెత్తాడు నరహరి.

***

హడావిడిగా కిందికి దిగిన నరహరికి తన కారు కనిపించలేదు. తన కారు కాదు కదా మొత్తం బిల్డింగ్‌లో ఒకటో రెండో మారుతి కార్లు తప్పితే ఇంకేమీ కనిపించలేదు. బిల్డింగ్ బయటకి వచ్చిన నరహరి ఆశ్చర్యపోయాడు. రోడ్లమీద గత రెండు దశాబ్దాలుగా నగరాలలో కనుమరుగైన రిక్షాలు,. అక్కడక్కడా ఒకటీ రెండూ ఆటోలు. సిటీ బస్సులు, స్కూలు వ్యాన్లు, అరకొర కార్లు!!

అటుగా వచ్చిన ఒక ఆటో ఎక్కి ఆఫీస్‌కి బయల్దేరాడు. "ఏమయ్యా, ఇవాళ ఏమైంది? రోజూ ఈపాటికి రోడ్లు నిండిపోయుండేవి. ఇవాళ రోడ్లన్నీ ఇంత ఖాళీగా ఉన్నాయి! పైగా పాతకాలం రిక్షాలు కనిపిస్తున్నాయి. కార్లన్నీ మాయమైపోయాయి" అడిగాడు నరహరి.

"అవును సార్. పొద్దుగాల నుంచి నేనూ అదే పరేషాన్ అవుతున్నా! గిట్ల ఎందుకైందో సమజైతలేదు. కానీ గింత కాలీ రోడ్ల నడిపించుడు మస్తు

**ఆఫీసులో అలసిపోయాడు. పొద్దుపోయి ఇంటికి చేరుకుని కంచం ముందు కూర్చున్నాడు. అంతలో స్మార్ట్‌ఫోన్లో బాస్ మెసేజ్. చదివి జావగారిపోయాడతను. ఛ..ఇంట్లోనూ ఆఫీసుపనే అని తిట్టుకున్నాడు. మళ్ళీ పాతకాలం వస్తే బాగున్ను. యాంత్రీకరణవల్ల బంధాలు, సరదాలు, కబుర్లు అన్నీ పోయాయని బాధపడ్డాడు. అతడు కోరుకున్నట్టుగానే సమాజం మళ్ళీ పాతరోజుల్లోకి వెళ్ళిపోయిందా? అయితే అప్పుడేం జరిగింది?**

గున్నది సారు" అన్నాడు స్పీడు పెంచుతూ.

రోజూ ఆఫీసుకెళ్ళడానికి గంటపట్టేది. ఈ రోజు ఇరవైనిముషాల్లోనే చేరుకున్నాడు నరహరి. ఆఫీసులోకి అడుగుపెట్టేసరికి అక్కడ తన కొలీగ్స్ అందరూ గుంపుగాచేరి మాట్లాడుకోవడం కనిపించింది.

"హరి..గుడ్‌మార్నింగ్! చేతులూపుకుంటూ వస్తున్నారు. అంటే మీ ల్యాప్‌టాప్ కనిపించట్లేదా?" అడిగాడు పక్కసీట్లో సూరి. "అవును సూరీ, మీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగాడు నరహరి.

"ఓహో! ఇదంతా ఏదో మాయలాగా ఉంది. మనందరి ల్యాప్‌టాప్‌లు కనిపించట్లేదు. ఆఫీసు రికార్డులు అన్నీ టేబుల్ మీద ఫైల్స్‌లో ఉన్న కాగితాలలో పడున్నాయి. చూడబోతే మనం మళ్ళీ పాతరోజుల్లోకి వెళ్ళామా అనిపిస్తోంది" అన్నాడు సూరి.

"ఎస్, అవును నిజంగా అలానే ఉంది. నిన్న రాత్రి పడుకునే ముందు కాసేపు మన చిన్నప్పటి రోజులు ఎంత బాగుండేవని నేనూ మా ఆవిడా అనుకున్నాం. ఆశ్చర్యంగా పొద్దుట్నుంచీ ఇలా పరిస్థితులన్నీ పాతరోజుల్లా మారిపోయాయి" అన్నాడు నరహరి.

ముంబై నుంచి బాస్ ఫోన్ చేసి, వీడియో కాన్ఫరెన్స్ పనిచెయ్యకపోవడం వల్ల ఈ రోజు జరగవలసిన మీటింగ్ కాన్సిల్ చేసినట్టు చెప్పాడు. కంప్యూటర్లు లేకపోవడంతో తన టీమ్‌లో పని చేస్తున్న చాలామంది అనేక సందేహాలతో తన దగ్గరకి రావడం గమనించాడు నరహరి. ఇంతకాలం కంప్యూటర్‌వల్ల ఆ పని ఆటోమాటిక్‌గా జరిగిపోయేది. నీరజ నుంచి రోజు మొత్తంలో ఒక పదిసార్లైనా మెసేజ్‌లు వచ్చేవి. అలాంటిది ఆరోజంతా ఇంటి నుండి మెసేజ్‌లు కానీ, కాల్స్ కానీ లేవు నరహరికి. ఇంటికి రాగానే నరహరికి పిల్లలిద్దరూ కనపడలేదు. "అదేమిటి రోజూ ఈపాటికి ఇంట్లో టీవీ మోగుతూ ఉండేది. పిల్లలిద్దరూ ఆ కార్టూన్ ఛానల్‌తో బిజీగా ఉండేవారు. ఇవాళ ఏమయ్యారు?" అడిగాడు నీరజని.

"మర్చిపోయారా? ఒక్క దూరదర్శన్‌తప్ప టీవీలో వేరే ఏ ఛానల్సూ రావడం లేదు. అది కూడా మళ్ళీ రాత్రి ఏడు గంటలకి మొదలు. ఇక టీవీ లేకపోవడంతో వాళ్ళు చాలా రోజుల తర్వాత కిందికి ఆడుకోవడానికి వెళ్ళారు. రెండుగంటలుగా అక్కడే ఉన్నారు. ఒకరకంగా ఇదే హాయిగా ఉంది" అన్నది నీరజ.

"మంచిది, ఇంతకాలం వాళ్ళకి ఎంత నచ్చజెప్పినా ఒప్పించలేకపోయాం. ఏదో మొక్కుబడిగా వెళ్ళడం అరగంటలో ఎవరితోనో గొడవపడి వచ్చెయ్యడం. వీళ్ళకి ఆటలు తక్కువ. పోట్లాటలు ఎక్కువ. కుదురుగా రెండు గంటలపాటు ఆడుతున్నారంటే ఆశ్చర్యమే!" అన్నాడు నరహరి బట్టలు మార్చుకుంటూ.

"మరే. అంతా ఆశ్చర్యమే! లేకపోతే వాళ్ళు రెండుగంటల నుంచి ఆడుకోవడమేమిటి? మీరు వెలుతురు ఉండగానే ఇంటికి రావడమేమిటి? ఇవాళ నేను కూడా టీవీ లేకపోవడంతో ఏమీ తోచక లక్ష్మిగారింటికి వెళ్తే అక్కడ ఇంకో నలుగురు కొత్త వాళ్ళు పరిచయమయ్యారు. చాలారోజుల తరువాత ఇరుగు పొరుగుతో ఇంతసేపు గడిపాను. అప్పుడే రాత్రి వంట కూడా పూర్తి కావొస్తోంది. ఇలా ఎందుకు జరుగుతోందో తెలియదు కానీ ఇదేదో బాగున్నట్టే అనిపిస్తోంది" కాఫీ అందిస్తూ అన్నది నీరజ.

"నిజమే నీరూ. నువ్వన్నట్టు ఈ మార్పు బాగుంది. ఇవాళ ఇంత పెందరాడే ఇంటికి రావడం, ఇంటికి వచ్చాక ఆఫీసు గురించి చింత లేకపోవడం ఇలా మనం తీరిగ్గా మాట్లాడుకోవడం, అంతా వింతగా ఉంది. ఇందాక ఇంటికి వచ్చేటప్పుడు పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళాను. వస్తువులు పోయినట్లు కంప్లయింట్ ఇవ్వడానికి. అక్కడ సినిమా హాల్ ముందు ఉన్నంత క్యూ ఉంది. ఇక లాభం లేదని వచ్చేశాను" చాలా కాలం తరువాత తనకిష్టమైన

## చెలిమి

పరిమళాలను పసిగట్టి
పుష్ప వాటికకు పరుగెత్తిపోయి
సుకుమారమైన రేకులలో
ఇంత గాఢమైన పరిమళాలెలా?



అని ఇద్దరం ఒక్కలా అబ్బురపడ్డాం.
నీరెండ సాయంకాలాన
నీవి కొన్ని... నావి కొన్ని రంగులు కలుపుకొని
ఆకాశపు ఒంపులో
ఇంద్రధనుస్సుని చిత్రించి
వర్ణాల వానై కురిశాం
కారు మేఘమొకటి
ఉత్పాతమై ఉరిమినప్పుడు




ఇద్దరం ఒక్కసారే
యుద్ధానికి సిద్ధపడ్డాం.
ఉత్సవం వెనుకటి ఉదాసీనతను
కప్పుల్లో పోసుకు చప్పరిస్తూ
కొంత నమ్మకాన్ని రాజేసుకున్నాం.
రాలుతున్న పున్నాగపూల సాక్షిగా
స్నేహానికి కొత్త నిఘంటువు రాశాం.
అహం అంటుకున్న సంగతి
తెలిసీ విస్మరించామెందుకు?
పట్టుదల కొమ్మకి వేలాడుతూ
అలాయ్ బలాయ్ కాలేకపోతున్నాం.
ఒంటరి సమూహాలలోకి జ్ఞాపకమై
నువు తోసుకొచ్చినప్పుడు
నేను తీరం లేని నదినైపోయా
గెలుపోటముల గాడిలోపడి
గానుగెద్దుల్లా తిరుగుతున్నాం కాని
తలవంచడమే ఒక్కోసారి
గొప్ప విజయం కదా!

—శారద ఆవాల
సెల్: 92956 01447

నవల బుక్‌షెల్ఫ్‌లోంచి బయటకి తీస్తూ అన్నాడు నరహరి.

"ఇవాళ ఆటలో మజా వచ్చింది. ఇంతసేపు ఆడుకున్నా టైమ్ తెలియలేదు. పైగా నాన్నగారు అప్పుడే ఇంటికి రావడం కూడా బాగుంది. ఇవాళ రాత్రి అందరం కలిసి డిన్నర్ చేయాల్సిందే" అంది అనన్య.

"చాలా రోజుల తరువాత అందరం కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేశాం. ఇంత పెందరాళే పడుకోవడం కూడా వింతగా ఉంది" పడకగదిలోకి వస్తూ అన్నది నీరజ. "మరే, ఎనిమిదిన్నరకల్లా టీవీలో ప్రసారాలు సమాప్తమయ్యాయి. భోజనాలు పూర్తయ్యాయి. ఇక బోలెడు తీరిక.." నవ్వుతూ అన్నాడు నరహరి.

***

ఆ వారమంతా ఆఫీసులో పని భారం పెరిగిపోయింది నరహరికి. బయట ఏటీఎంలు మాయమవడంతో జనాలు డబ్బులకోసం బ్యాంక్‌కి రావడం మొదలెట్టారు. దానితో విపరీతమైన క్యూలు. వాళ్ళని సముదాయించే పనిలో క్షణం తీరిక లేకుండా గడిపాడు ఆఫీసులో. కానీ ఆరుగంటలకల్లా ఆఫీసు వదిలి ఇంటికి రావడం బాగుంది నరహరికి. వారాంతంలో కుటుంబంతో కలిసి గుడికి వెళ్ళడం, చాలా కాలం నుంచీ కుదరక వాయిదా వేస్తూ వస్తున్న స్నేహితుల్ని కలవడంలాంటి ఇష్టమైన పనులు ఎంతో ఆనందాన్ని ఇస్తున్నాయి. కానీ రోజులు గడిచేసరికి పరిస్థితులు మారసాగాయి. కంప్యూటర్‌తో ముడిపడి ఉన్న ఉద్యోగాలు ఒక్కొక్కటి ఊడసాగాయి. క్రమంగా నిరుద్యోగం పెరగసాగింది. ఉద్యోగాలు పోవడంతో వలస వెళ్ళినవాళ్ళు వెనక్కి రావడం మొదలు పెట్టారు. కంపెనీలలో ఉత్పాదన పడిపోయింది. వాతావరణంలో మార్పులు సరిగా గుర్తించలేక తగుచర్యలు తీసుకోకపోవడం వల్ల పంటనష్టం జరిగింది. ట్రాఫిక్ సిగ్నల్స్ నుంచి విమానాల దాకా సినిమాల నిర్మాణం నుంచి పెద్ద భవంతుల నిర్మాణం దాకా, ఇలా అన్నిటి మీదా ఈ ప్రభావం పడింది. మొత్తం వ్యవస్థ చిందర వందరై పాలకులకు పాలుపోని పరిస్థితి తెచ్చిపెట్టింది.

ఒకరోజు ఆఫీస్‌లో ఉండగా బాస్ నరహరితో ఫోన్లో మాట్లాడాడు, "మిష్టర్ నరహరి, ఈ మధ్య మన చుట్టూ జరుగుతున్న ఈ విపరీత పరిణామాలు మీకు తెలుసు. ఇప్పటికే మన బ్యాంక్‌కి విపరీతమైన నష్టాలు వచ్చాయి. ఈ నష్టాలు ఇప్పట్లో తీరేలా లేవు. ఈ అంతుపట్టని కారణంవల్ల కొత్తతరం గాడ్జెట్స్ అన్నీ మాయం కావడం మనందరికి శాపంలా మారింది. దీనికి పరిష్కారం ఎప్పుడు దొరుకుతుందో ఎవ్వరూ చెప్పలేకపోతున్నారు. కాబట్టి ఈ కష్టాలు ఎదుర్కోవడానికి మన కంపెనీ బోర్డుకు కనిపిస్తున్న ఏకైక మార్గం మన బ్రాంచీల సంఖ్య, ఉద్యోగుల సంఖ్య తగ్గించుకోవడమే. ఈ చర్యలో భాగంగా మూసెయ్యమని మన బోర్డు సిఫార్సు చేసిన బ్రాంచీలలో మీ బ్రాంచ్ కూడా ఉంది. దానితో పాటు అక్కడ పనిచేస్తున్న మీరు కూడా వేరే ఉద్యోగం వెతుక్కోక తప్పదు. రేపట్నుంచీ మీ సేవలు మాకు అక్కర్లేదని చెప్పడానికి చింతిస్తున్నాం. మీకు రావలసిన మొత్తం సాయంత్రానికల్లా మీ ఖాతాలో జమ అవుతుంది" అని చెప్పాడు.

"సార్, సార్ ప్లీజ్ సార్...అంత పని చెయ్యకండి. ఉన్నట్టుండి ఇలా ఉద్యోగం ఊడబీకితే మేమేం చెయ్యాలి? మా ఇంట్లో నలుగురి జీవితాలు ఈ జీతం మీదే ఆధారపడి నడుస్తున్నాయి" నరహరి ఎంత బ్రతిమిలాడినా ప్రయోజనం లేకపోయింది. నీరసంగా ఇంటికి వచ్చిన నరహరి జరిగిన విషయం ఎవ్వరికీ చెప్పలేదు. ఏదో భోజనం పూర్తయిందనిపించి పక్కమీదకి చేరాడు. "హే శ్రీహరి ఇలా చేశావేమయ్యా? పాతరోజుల్లాగా ఉంటే ఒత్తిడి తగ్గి హాయిగా బ్రతుకుదామనుకుంటే, మొత్తంగా నా ఉద్యోగమే ఊడబీకించావేమిటి స్వామీ? ఎక్కడున్నావ్ స్వామీ?" దీనంగా ప్రార్థిస్తున్నాడు నరహరి. "హరీ...నేనప్పుడే చెప్పానుకదా నీకు! ప్రకృతి తనధర్మం ప్రకారం ముందుకి వెళుతూ ఉంటుంది. ఆ క్రమంలో వచ్చినవే ఈ యంత్రాలు, వాటి ప్రయోజనాలు. కానీ మీరు పాటించని నియమం ఏమిటంటే దేనిని ఎంతవరకు వాడాలో అంత వరకూ వాడటం. అందుకే అతి సర్వత్ర వర్జయేత్ అన్న నియమం కూడా పెట్టాను. మీరు పాటిస్తున్నారా? నేను మీకిచ్చిన వనరులు మితంగా వాడుకుంటూ ఎప్పుడైతే మీ ధర్మం మరువకుండా మసలుకుంటారో అప్పుడే అన్ని రోజులూ ఆనందమయంగా ఉంటాయి. నువ్వు కోరినట్టు వర్తమానాన్ని గతంలోకి నెట్టే అవసరం లేదు. అది తెలుసుకుని మసలుకోండి.." నవ్వుతూ చెప్పి అంతర్థానమయ్యాడు శ్రీహరి. "మరిప్పుడు నా గతి ఏమిటి స్వామీ? శ్రీహరీ... శ్రీహరీ..." గట్టిగా అరుస్తున్నాడు నరహరి.

"ఏమండీ...ఏమిటీ అరుపులు, లేవండీ...ఈ శ్రీహరి ఎవరు? మీ బాస్ పేరు అదేదో సంజయ్ అన్నారు? ఏమైనా పీడకలా?" ఆందోళనగా నిద్ర లేపింది నీరజ. ఉలికిపడి లేచాడు నరహరి. ఎదురుగా భార్యా పిల్లలు. పక్కన బ్లాక్‌బెర్రీ ఉంది. హాల్లోకి పరిగెత్తాడు. ల్యాప్‌టాప్ అక్కడే ఉంది. "ఓహో! ఇదంతా కలా!! థాంక్‌గాడ్.."అనుకున్నాడు. "అసలే మిటా కల...ఆ పరుగులేమిటి?" మళ్ళీ అడిగింది నీరజ.

"అది కల కాదు, పెద్ద కథ. తీరిగ్గా సాయంత్రం చెబుతాగానీ ముందు కాఫీ కలుపు.." దేవుడి ఫోటో కేసి చూసి నవ్వుకుంటూ బాత్రూంలోకి నడిచాడు నరహరి. గత నాలుగేళ్ళుగా లేవగానే బ్లాక్‌బెర్రీ ముట్టుకోకుండా కాలుకిందపెట్టని తన భర్త అలా నేరుగా బాత్రూంలోకి వెళ్ళడాన్ని ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయింది నీరజ.

**సెల్: 890450 8655**

## అవకాశాల కోసం అది కూడా వేస్తుందట!

టాలీవుడ్‌లో స్టార్ హీరోయిన్...బిజీ హీరోయిన్...ఇవీ రకూల్‌కి ఉన్న బిరుదులు. తక్కువ కాలంలోనే ఎక్కువ పేరు తెచ్చుకున్న రకూల్‌కి బాలీవుడ్‌లో పెద్దగా కలిసి రాలేదు. దాంతో ఇప్పుడు బాలీవుడ్ మీద ప్రత్యేక దృష్టి పెట్టింది. అవసరమైతే బికినీ, లిప్‌లాక్‌లకి కూడా రెడీ అన్న సందేశాలను పంపిస్తోందట! టాలీవుడ్‌లో రకూల్‌కి ఉన్న డిమాండ్ చూసిన బాలీవుడ్ దర్శకనిర్మాతలు ఆమెను హిందీ సినిమాల్లోకి తీసుకురావడానికి ఇప్పటికే ప్రయత్నాలు మొదలుపెట్టారు. రకూల్ స్టేట్‌మెంట్‌తో ఆమె బాలీవుడ్ ఎంట్రీ ఖాయం అన్న మాటలు వినిపిస్తున్నాయి. ఇదే కనుక నిజమైతే ఇక తెలుగు తెర మీద రకూల్ కనిపించడం కష్టమే అంటున్నారు సినీ జనాలు. దక్షిణాదిన తన హవా నెమ్మదిగా తగ్గుతూ ఉండడంతో తన దృష్టిని బాలీవుడ్ వైపు పెట్టింది అంటున్నారు మరికొందరు.

# ఒకరికొకరు జతగా...

**దంపతులెవరైనా సరే ఎలాంటి అరమరికలు లేకుండా తమ అనుబంధం సంతోషంగా ముందుకు సాగిపోవాలని కోరుకోవడం సహజం. అందుకు ఆలుమగలు ఒకరినొకరు అర్థం చేసుకోవడం, సర్దుకుపోవడం తప్పనిసరి. మరి వీటితో పాటు దైనందిన జీవితంలో తమ సాహచర్యాన్ని పరస్పరం ఆనందకరంగా మార్చుకోవడం వల్ల దాంపత్య జీవితం మరింత దృఢమవుతుందంటున్నారు రిలేషన్‌షిప్ నిపుణులు.**

ఆలుమగల మధ్య చర్చకు వచ్చే కొన్ని విషయాలు, ఆయా సందర్భాల్లో వారు ప్రవర్తించే తీరు వారిమధ్య దూరం పెంచితే, మరికొన్ని సరదాలు పంచుతాయి. వారిని మరింత దగ్గర చేస్తాయి. అలాంటి వాటిని ఉద్దేశపూర్వకంగా పాటించడం ద్వారా ఆ జంట ఆనందంగా అన్యోన్యంగా ఉంటూనే తమ వివాహ బంధాన్ని పదికాలాలపాటు పటిష్ఠంగా కాపాడుకోవచ్చు.



## ప్రేమను తెలపండి

దాంపత్యబంధంలో ప్రేమ అనే పదం ఎంత విలువైందో ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే భార్యాభర్తలంటేనే ప్రేమ. ప్రేమంటేనే దాంపత్యం. ఇలా ఈ రెండు పదాలు పెనవేసుకుపోతేనే ఆ బంధం ఆనందాల పొదరిల్లు అవుతుంది. అలాగే ఒకరిపై ఒకరికి ప్రేముంటే దాన్ని దాచుకోవడం కాకుండా ఎప్పుడూ ఏదో ఒక రకంగా తెలియజేసుకుంటూనే ఉండాలి. అయితే కొంతమంది దంపతులు మాత్రం వారి మధ్య ఏదైనా చిన్న గొడవొచ్చినా, మనస్పర్థలొచ్చినా, 'పెళ్ళైన కొత్తలో నాపై చూపించిన ప్రేమ ఇప్పుడు అస్సలు చూపించట్లేదు, నేను ఏం మాట్లాడినాసరే భూతద్దంలో పెట్టి చూడడం ఏదో ఒక తప్పు ఎంచడం నీకు అలవాటైపోయింది' అంటూ ఇరువురి మధ్య మాటలు పెరుగుతాయి. అది వారి అనుబంధాన్ని ఎంతదూరమైనా తీసుకెళ్లొచ్చు. కాబట్టి ఎదుటివారి ప్రేమను ఆశించే ముందు వారిపై మీకెంత ప్రేముందో బయటపెట్టి చూడండి. ఇందుకు వారి పుట్టిన రోజుకు బహుమతులివ్వడం, రోజూ వారికి ఐలవ్యూ చెప్పడం, వారికి నచ్చినట్టు తయారవడం, ప్రశంసించడం లాంటివన్నీ చేస్తుంటే వారంతట వారే మీదారికొస్తారు. అలా పరస్పరం ప్రేమతో మెలిగినపుడు ఏ ఇతర కారణాలకైనా మిమ్మల్ని విడదీసే శక్తి వుంటుందా? మీరే చెప్పండి!

## దాపరికం వద్దు!

దాంపత్యబంధం కలకాలం దృఢంగా ఉండాలంటే దంపతులిద్దరూ ఒకరికొకరు స్నేహితులుగా ఉంటూ దాపరికాలు లేకుండా వారి మనసు లోతుల్లోని భావాలు పంచుకోవాలి. అప్పుడే వారి మధ్య అనుబంధం దృఢమవుతుంది. కానీ కొందరు దంపతులు ఒకరికి తెలియకుండా మరొకరు డబ్బులు ఖర్చు చేయడం, స్నేహితులతో కలిసి పార్టీలు చేసుకోవడం, వంటివి చేస్తూ ఉంటారు. 'ఇలా చేస్తున్నామని చెబితే భాగస్వామి ఒప్పుకుంటారో లేదో' లేదంటే 'వారికేంటి చెప్పేది' అన్న ధోరణిలో ఆలోచిస్తూ ఎవరికి నచ్చింది వారు చేసుకుంటూ పోతుంటారు. ఫలితంగా ఏదో ఒక సందర్భంలో వీటి కారణంగా ఇద్దరి మధ్య వాగ్వాదం తలెత్తుతుంది. కాబట్టి దంపతుల మధ్య భవిష్యత్తులో మనస్పర్థలు రాకుండా ఉండాలంటే ఎలాంటి దాపరికాలు లేకుండా ముందుగానే అన్ని విషయాలు ఒకరితో ఒకరు పంచుకుంటూ ముందుకు సాగడం ఉత్తమం. ఇలా భార్యాభర్తలు అన్యోన్యంగా మెలుగుతూ తమ సాహచర్యం కొనసాగిస్తే ఇక వారి అనుబంధాన్ని ఎలాంటి కారణాలు విడదీయలేవు.

అదేవిధంగా దాపత్యబంధం మధ్య అబద్ధాలు చొరబడ

## అండదండలు

భార్యాభర్తల బంధం అంటే ఎప్పుడూ సంతోషంగా హాయిగా సాగిపోవాలనేం లేదు. అప్పుడప్పుడూ కొన్ని ఒడిదుడుకులు ఎదురవడం కూడా సహజం. అది ఇద్దరిలో ఏ ఒక్కరి వల్లైనా కావచ్చు. అయితే ఆ సమయంలో అది నేను చేసిన తప్పుకాదు, ఆ సమస్యతో నాకెలాంటి సంబంధం లేదు' అని పూర్తిగా ఒకరిపైనే నెట్టివేయడం సరైన పద్ధతికాదు. ఒకవేళ ఆ తప్పిదం మీవల్ల జరగనప్పటికీ మీరూ అందులో సగం బాధ్యత వహించాలి. భాగస్వామితో కలిసి సమస్యను పరిష్కరించే దిశగా ఆలోచించాలి. అప్పుడే వారికి మీరెంత అండగా నిలుస్తున్నారు, వారికి మీరిచ్చే విలువేంటో అర్థమవుతుంది. అలాగే భాగస్వామి జీవితంలో మీ విలువ గురించి కూడా తెలుసుకోగలుగుతారు. కాబట్టి ఆలుమగలు సుఖాలను మాత్రమే కాదు కష్టనష్టాలను కూడా సగంసగం కలిసే పంచుకోవాలి. అప్పుడే ఆ దాంపత్యం పదికాలాలు పచ్చగా ఉంటుందనడంలో ఎలాంటి సందేహం లేదు.



కూడదు. అన్యోన్యంగా ఉండే బంధాల్లో కలతలు రేపేవి అబద్ధాలే. చాలామంది చిన్న చిన్న విషయాల్లో కూడా భాగస్వామికి అబద్ధాలు చెబుతూ ఉంటారు. ఇలా భాగస్వామికి సరదాగా ఓ చిన్న అబద్ధం చెప్పారనుకోండి. అది నిజం కాదని తేలినప్పుడు ఇద్దరి మధ్యా దూరం పెరిగిపోతుంది. కాబట్టి సరదాగా అయినా సీరియస్‌గానైనా దంపతుల మధ్య అబద్ధాలు ఎంత తక్కువగా ఉంటే అంతమంచిది. ఎంత నిజాయితీ ఉంటే బంధం అంత దృఢంగా మారుతుంది. లేదంటే ఇబ్బందులు ఎదుర్కోవాల్సి రావచ్చు.

## పరస్పర అంగీకారం

దాంపత్యం అంటే కేవలం ఇద్దరి మనసులు కలవడం మాత్రమే కాదు. ఒకరి అభిరుచులు ఇష్టాయిష్టాలు, ఆలోచనలు, అభిప్రాయాలు వంటివన్నీ మరొకరు అంగీకరించగలగాలి. అయితే కొందరు దంపతులు పెళ్లైన కొత్తలో నువ్వు ఏది చేస్తే అదే రైటు అన్నట్లుగా వారిపై తెగ ప్రేమ ప్రదర్శిస్తుంటారు. కానీ అది రాన్రాను నువ్వు నీకు నచ్చినట్లుగానే చేస్తావా, నా అభిప్రాయం అవసరం లేదా? అని ఎదుటివారితో వాదనకు దిగే ధోరణిలోకి మారే అవకాశాలు లేకపోలేదు. దంపతులన్నంత మాత్రాన ఇద్దరి ఇష్టాయిష్టాలు, అభిప్రాయాలు ఒకేరకంగా ఉండాలని రూలేం లేదు కదా! అలాగని వారికి నచ్చినట్లు ఉండమని ఒత్తిడి తీసుకురావడం కూడా సమంజసం కాదు. కాబట్టి ఒకరి అభిప్రాయాల్ని మరొకరు గౌరవిస్తూ వాటిలో ఏమైనా తప్పొప్పులు ఉంటే సరిదిద్దుకుంటూ ముందుకెళ్లాలే తప్ప వాటికోసం చీటికీ మాటికీ పేచీకి దిగకూడదు. అప్పుడే వారి అనుబంధం కలతలు లేకుండా హాయిగా ముందుకు సాగుతుంది.

## సానుకూల దృక్పథం

సానుకూల దృక్పథంతో ఆలుమగల అనుబంధం మరింత దృఢంగా ముందుకు సాగాలంటే అన్ని విషయాల్నీ పాజిటివ్‌గా ఆలోచించే మనస్తత్వం ఇద్దరికీ అలవడడం ఎంతో ముఖ్యం. అయితే కొన్ని సందర్భాల్లో ఓపిక నశించి 'అబ్బ ఈ వ్యక్తితో నేను వేగలేకపోతున్నాను' ఈ బంధాన్ని ఇలాగే కొనసాగించడం కంటే ఇద్దరూ విడిపోయి హాయిగా బతకడం మేలు అనే ఆలోచన చాలా మందికి వస్తుంది. ఈ క్షణకాలపు ఆలోచనతో విడిపోవడం కంటే మరొక్క క్షణం ముందుకు వెళ్లి భాగస్వామితో ఉన్న సమస్య గురించి వారితోనే మాట్లాడి పాజిటివ్ ఆలోచనలతో ముందుకు సాగితే అప్పుడు మీకే అర్థమవుతుంది. అంత చిన్న విషయానికి అప్పుడు నేనెంత పెద్ద నిర్ణయం తీసుకున్నాను. నన్ను ప్రాణానికి ప్రాణంగా ప్రేమించే నా భాగస్వామి నుంచే విడిపోవాలని అనుకున్నా ఇంకెప్పుడూ ఇలాంటి తొందరపాటు ఆలోచనలు చేయకూడదు. అనిపిస్తుంటుంది. కాబట్టి క్షణిక ఆవేశం పక్కనపెట్టి అన్ని విషయాల్ని పాజిటివ్‌గా తీసుకుంటూ ముందుకెళ్తే దంపతుల మధ్య ఎలాంటి అరమరికలు, గొడవలు రానే రావు. ఇవే కాదు నమ్మకం, క్షమాగుణం, ఒకరికొకరు సమయం కేటాయించుకోవడం వంటివన్నీ దంపతుల మధ్య పెంపొందితే అసలు వారికి విడిపోదామనే ఆలోచనే రాదు. ఏమంటారు?

## చులకన తగదు

భార్యాభర్తలిద్దరూ ఒకరినొకరు చులకనచేసి మాట్లాడుకోవడం మంచిదికాదు. అది కేవలం నలుగురిలో ఉన్నప్పుడు మాత్రమే కాదు, ఏకాంతంలో ఉన్నప్పుడు కూడా ఇద్దరికీ వర్తిస్తుంది. కొంతమంది తమ భాగస్వామి గురించి నలు



గురిలో చెడుగా చెప్పడం, వాళ్లమీద జోక్స్ చేయడం చేస్తుంటారు. మీరు అలా చెడుగాచెప్పిన వాళ్లలో ఎవరైనా మీరు మాట్లాడిన తీరును మీ భాగస్వామితో పంచుకుంటే వాళ్లు చాలా బాధపడతారు. ఇలా చేయడంవల్ల మీపై ఉండే గౌరవం, ప్రేమ కూడా క్రమంగా తగ్గిపోయే అవకాశం ఉంటుంది. అందుకే ఇలాంటి అనవసరమైన పనులతో సమయం వృథా చేసుకోకపోవడం మంచిది.

## నిస్వార్థంగా

స్వార్థం, అపనమ్మకం రెండూ ఎంతటి అన్యోన్య దాంపత్యాన్నైనా సరే కూల్చేస్తాయి. కొంతమంది తమ భాగస్వామి మనోభావాల గురించి ఆలోచించకుండా కేవలం తమ దృష్టితో ఆలోచించి స్వార్థంతో నిర్ణయాలు తీసుకుంటారు. తమకు ఏది ప్రయోజనం కలిగిస్తుందో దాన్నే పాటిస్తారు. ఇది దీర్ఘకాలంలో ఇబ్బందులు తెచ్చిపెడుతుంది. మరి కొంతమంది తమ భాగస్వామి మీద లేనిపోని అపనమ్మకం పెంచుకుంటారు. వారిని అనుమానిస్తూ ప్రతి కదలికనూ పరిశీలిస్తుంటారు. ఇది వారికి తెలియనంతకాలం పర్వాలేదు. ఇది వారికి తెలిస్తే వారి మనోభావాలు దెబ్బతింటాయి. ఇలాంటి వాటివల్ల ఇద్దరి మధ్యా అన్యోన్యత పూర్తిగా నశిస్తుంది.

## సమస్యలుంటే

భాగస్వామికి సమస్యలుంటే పరిష్కారం వెతకడంలో వారికి మీరు సహాయపడాలి. ఫలితంగా వారికి ఒత్తిడి తగ్గడమే కాదు మానసికంగా మీకు మరింత దగ్గరయ్యే అవకాశాలుంటాయి. అలాగే భవిష్యత్తులో మీకు ఎలాంటి సమస్యలు వచ్చినా వారితో పంచుకోండి.

వారు కూడా తగిన పరిష్కారం సూచించడంతో పాటు వీలైనంత సహాయం అందిస్తారు. ఎలాంటి దాపరికాల్లేకుండా పరస్పరం సహకరించుకుంటూ సమస్యలు పరిష్కరించుకుంటూ ముందుకెళితే ఇక ఆ జంట మధ్య అరమరికలు అన్న మాటే తొంగిచూడదు.

## దాంపత్యంలో పిచ్చాపాటీ

ప్రస్తుతం సమాజంలో జరుగుతున్న అంశాలు, రాజకీయాలు, నచ్చిన వ్యక్తి సినిమా ఇలా ఏదో ఒక అంశం మీద దంపతులిద్దరూ పిచ్చాపాటీ మాట్లాడుకోండి. దీని వల్ల మీ ఆలోచనలు, అభిప్రాయాలు భాగస్వామికి తెలియడంతో పాటు ఇద్దరూ ఒకరికి తెలియని విషయాలు మరొకరు తెలుసుకోవచ్చు. ఫలితంగా జ్ఞానం పెంపొందుతుంది. కేవలం బయటి అంశాలే కాకుండా వాటితో పాటు కాస్త రొమాంటిక్ విషయాలు కూడా మాట్లాడుకోవడం మరవకండి. ఎందుకంటే దాంపత్య బంధాన్ని పెనవేయడంలో దాని పాత్ర ఎంతో కీలకం.

## అభిప్రాయాలు తెలుసుకోండి

ఏదైనా ఒక పని ప్రారంభించేటప్పుడు దానికి సంబంధించి మీ భాగస్వామి అభిప్రాయం తీసుకోవడం మరచిపోకూడదు. ఇలా భార్యాభర్తలిద్దరూ పరస్పరం ఒకరి అభిప్రాయాలు మరొకరు తెలుసుకుంటూ వాటిని గౌరవించుకోవడం తప్పొప్పులు సరిదిద్దుకోవడం వంటివాటివల్ల ఆ కాపురం పదికాలాలు పచ్చగా ఉంటుంది.

అదేవిధంగా విషయం చిన్నదైనా పెద్దదైనా భాగస్వామితో పంచుకోవాలనిపిస్తే వెంటనే షేర్ చేసుకోండి. ఫలితంగా ముందు ముందు మీ మధ్య ఎలాంటి గొడవలు తలెత్తకుండా జాగ్రత్త పడొచ్చు.

- రామకృష్ణశర్మ



7

# లాకర్ నెం. 369



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

**నా చిన్నప్పటి నుండీ బ్యాంకులో ఉద్యోగం చేయాలన్నది నా కల. చిన్నప్పుడు మా నాన్నతో బ్యాంకుకు వెళ్ళినప్పుడు, కౌంటర్ ఇవతలి నుండి చూసినప్పుడు చకచకా పనిచేసే ఉద్యోగులు కనిపించడం, స్త్రీలు, పురుషులు సరదాగా మాట్లాడుకుంటూ పనిచేయడం, వేలకొలది రూపాయలను క్షణాల్లో పంచేయడం చూసి మైమరచి పోయేవాణ్ణి. వాళ్ళ నీట్ డ్రెస్సులు, అలసట ఎరుగని ముఖాలు, బ్యాంకు హాల్లో కనిపించే వాతావరణం చూసి ఎప్పటికైనా బ్యాంకులోనే ఉద్యోగం చేయాలనుకునే వాణ్ణి.**

వీటికి తోడు, నాకు తెలిసిన చాలామంది బ్యాంకు ఉద్యోగులకు అప్పట్లో స్కూటర్లు ఉండేవి. అప్పుడు, నా జీవితాశయం స్కూటర్ సొంతంగా నడపడమే.

అందుకే లా అయ్యాక, ఎన్నో గ్రూప్స్, సివిల్స్ పరీక్షలకు అవకాశాలున్నా బ్యాంక్ పీవోస్ పరీక్షకే మొగ్గు చూపాను. బ్యాంకు ఉద్యోగానికి ఎంపిక అవ్వడం నల్లేరు మీద నడకేమీ కాదు. లక్షల మందితో పోటీపడి ప్రొబేషనరీ ఆఫీసర్‌గా బ్యాంకు ఉద్యోగం సంపాదించాను. బోలెడు జీతం వచ్చేది.

కానీ, కౌంటర్ ఇవతలి నుండి కనిపించే ఆకర్షణీయమైన దృశ్యానికీ, కౌంటర్ లోపలి దృశ్యానికీ హస్తిమశకాంతరమైన తేడా ఉంది. నా కలలన్నీ అంత తొందరగా ఛిద్రమవుతాయని నేను కలలో కూడా ఊహించలేదు. కౌంటర్ లోపలి దృశ్యం నన్ను బాగా డిసప్పాయింట్ చేసింది. ఒక్క జీతం తప్ప మరేదీ ఆకర్షణీయంగా లేదనిపించేది.

బ్యాంకుల్లో పాతుకుపోయిన యూనియన్లు నా జీవితంతో ఒక ఆటాడుకున్నాయి.

బ్యాంకింగ్ చరిత్రలోనే కనీవినీ ఎరుగని రెండు విషాద సంఘటనలు, విషాద సంఘటనలు అనే కంటే రెండు నీచాతి నీచ సంఘటనలు నా బ్యాంకు ఉద్యోగ కాలంలో జరిగాయి.

బ్యాంకుల్లో ఉద్యోగుల సంక్షేమం కోసం ఏర్పడిన ఉద్యోగ సంఘాల మధ్య ఎంత నీచ, నికృష్ట, పాపిష్టి పోటీ ఉందో ఈ సంఘటనల ద్వారా నాకు అర్థమైంది. ఈ రెండు సంఘటనల్లో నేనే బాధితుణ్ణి కాబట్టి ఈ సంఘటనల పూర్వాపరాలు, ప్రతీ సూక్ష్మ వివరమూ నాకు తెలుసు. అప్పుడే నా మనసు విరిగి పోయింది. ఇటువంటి క్రిమినల్ వ్యక్తులు, ముఖానికి నాగరికత పులుముకుని అత్యంత సంస్కారవంతమైన వ్యక్తులుగా చలామణి అయ్యే పాపిష్టి మనుషుల అసలు రంగు చూసే, ముఖానికున్న ముసుగు తొలగించి వారి వికృత రూపాన్ని చూసే దౌర్భాగ్యం నాకు కలిగింది.

బ్యాంకింగ్ రంగంలో కొన్నాళ్ళ క్రితం వరకు, నేను బ్యాంకులో పని చేసిన సమయంలో, CAIIB అనే క్వాలిఫికేషన్ సాధించడం అంటే చాలా గొప్ప విషయం. 'సర్టిఫైడ్ అసోసియేట్ ఆఫ్ ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ బ్యాంకర్స్' అనే ఈ అర్హత సాధించాలంటే, "ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ బ్యాంకర్స్" వారు నిర్వహించే పార్ట్ 1, పార్ట్ 2 అనే రెండు పరీక్షలు పాస్ కావాల్సి ఉంటుంది.

మిగిలిన అకడమిక్ పరీక్షల్లో మాదిరిగా కాకుండా పార్ట్ 1లో ఉండే ఐదు సబ్జెక్టులు, పార్ట్ 2లో ఉండే ఆరు సబ్జెక్టులలో ఒక్కొక్కటిగా పాసవుతూ ఓ ఐదారేళ్ళలో ఈ రెండు పార్టులు పూర్తి చేసుకోవచ్చు.

పార్ట్ 1 పాసయితే ఒక ఇంక్రిమెంట్, పార్ట్ 2 పాసయితే రెండు ఇంక్రిమెంట్లు ఇచ్చేవారు.

ఈ పార్ట్ 1 మరియు పార్ట్ 2 పరీక్షలను ఒకే అటెంప్ట్‌లో అంటే పార్ట్ 1 ఒక అటెంప్ట్‌లో, పార్ట్ 2

### జరిగిన కథ

ఇంటర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో మిడిల్ మేనేజ్‌మెంట్ స్థాయి అధికారి అతను. మాకనూరులో జరిగిన బ్యాంకు దోపిడీ కేసును ఛేదించి, నేరస్థులను రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకుంటాడు. ఈ సందర్భంగా హైదరాబాద్ జోనల్ ఆఫీసులో పార్టీ అరేంజ్ చేస్తారు. అక్కడ సాక్షిరెడ్డి అతణ్ణి ఆకర్షిస్తుంది. ఆ తరువాత పార్క్‌హయత్‌లో ఏర్పాటుచేసిన పార్టీలో రామస్వామిని చూసి అతను స్పృహతప్పి పడిపోతాడు. **ఆ తర్వాత...**



ఆ తరువాతి అటెంప్ట్‌లో పాసయిన వారి సంఖ్య వేళ్ళ మీద లెక్కపెట్టవచ్చు. అలాగే, ఈ రెండు పరీక్షలు మొదటి ప్రయత్నంలోనే పాసయిన వాళ్ళయితే కలికంలోకి కూడా కనపడరు.

రేరెస్ట్ ఆఫ్ రేర్ ఫీట్ అది.

నేను బ్యాంకులో చేరిన తర్వాత పరీక్ష రాయడానికి అర్హత రాగానే పార్ట్ 1 పరీక్షకు అప్లై చేశాను.

నేను ఏదైనా పట్టు పడితే దాని అంతు చూడకుండా వదలను. చిన్నప్పటి నుండి నేను ఏకసంథాగ్రాహిని.

ఈ పరీక్షకు హాజరయ్యే బ్యాంకు ఉద్యోగుల కోసం, ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ బ్యాంకర్స్ (IIB) వారు ప్రతీ ఆదివారం ఉచిత క్లాసులు నిర్వహిస్తుండే వారు. కోఠీలోని SBI లో ఈ క్లాసులు జరిగేవి. అన్ని బ్యాంకుల ఉద్యోగులు, ఆఫీసర్లు అక్కడ కలుసుకునే వారు. నాకు చాలామంది మిత్రులయ్యారు. కానీ, నాకు అక్కడ చెప్పే క్లాసులు నచ్చలేదు. దానికన్నా ఇంట్లో కూర్చుని చదువుకోవడమే ఉత్తమమనిపించింది.

మూడు నెలల తరువాత పరీక్షలు ప్రారంభమయ్యాయి. ప్రతీ ఆదివారం రెండు సబ్జెక్టులలో పరీక్ష ఉంటుంది. నేను బాగానే రాశాను.

కానీ, రిజల్ట్స్ వచ్చాక నా సంతోషానికి అవధులు లేకుండా పోయింది. నేను CAIIB పరీక్ష రాసిన మొదటి ప్రయత్నంలోనే పార్ట్ 1లోని అన్ని సబ్జెక్టుల్లో 75 శాతం మార్కులతో డిస్టింక్షన్‌లో పాసయ్యాను.

అది అప్పట్లో బ్యాంకింగ్ వర్గాల్లో చిన్నపాటి సంచలనమే అయ్యింది. మా జోనల్ ఆఫీసులో అయితే అందరూ నన్ను అభినందించారు. పార్టీ కావాలంటే వెంటనే పుల్లారెడ్డి నుండి స్వీట్ ఖారా తెప్పించాను.

IIB వాళ్ళు పిలిచి నన్ను సన్మానించారు.

అప్పటి వరకు నన్ను ఎవ్వరూ సీరియస్‌గా తీసుకోలేదు. కానీ, ఆ రోజు నుంచి నన్ను ప్రత్యేకంగా చూడసాగారు.

అన్ని బ్యాంకుల్లో మాదిరిగానే మా బ్యాంకులో కూడా ఉద్యోగస్థులకు, అంటే అవార్డు స్టాఫ్ మెంబర్స్‌కు రెండు మూడు యూనియన్లు; ఆఫీసర్లకు రెండు మూడు యూనియన్లు ఉన్నాయి.

నేను నాకు నచ్చిన ఒక యూనియన్‌లో సభ్యుడిగా చేరాను.

అంతే, అప్పటి నుండి నాకు అలవి కాని, అర్థం పర్థం లేని సమస్యలు మొదలయ్యాయి.

నేను పనిచేసే మా జోనల్ కార్యాలయంలో జోనల్ మేనేజర్, ఆఫీస్ మేనేజర్‌లు మాత్రం ఏ యూనియన్‌లోనూ సభ్యులుగా ఉండేవారు కాదు. యూనియన్ మెంబర్‌షిప్‌కు అతీతులు వాళ్ళు. అఫీషియల్‌గా ఏ యూనియన్‌లోనూ ఉండకపోయినా, వాళ్ళు అంతకు ముందు వరకూ ఏదో ఒక యూనియన్‌లో ఉండి ప్రమోషన్ మీద ఈ



స్థాయికి వచ్చినవాళ్ళే కాబట్టి, ఫలానా యూని యన్ అంటే అభిమానం ఉంటుంది. ఏదో విధంగా ఆ అఫిలియేషన్ బయటపడుతూనే ఉంటుంది.

నేను పరీక్ష పాసైన రోజున అందరూ నన్ను అభినందించినా, తర్వాత నేను ఒక యూనియన్‌లో సభ్యుడిగా చేరిన తర్వాత అవతలి యూనియన్ వాళ్ళకు శత్రువుగా మారిపోయాను. పైకి నవ్వు తూనే మాట్లాడుతున్నా వాళ్ళ ఆగ్రహానికి నేను గురికాక తప్పలేదు.

ఏదో చిన్న విషయానికి మేనేజర్ పిలిచి చీవాట్లు పెట్టేవాడు. జోనల్ మేనేజర్ ముందు నాకు సంబంధం లేని, నేను చేయని తప్పుకు నన్ను దోషిగా నిలబెట్టేవారు.

సాధారణంగా అయితే, నేను వెంటనే మా యూనియన్ వాళ్ళను రంగంలోకి దించి రభస సృష్టించాలి.

అయితే, ఇదంతా నాకు సిల్లీగా అనిపించేది. యూనియన్ జోక్యం లేకుండానే పని చేసుకునే వాణ్ణి. డైలీ రొటీన్ పని విషయంలో యూనియన్ జోక్యం ఉండకూడదని నా అభిప్రాయం. నేను అవ కాశం ఇవ్వకపోవడంతో మా యూనియన్ వాళ్ళు కూడా నా మీద కోపంగానే, ఉండేవారు. ఎప్పు డైనా, పరిస్థితి శ్రుతి మించితే, మా యూనియన్ వాళ్ళు నా గురించి పోట్లాడేవాళ్ళు.

నాకు నిజంగా ఆశ్చర్యమేసేది. ఇంత గొప్ప చదువులు చదువుకుని, ఇంత జీతాలు తీసు కుంటూ, ఇంత బాధ్యతాయుతమైన పదవుల్లో ఉన్న బ్యాంకు అధికారులు ఇంత చీప్‌గా బిహేవ్ చేస్తారా అని విస్తుపోయేవాణ్ణి.

ఎంతో మంది విశ్వాసంతో మమ్మల్ని నమ్ము తుంటే, మేము ఇలా కొట్లాడుకోవడం నాకు భావ్యంగా తోచేది కాదు. ఆ మాటే అంటే నన్ను పిచ్చివాడిగా జమకట్టే వాళ్ళు.

ప్రతీ బ్యాంకులో సహజంగానే ఒక్కో ఆఫీసర్ యూనియన్‌కు ఒక్కో ఉద్యోగుల సంఘం అనుబం ధంగా పనిచేసేది. మా బ్యాంకులో మెజారిటీ ఆఫీ సర్స్ యూనియన్‌కు అనుబంధంగా పనిచేసే ఎంప్లాయీస్ యూనియన్ మైనారిటీలో ఉండేది. నేను మైనారిటీ ఆఫీసర్స్ యూనియన్‌కు చెందిన వాణ్ణి కాబట్టి, మరో ఎంప్లాయీస్ యూనియన్‌కు చెందిన ఉద్యోగులు నన్ను శత్రువుగా చూసేవాళ్ళు.

బ్యాంకుల్లో అవార్డు స్టాఫ్ అంత స్వేచ్ఛా జీవులు మరొకరుండరు. వాళ్ళు టైం ప్రకారం పని చేస్తారు. ఒక్క నిమిషం ఆలస్యమైనా క్యాష్ తీసు కోమని చెప్పి కస్టమర్లను తిప్పి పంపిస్తారు. బ్యాంక్ మేనేజరే 'అయ్యా! అప్పా!' అని బ్రతిమి లాడి పనులు చేయించుకుంటారు. ఇంక సబ్‌స్టాఫ్ అంటే అటెండర్లు మొదలైన వాళ్ళు మహారాజులు. వాళ్ళకున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అపరిమితం.

నా పట్ల సబ్‌స్టాఫ్ ఘోరంగా ప్రవర్తించే వారు. ఒక ఫైల్ తెమ్మంటే ఇంకొక ఫైల్ తెచ్చేవారు. కోపగిస్తే, 'ఏం సార్! మేమేమీ మీలాగా చదువు కున్నోళ్ళం, ఆఫీసర్లం కాదు. నాకు తెలిసింది తెస్తా! నచ్చకపోతే మీరే వెళ్ళి తెచ్చుకోండి!' అనేవాళ్ళు. మంచినీళ్ళు అడిగినా ఇచ్చేవారు కాదు. 'అది మా డ్యూటీ కాదు' అనేవారు.

**నిద్రాహారాలు మాని పరీక్షకోసం బాగా ప్రిపేరయ్యాడతను. పరీక్షకు హాజరయ్యాడు. పరీక్షాహాల్లోకి ప్రవేశించేముందే అతణ్ణి క్షుణ్ణంగా చెక్‌చేశారు. మొదట ఆశ్చర్యపోయినా, ఇదంతా మామూలే కదా అనుకుని తన సీట్లోకి వెళ్ళి కూర్చున్నాడు. పరీక్ష రాయడం మొదలెట్టాడు. ఇంతలో ఒక పోలీసు వచ్చి అతని కాలర్ పట్టుకుని చీఫ్ ఎగ్జామినర్ గదిలోకి తీసుకెళ్ళాడు. అసలేం జరిగింది? అతణ్ణి ఎందుకు బయటకు తీసుకెళ్ళారు?**

నేను నిర్ఘాంతపోయాను.

ఇంకో యూనియన్ వాళ్ళకు మాత్రం రాజభో గాలు జరుగుతుండేవి.

లక్షలమంది రాసే కాంపిటీటివ్ పరీక్షల్లో అత్యు త్తమ ప్రతిభను కనపరిచి, ఉత్తీర్ణులమై వచ్చిన నాలాంటి యువ బ్యాంక్ ఆఫీసర్లను, బ్యాంకుల్లో ఎదు రయ్యే ఈ విషమ పరిస్థితులు, నిరుత్సాహ పరిచేవి.

చదువుల్లో అపరిమితమైన తెలివితేటలున్నా ఇట్లాంటి నిజజీవితంలో ఎదురయ్యే చిక్కులను ఎదుర్కొనే లౌక్యం నాకు లేదు. అందుకే, ప్రతీది వింతగా తోచేది. ఎవరితో ఏం మాట్లాడాలో తెలి యక గందరగోళంలో పడేవాడిని. మనసంతా ఆందోళనగా ఉండేది. కొన్ని రోజుల వరకు అసలు నాకేమీ అర్థం కాకపోయేది. నిజంగానే నేనే ఏదో పెద్ద తప్పు చేశానేమోనని అనుకునే వాణ్ణి. మానసి కంగా దుర్బలుడుగా మారిపోసాగాను. కానీ, ఇదంతా నేను ఒక యూనియన్‌లో సభ్యుడిగా చేరడం వలన మిగిలిన యూనియన్‌లు కల్పించే చికాకులని తరువాత్తరువాత నాకర్థమైంది.

నాకు బ్యాంక్ ఉద్యోగం సూటబుల్ కాదనిపిం చింది. నేను ఏరి కోరి ఈ ఉద్యోగాన్నే ఎంచుకున్నం దుకు నాలో పశ్చాత్తాపం మొదలైంది. ఉద్యోగం మారాలనే కోరిక చిన్నగా మొదలైంది. కాంపిటీటివ్ పరీక్షల షెడ్యూల్ చూడసాగాను.

ఇంతలో, మా జోనల్ ఆఫీసుకు 'రాయపూర్ నుండి రాగిణి అనే స్టెనో ఆఫీసర్ ట్రాన్స్‌ఫర్ అయి వచ్చింది. చాలా స్లిమ్‌గా ఉన్న ఆమె ముఖంలో అంతులేని ఆత్మవిశ్వాసం గోచరించేది. అందంగా, ధీమాగా, హుందాగా ఆఫీసుకు వచ్చేది. హైదరా బాద్‌లో సెటిలైన తెలుగమ్మాయి అని తెలిసే సరికి నాలో ఇంట్రెస్ట్ పెరిగింది. నేను కూడా ప్రొబేషనరీ ఆఫీసర్‌నే కాబట్టి నాతో కొంచెం మాట్లాడేది. CAIIB పార్ట్ 1 మొదటి అటెంప్ట్‌లోనే అన్ని సబ్జెక్టుల్లో పాస య్యానని తెలిసి కొంచెం కన్‌సర్న్ చూపించేది.

నేను కాలేజీలో చదువుమీద తప్ప మరో విషయం మీద కాన్సన్‌ట్రేట్ చేయలేదు. చదువును పరమ పవిత్ర యజ్ఞంలా భావించి పూర్తి చేశాను. అందుకే అమ్మాయిల గురించి నాకు అస్సలు తెలియదు.

కానీ, బ్యాంకు ఉద్యోగంలో చేరాక అందమైన అమ్మాయిలను చూస్తుంటే మనసులో అందమైన చిలిపి ఊహలు కలిగేవి. వయసు పోరు మొద లైంది. శరీరం కొత్త కోర్కెలతో వేడెక్కిపోయేది.

ఈ తరుణంలో, రాగిణి రాకతో నా మనసులో వసంతాలు వెల్లివిరిశాయి.

బ్యాంకులో వాతావరణానికి అలవాటు పడసా గాను. నేను కూడా కొంచెం లౌక్యం నేర్చుకున్నాను. నా అవసరాలు పూర్తికాకపోతే ఫైళ్ళు పెండింగులో పెట్టసాగాను. అది మేనేజిమెంట్ దృష్టికి రావ డంతో కొన్ని మంచి మార్పులు జరిగాయి.

రాగిణితో పరిచయం మాత్రం నత్తనడకన కొన సాగుతోంది. ఆమె చాలా మూడీ. ఎప్పుడూ జోనల్ మేనేజర్ పనులతో బిజీగా ఉండేది. దాంతో ఆ దిశలో ఎటువంటి ప్రగతీ లేదు. రోజులు గడుస్తున్నాయి.

ఇంతలో CAIIB పార్ట్ 2 పరీక్షలు దగ్గర పడ్డాయి. నేను మొదటి పార్టును దిగ్విజయంగా పూర్తి చేయడం నాకు ద్విగుణీకృతమైన ఉత్సాహా న్నిచ్చింది. ఈ సారి ఎలాగైనా పార్ట్ 2 లో కూడా అదే ఫీట్, అదే విజయం నమోదు చేయాలనే కృత నిశ్చయంతో ఒక నెల రోజులు సెలవు పెట్టాను. లీవ్ శాంక్షన్ చేయకుండా ఏదో సాంకేతిక కారణం చూపారు. నేను మెడికల్ లీవు పడేసి ప్రిపరేషన్ మొదలుపెట్టాను.

నేను లీవు పెట్టడానికి మరో ముఖ్య కారణం, రాగిణి. నేను ఆమె పట్ల ఆకర్షితుణ్ణయ్యే ప్రమాద కర స్థితిలో ఉన్నాను. నేను విజయం సాధించా



లంటే అన్నిరకాల ప్రలోభాలకు దూరంగా ఉండాలి. అందుకే లీవు పెట్టాను.

నిద్రాహారాలు మాని బాగా ప్రిపేరయ్యాను.

మొదటి రోజు పరీక్ష రాయడానికి సంసిద్ధుణ్ణయ్యాను.

పరీక్ష హాల్లో నన్ను క్షుణ్ణంగా పరీక్షించారు. నేను ముందు ఆశ్చర్యపోయినా అది మామూలే అనుకుని ఆ విషయం వదిలేశాను. వెళ్ళి పరీక్ష హాల్లో నాకు కేటాయించిన సీట్లో కూర్చున్నాను.

నేను అందరిలాగా పరీక్షా సెంటరుకు పుస్త కాలూ, నోట్సూ తీసుకెళ్ళను. పరీక్ష రాసే ముందు రెండు మూడు గంటల నుండి అసలు పరీక్ష గురించే ఆలోచించకుండా మనసు ప్రశాంతంగా ఉంచుకుంటాను.

పరీక్షా పత్రం ఇవ్వగానే, క్షుణ్ణంగా పరిశీలించి నేను సమాధానం రాయాల్సిన ప్రశ్నలను సెలెక్ట్ చేసుకున్నాను. ఏ పరీక్షలోనైనా సమాధానాలు రాయడానికి నేను ఒక పద్ధతి అవలంబిస్తాను. ఆన్సర్ చేయాల్సిన ప్రశ్నలను ఐడెంటిఫై చేశాక ఒక్కో ప్రశ్న గురించి రెండు నిమిషాలు ఆలోచి స్తాను. తదుపరి రెండు నిమిషాల పాటు ఆ ప్రశ్నకు నేను రాయాలనుకున్న సమాధానంలోని ముఖ్యమైన పాయింట్లను ప్రయారిటీ ప్రకారం ఆన్సర్ షీట్‌లోని చివరి పేజీలో నోట్ చేసుకుం టాను. ఆ పేజీ పై భాగాన 'రఫ్‌వర్క్ షీట్' అని హెడ్డింగ్ రాస్తాను. చివరకు ఆ పేజీని అడ్డంగా కొట్టేస్తాను. మొత్తం, అన్ని ప్రశ్నలకు ఈ విధమైన వర్క్‌షీట్ తయారు చేసుకున్నాక వాటిని వివరంగా సమాధానాల రూపంలో ఆన్సర్ షీట్‌లో రాస్తాను.

ఇది నా విజయ రహస్యం.

అందుకే నేను ఏ పరీక్ష రాసినా విజయం నాదే. మొదట్లో కొంచెం ఇబ్బంది అనిపిస్తుంది. టైం వేస్ట్ అయిన ఫీలింగ్ కలుగుతుంది. పక్కవాడు

## లాకర్ నెం.369

### కూపన్ నెం.3 విజేత

**కానూరి కోకిల**

విజయవాడ

అడిషనల్ ఆన్సర్ షీట్ తీసుకుంటుంటే మనమేమో రాయడమే మొదలు పెట్టకపోవడంతో భయమని పిస్తుంది. కానీ, ప్రాక్టీస్ చేసిన తర్వాత ఈ ప్రక్రియ నల్లేరు మీద నావలా విజయతీరాలను చేర్చు తుంది. పార్ట్ 1 లో కూడా మొదటి ప్రయత్నంలోనే నేను అన్ని సబ్జెక్టులలో పాస్ కావడానికి కారణం ఇదే.

ఆ రోజు 'ఫారిన్ ఎక్స్చేంజ్' పేపర్. నాకు బాగా ఇష్టమైన సబ్జెక్ట్. నేను బాగా ప్రిపేరైన పేపర్ కూడా. మొదటి అరగంటలో వర్క్‌షీట్ తయారు చేసుకు న్నాను.

సమాధానాలు రాయడం మొదలు పెట్టాను. వర్క్‌షీట్‌ను రెఫర్ చేసుకుంటూ మొదటి ప్రశ్నను సాల్వ్ చేస్తున్నాను.

ఇంతలో,

"కమాన్! గెటప్!" అన్న అధికార స్వరం విన పడింది.

నేను ఆశ్చర్యంగా తలెత్తి చూశాను. ఇన్విజి లేటర్ నిలబడి నా వంకే చూస్తున్నాడు.

"నన్నేనా?" అని ప్రశ్నిస్తున్నట్టుగా చూశాను. రాయడం ఆపలేదు. ఎందుకంటే, నేను టైం వేస్ట్ చేసే పరిస్థితిలో లేను.

"యస్! యూ ఛీట్! గెటప్" అని అరిచాడు. అతని అరుపులు విని ఇంకో ముగ్గురు ఇన్విజిలేటర్లు, ఇద్దరు పోలీసులు వచ్చి నా చుట్టూ నిలబడ్డారు.

నాకు అప్పుడు మ్యాటర్ సీరియస్ అని అర్థ మైంది. అందుకే,

"ఎందుకు? ఏమైంది?" అని కొంచెం కంగా రుగా ప్రశ్నించాను. నా భయమల్లా టైం వేస్ట్ అవు తుందనే.

"యూ ఛీట్! కాపీ కొడుతూ ఇంకా ఏమైందని ప్రశ్నిస్తున్నావా?" అంటూ నన్ను ఒక పోలీస్ కాలర్ పట్టుకుని కుర్చీలో నుంచి లేవదీశాడు. నేను గింజు కున్నాను.

నా ఆన్సర్ షీట్, క్వశ్చన్ పేపర్ తీసుకుని నన్ను లాక్కుంటూ చీఫ్ ఎగ్జామినర్ రూములోకి తీసు కొచ్చి నిలబెట్టారు.

నేను ముందుగా ఈ సంఘటనతో నివ్వెరపో యినా, షాక్ అయినా, వెంటనే తేరుకుని, కోపంగా,

"వాటీజ్ దిస్ నాన్సెన్స్? నేను కాపీ కొట్టడ మేంటి?" అంటూ అరిచాను.

**ఈవారం లాకర్ నెం. 369 చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## లాకర్ నెం. 369-5 (26-7-2017)

మా ప్రశ్న: **జోనల్ ఆఫీసుకు రాయపూర్ నుంచి స్టెనో ఆఫీసర్‌గా ట్రాన్స్‌ఫర్ అయి వచ్చిందెవరు?**

మీ జవాబు----------------------------------------------------------------

చిరునామా----------------------------------------------------------------

-------------------------------------------------------------------------

-----------------------------పిన్------------------ఫోన్‌నెం-------------------------

**ఈ కూపన్‌ను 25 జూలై 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా: నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

**వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్ స్టోర్స్ మెయిన్‌రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...**

*నిబంధనలు వర్తిస్తాయి

నా మాటలు పట్టించుకోకుండా, చీఫ్ ఎగ్జామినర్ సమక్షంలో పోలీసులు నేను వేసుకున్న బట్టలన్నీ వెతికారు. జేబుల్లో, బనీన్‌లో, చివరకి అండర్‌వేర్‌లో కూడా చెక్ చేశారు.

"పర్స్ ఏది?" అని అడిగారు.

"నాకు పర్స్ పెట్టుకునే అలవాటు లేదు" అన్నాను కోపంగా.

ఎంత వెతికినా నా దగ్గర ఏ చిట్టీలు దొరకలేదు.

"చిట్టీలన్నీ ఎక్కడ దాచావ్?" అని గద్దించాడు చీఫ్ ఎగ్జామినర్.

నాకు బుర్ర తిరిగిపోయింది.

"పిచ్చా మీకు? నా దగ్గర చిట్టీలెందుకుంటాయి?" అని ప్రశ్నించాను.

నా వర్క్‌షీట్‌లో నేను రాసుకున్న సమాధానాలు చూసి,

"ఇవన్నీ ఎక్కడ చూసి కాపీ కొట్టావ్?" అని అడిగాడు.

"అవి నేను రాసుకున్న ఇంపార్టెంట్ పాయింట్లు. నేను కాపీ కొట్టలేదు" అన్నాను.

అప్పటికే అక్కడ ఒక గుంపు గుమికూడింది.



మొదటి హాఫెనవర్ బెల్ కావడంతో పరీక్ష రాయలేని వాళ్ళు బయటకు వెళ్ళే అవకాశం ఉంది. ఫారిన్ ఎక్స్ఛేంజ్ పేపర్ చాలా మందికి కొరకరాని కొయ్య. అందులోనే చాలామంది ఏళ్ళ తరబడి ఫెయిలవుతుంటారు. అలా ఎగ్జామ్ హాల్లో నుండి బయటకు వచ్చిన వారంతా, నన్ను పరీక్ష హాల్లో నుంచి పోలీసులు లాక్కొచ్చి చీఫ్ ఎగ్జామినర్ రూములో చెక్ చేస్తున్నారన్న వార్త కార్చిచ్చులా వ్యాపించడంతో, అక్కడికి చేరుకున్నారు. వాళ్ళంతా గట్టిగా మాట్లాడుతుండడంతో గందరగోళం మొదలైంది.

మరి కాసేపట్లోనే ఉద్యమంలా మారుతుందని గమనించిన చీఫ్ ఎగ్జామినర్,

"మరి ఇలా ఎందుకు రాసుకున్నావ్?" అన్నాడు. ఆయన గొంతులో అప్పటి వరకున్న గాంభీర్యం పోయింది. బలహీనంగా ఉంది. నాకు కోపం నసాళానికి ఎక్కింది.

"బుద్ధుందా నీకు బ్లడీ ఫూల్? నా పరీక్ష నేనే లాగైనా రాసుకుంటాను. నువ్వెవడివి?" అని గొంతెత్తి అరిచాను.

ఇంతలో ఇద్దరు ముగ్గురు నాకు తెలిసిన వాళ్ళూ, మా బ్యాంకు వాళ్ళూ 'ఏమైందంటూ' నా దగ్గరకు వచ్చి నా చేతులు పట్టుకున్నారు. పరిస్థితి తనకు వ్యతిరేకంగా మారిందని గ్రహించిన చీఫ్ ఎగ్జామినర్,

"సరే సరే, వెళ్ళు! వెళ్ళి రాసుకో! కాపీ కొడితే ఉద్యోగం ఊడుతుంది తెల్సా?" అన్నాడు బింకంగా.

నేను అక్కణ్ణుంచి కదలలేదు.

"అసలు నన్ను కాలర్ పట్టుకుని పోలీసులు ఎందుకు లాక్కొచ్చారు? నా టైమ్ ఎందుకు వేస్ట్ చేశారు? నేను చేసిన తప్పేంటి?" అని అరుస్తూ అక్కడే నేల మీద కూర్చున్నాను. నా ఫ్రెండ్స్‌ను పిలిచి ఒక పని చెప్పాను.

అక్కడ గుమికూడిన బ్యాంక్ ఆఫీసర్లు, ఉద్యోగులు అందరూ కూడా నా చుట్టూ నేలమీద కూర్చుని,

"డౌన్ డౌన్" అని అరవడం మొదలు పెట్టారు.

నా ఫ్రెండు వెనుకగా వెళ్ళి నా కాలర్ పట్టుకున్న పోలీసుల ఫొటోలు, అప్పుడు అక్కడ జరుగుతున్న తతంగాన్నంతా ఫొటోలు తీయడం మొదలు పెట్టాడు.

చీఫ్ ఎగ్జామినర్ వణకడం మొదలు పెట్టాడు.

"సారీ! రాంగ్ ఇన్ఫర్మేషన్!" అంటూ నసిగాడు.

"చెప్పు తీసుకుని పళ్ళు రాలగొడతా రాస్కెల్! ఇడియెట్! ఇంతమందిలో నా కాలర్ పట్టుకుని లాక్కొస్తారా? ఒరేయ్ పోలీసులూ మీ ఫొటోలున్నాయి మా దగ్గర. రేపే కోర్టులో కేసు వేస్తా. నేను కూడా లాయర్‌నేరా! మీ అంతు చూస్తా! అసలు నేను చేసిన తప్పేంటిరా?" అని ఆగ్రహోదగ్రుణ్ణై అరిచాను.

నేనంత వైల్డ్‌గా రియాక్ట్ అయ్యేసరికి చీఫ్ ఎగ్జామినర్ ఖంగు తిన్నాడు.

"చెప్పు! లేకపోతే ఇప్పుడే మీడియాను పిలుస్తా! శేఖర్ టీవీ 9లో రాజుకు ఫోన్ చేయ్!" అంటూ లేని శేఖర్‌కు రాని రాజు పేరు చెప్పాను. అప్పటికే కొందరు మొబైల్స్ తీయసాగారు.

"ఆగండాగండి! ప్లీజ్! నా మాట వినండి. మన IIB లోకల్ ఛాప్టరుకు ఇతని మీద పది ఉత్తరాలు వచ్చాయి. ఇతను పరీక్షల్లో కాపీ కొట్టి రాసి పార్ట్ 1లో అన్ని సబ్జెక్టుల్లో మొదటి అటెంప్ట్‌లోనే పాసయ్యాడని వాటి సారాంశం. ఇవ్వాళ పొద్దున నుంచి కూడా ఐదారు ఫోన్లు వచ్చాయి. ఇతని జేబులో నిండా చిట్టీలున్నాయనీ, మాల్ ప్రాక్టీస్ చేస్తున్నాడనీ చెప్పారు. అందుకే పోలీస్ ప్రొటెక్షన్ తీసుకున్నాము. ఇతన్ని చెక్ చేస్తే ఏ చిట్టీ దొరకలేదు. అతను కన్నెత్తి కూడా చూడలేదని మా ఇన్విజిలేటర్లు చెప్పారు. కానీ, మాటిమాటికీ ఆన్సర్ బుక్‌లోని పేజీలు తిప్పి చూస్తుంటే అనుమానమొచ్చి ఒక ఇన్విజిలేటర్ దురుసుగా ప్రవర్తించాడు. అతన్ని చూసి పోలీసులు ఓవరాక్షన్ చేశారు. But he is perfect. Pure and intelligent. I am sorry!" అన్నాడు.

ఇంతలో వాళ్ళ స్టాఫ్ మెంబర్ రెండు ఉత్తరాలు తెచ్చి ఇచ్చాడు.

"మీరే చూడండి!" అంటూ వాటిని నాకు అందించాడు.

నేను ఆ ఉత్తరాల మీద అడ్రస్ రాసిన చేతిరాతను చూడగానే గుర్తించాను. అది మా ఆఫీసులో పనిచేసే పర్సనల్ ఆఫీసర్ చేతిరాతేనని. అడ్రస్‌లో కొంత భాగం మాత్రం మూర్తి అనే ఇంకో సీనియర్ ఆఫీసర్ చేతి వ్రాతలో ఉంది. లోపల రాసి ఉన్న మ్యాటర్‌లో మరో ఇద్దరి ముగ్గురి అవతలి యూనియన్ మెంబర్ల హస్తముంది.

నేను నిశ్చేష్టుణ్ణై పోయాను.

చీఫ్ ఎగ్జామినర్ నా రెండు చేతులు పట్టుకుని,

"సారీ బాబూ! నీకు నేను చేసిన ఈ ఘోర అవమానానికి ప్రాయశ్చిత్తంగా నీ కాళ్ళు పట్టుకోమన్నా పట్టుకుంటాను" అన్నాడు.

"అయ్యో వద్దు సార్!" అన్నాను నేను.

"నీకు జరిగిన నష్టానికి గానూ నీకు నేను అడిషనల్ టైం ఇస్తాను. ప్లీజ్ గో ఎహెడ్! ఆల్ ది బెస్ట్ టూ యూ!" అని పంపించాడు. పోలీసులు, ఇన్విజిలేటర్లు కూడా సారీ చెప్పారు.

నేను హాల్లోకి వెళ్తుంటే, అక్కడున్న వారు మాత్రం ఒప్పుకోలేదు.

"ఇంత న్యూసెన్స్ క్రియేట్ చేశాక అతను ప్రశాంతంగా పరీక్షలు ఎలా రాస్తాడండీ! పరీక్ష ఇంకో రోజు పెట్టాల్సిందే!" అని డిమాండ్ చేశారు.

నేను ఫర్వాలేదు, రాయగలనని వాళ్ళకు నచ్చ చెప్పాను.

నాకు ఎంతటి విపత్కర పరిస్థితుల్లోనైనా పరీక్ష రాసే సామర్థ్యం ఉందని చెప్పి, వాళ్ళందరికీ థాంక్స్ చెప్పి పరీక్ష రాయడానికి లోపలికి వెళ్ళాను.

పరీక్ష హాల్లో నేను రెండు నిమిషాలు ప్రశాంతంగా కూర్చుని పరీక్ష రాయడం ప్రారంభించాను.

అంత గొడవ జరిగినా, ఆ నాటి పరీక్ష 'ఫారిన్ ఎక్స్ఛేంజ్' పేపర్లో నేను గోల్డ్ మెడల్ సంపాదించాను. దాంతో పాటూ పార్ట్ 2లో కూడా అన్ని పేపర్లలో డెబ్బై ఐదు శాతం పైనే స్కోర్ చేసి ఒకే అటెంప్ట్‌లో, మొదటి అటెంప్ట్‌లో, డిస్టింక్షన్‌లో పాసయ్యాను.

***(ఇంకా వుంది)***




## ఫిట్‌మీల్స్

ఫిట్‌గా, ఆరోగ్యంగా ఉండటానికి వ్యాయామం ఒక్కటే సరిపోదు. అందుకు తగిన ఆహారం తీసుకోవడం కూడా అవసరమే. ప్రస్తుత ఉరుకుల పరుగుల జీవితంలో ఎవరి నోట విన్నా డయాబెటీస్, థైరాయిడ్, కీళ్ళనొప్పులు అనే మాటే.. ఆరోగ్యకరమైన ఆహారం తీసుకోకుండా జంక్‌ఫుడ్ తీసుకోవడం వల్లనే ఇన్ని ఆరోగ్య సమస్యలు అనుకునే వాళ్ళే ఎక్కువ. అందుకే నూనె లేకుండా పుల్కాలు, జొన్నరొట్టెలు, పచ్చికూరగాయలు, జ్యూస్‌లు తీసుకుని ఆరోగ్యకరమైన ఆహారం తీసుకుంటున్నాం అనుకుంటున్నారు. కానీ హెల్దీడైట్ అంటే అది కాదు అంటోంది ఫిట్‌మీల్స్ అనే స్టార్టప్. అసలు ఎవరు ఎలాంటి ఆహారం తీసుకోవాలి? ఏ ఆరోగ్య సమస్యకు ఎలాంటి డైట్‌ని ప్లాన్ చేసుకోవాలి? ఒకవేళ థైరాయిడ్ ఉంటే ఎలాంటి డైట్ అవసరం? బరువు తగ్గాలంటే ఏం తినాలి? వంటి ప్రశ్నలకు




సమాధానమే ఫిట్‌మీల్స్! తమను సంప్రదించినవారికి డైట్ ప్లాన్ చెప్పి, శుచిగా శుభ్రంగా వండి ఇంటి దగ్గరకే తెచ్చి మరీ అందిస్తుంది.

మీకు ఎలాంటి డైట్ కావాలో మీరు చెప్తే పరవాలేదు. కానీ మీకు ఎలాంటి డైట్ తీసుకోవాలో తెలియకపోతే, వాళ్ళే ఫోన్ కాల్ ద్వారా న్యూట్రిషనిస్టుని అరేంజ్ చేసి పెడతారు. కస్టమర్ హెల్త్ బయోగ్రఫీని బట్టి ఏ ఆహారం అయితే అతనికి బెస్టో అది తయారు చేసి ఇస్తారు. ప్రధానంగా వెయిట్ లాస్, వెయిట్ గెయిన్ డైట్ ప్లాన్లు వీళ్ల దగ్గర ఉన్నాయి. రెగ్యులర్‌గా జిమ్ చేసేవారి కోసం మజిల్ గెయిన్ డైట్ ప్లాన్ అందిస్తారు. వెయిట్ మెయింటెనెన్స్ డైట్ ప్లాన్ ఉంది. కీటో డైట్ ప్లాన్, హైఫాట్ లోకార్బ్ డైట్ ప్లాన్, వీటితో పాటు థైరాయిడ్, డయాబెటిక్ పేషెంట్లకు ప్రత్యేక డైట్ ప్లాన్స్ అందిస్తారు. ఇవేకాకుండా ఎలాంటి ఆరోగ్య సమస్యలు ఉన్నా అందుకు తగ్గట్టుగా డైట్ ప్లాన్ చేసి సప్లయ్ చేస్తారు. ఫిట్‌మీల్స్ డెలివరీ చేసే ప్రతీ మీల్ బాక్స్ కస్టమర్ కోరుకున్న విధంగానే ఉంటుంది. చేయి తిరిగిన వంటవాళ్లతో తయారు చేయించి డోర్ డెలివరీ ఇస్తారు. ఇంతకీ ఈ స్టార్టప్ ఫౌండర్లు ఎవరనేది చెప్పలేదు కదూ... వారు అమన్, భవ్యంత్, జిషాన్, అపూర్వ. వీరు ఎంతోమందిని కలిసి, న్యూట్రిషనిస్టులను సంప్రదించి, వాళ్ళ సలహాలతో అవసరమైన డైట్ ప్లాన్స్ డిజైన్ చేసుకుని, ఫిట్‌మీల్స్‌ని ప్రారంభించారు. అలా 2015 సెప్టెంబర్‌లో హైదరాబాద్‌లో ఫిట్‌మీల్స్ తన కార్యకలాపాలు మొదలుపెట్టింది.

—లక్ష్మీశ్రీ నర్మద






### సరసి కార్టూన్లు 4

**ధర:** 130 రూపాయలు
**పేజీలు:** 176
**ప్రతులకు:**
ఎస్.రామనరసింహం,
ప్లాట్ నెం 56, 3వ వీధి,
అనంత సరస్వతీనగర్,
మల్కాజ్‌గిరి,
హైదరాబాద్-47
సెల్: 94405 42950

మధ్యతరగతి మందహాసమే సరసి కార్టూన్లు. తల్లి, కొడుకు, కోడలున్న ఒక కుటుంబమే ఆయన కార్టూన్లకు ఆలంబన. ట్రాఫిక్కు, రైలు, బస్సు, గుడి, బడి, ఆఫీసు, ఆసుపత్రి, అపార్ట్‌మెంట్ కల్చర్, ఇంట్లో వాతావరణం, మానవ సంబంధాలు...కాదేదీ ఆయన కార్టూన్లకు అనర్హం. బొమ్మల దేవుడు బాపూ మెచ్చిన కార్టూనిస్టు, ఐదువేలకు పైగా కార్టూన్లు గీసిన జాతీయ అంతర్జాతీయ అవార్డుల గ్రహీత సరసి. నవ్య వీక్లీలో దశాబ్దకాలంపైగా కార్టూన్ కాలమ్ నడుపుతూ పాఠకాదరణ పొందుతున్నారాయన. కార్టూన్లే కాదు 400 కథలు, రేడియో నాటికలు కూడా రాశారు. సభ్యత, సంస్కారం, విలువలు, వాస్తవికత కలగలిసిన నవ్వించే కార్టూన్లే ఆయన వన్నీ. ఆయన వెలువరించిన కార్టూన్ బుక్స్‌లో మరో తాజా పుస్తకమిది.

### హాస్య కథలు

**సంకలనం:** వియోగి, ఏవిఎమ్
**ధర:** 300 రూపాయలు, **పేజీలు:** 400
**ప్రతులకు:** టి.కె.విశాలాక్షిదేవి
సెల్: 95026 29095, కె.విజయప్రసాద్, కర్నూలు హాస్య కళా సమితి, సెల్: 99639 26610, మరియు ఎస్సార్ బుక్‌లింక్స్, విజయవాడ-4. సెల్: 94919 62759 మరియు నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్.

యాభై హాస్య కథలు, పన్నెండు కార్డు కథల సంకలనమిది. మనస్ఫూర్తిగా నవ్వడం, నవ్వించడం ఒక కళ. అది నల్లేరుమీద బండి నడక కాదు. హాస్య కథా రచయిత వియోగి, నాలుగైదు దశాబ్దాలుగా వేలాది కార్టూన్లు సృష్టిస్తున్న ఏవిఎమ్‌ల సంయుక్త కృషితో ఈ నవ్వుల కథలు పుస్తకానికెక్కాయి. పాయసంలో జీడిపప్పుల్లా ఈ 400 పేజీల్లో అడుగడుగునా ఏవిఎమ్ కార్టూన్లు పాఠకులకు మధురమైన హాస్య రుచినందిస్తాయి.





### కలచాలనమ్

**బుర్రా లక్ష్మీనారాయణ**
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 176
**ప్రతులకు:** రచయిత,
2-2-647-235-18-ఎ,
జామ్‌జామ్ మసీద్ ఎదురుగా
బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్-13, పాలపిట్టబుక్స్, ఎపిహెచ్‌బి బ్లాక్-6, హైదరాబాద్-44.

ఆకట్టుకునే చిత్రమైన కథనశైలితో ప్రథమ పురుషలో సాగే పదహారు కథలివి. అంతరంగ విశ్లేషణ, దైనందిన జీవితంలోని ఆటుపోట్లు, జీవిత పాఠాల పరిశీలన, స్త్రీ పురుష సంబంధాలు, ప్రేమ తాలూకా పరవశాలు, వైరుధ్యాలను ప్రతిబింబించే కథలివి. పాత్రికేయ తరంగం డి.ఎస్‌కు నివాళి, మిమిక్రీ విశ్వమోహన కృష్ణతో ముఖాముఖి కూడా దీంట్లో పొందుపరిచారు.

## స్వీకారాలు

**సబ్బండ నాదం**
**ప్రజల పాటలు**
**వడ్డెముద్దంగుల ఎల్లన్న**
**ధర:** 60 రూపాయలు, **పేజీలు:** 86
**ప్రతులకు:** వడ్డెముద్దంగుల భాగ్యలక్ష్మి, బొంతపల్లి, గుమ్మడిదల మండలం, సంగారెడ్డి జిల్లా సెల్: 99853 56963 మరియు అన్ని పుస్తక విక్రయ కేంద్రాలు

**స్వప్నసాధకులు** విద్యార్థుల కవిత్వం
**సంపాదకత్వం:** బాలసుధాకర్ మౌళి
**ధర:** 100 రూపాయలు, **పేజీలు:** 80
**ప్రతులకు:** బాలసుధాకర్ మౌళి, ఎస్‌బిఐ వద్ద, బోయవీధి, నెల్లిమర్ల ఎస్.ఓ., విజయనగరం జిల్లా-535217.

**లేఖమాల**
**హరిహరప్రియకు డాక్టర్ సంజీవదేవ్**
**సంకలనం:** సాతవల్లి వేంకట విశ్వనాథభట్ట
**ధర:** 166 రూపాయలు, **పేజీలు:** 166
**ప్రతులకు:** పుస్తకమనె, 702, బి.సి.సి.హెచ్.ఎస్ లేఅవుట్, వాజరహళ్ళి, తలఘట్టపుర, బెంగళూరు-09
సెల్: 92422 21506

—లలితాత్రిపురసుందరి



# అయినవాళ్ళు

ప్రతాప రవిశంకర్

**ప్లాట్‌ఫారం మీదకు ప్రవేశించింది రైలు. సీట్లోంచి లేచి, బ్యాగులు భుజానికి తగిలించుకున్నాను. ప్రయోజకుడై సొంత ఊరికి తిరిగి వచ్చే సినిమా హీరోలాగా, మా వాళ్ళందరికీ కనపడే విధంగా వెళ్ళి బోగీ ఎంట్రన్స్ దగ్గర నిలబడ్డాను ప్లాట్‌ఫారంమీదకు చూస్తూ. ఓ నిముషానికి మా వాళ్ళు కనిపించారు. ముందుగా మా రెండో చెల్లెలు, పక్కనేమో అమ్మ, తర్వాత మిగిలిన వాళ్ళు నన్ను చూశారు. చెయ్యి ఊపాను.**

"అడుగో అన్నయ్య" నా రెండో చెల్లెలు లక్ష్మి పెద్దగా అరిచింది. అంతా ఒక్కసారిగా నేను నిల్చున్న రైలు పెట్టె వెంట చిన్నగా పరుగు దీశారు. నాకెంతో సంతోషం కలిగింది. రైల్లోంచి దిగగానే ముందుగా అమ్మను పలకరించాను. నన్ను చూడగానే అమ్మ కళ్ళల్లో సంతోషం కనపడింది. నేను పెద్దకొడుకును. అంతా కలిసి స్టేషన్ బయటకు వచ్చాం. బయటకు వచ్చిన తర్వాత నా రెండో చెల్లెలు వాళ్ళ ఇంటికి వెళ్ళడానికి ఆటోలు మాట్లాడుతోంది. అంతా అక్కడే ఉన్నారు. నాకు జరదాపాన్ నమిలే అలవాటు. దానికోసం స్టేషన్ బయట పాన్ దుకాణం దగ్గరకు బయల్దేరాను. నా కదలికను గ్రహించి నేను రెండడుగులు వెయ్యగానే "అన్నయ్యా" అని పిల్చాడు నా ఆఖరి తమ్ముడు జగదీష్.

ఆగి వెనక్కు తిరిగాను. అప్పుడు వాడు, ఐదారు పాన్‌లున్న మైనపు కవరు జేబులోంచి తీసి నాకు చూపిస్తూ "పాన్‌లు ఉన్నాయి. నువ్వు వెళ్ళొద్దు" అన్నాడు నవ్వుతూ. నా అలవాటు వాడికి తెలుసు. అందుకే ముందుగా పాన్‌లు తీసుకుని జేబులో ఉంచుకున్నాడు. తిరిగి వాళ్ళ దగ్గరకు వెళ్ళాను. అప్పటికే రెండు ఆటోలు మాట్లాడింది మా చెల్లెలు.

తమ్ముడి పక్కనే ఆటోలో చివరగా కూర్చున్నాను. కూర్చున్న తరువాత వాడు మైనపు కవర్లోంచి ఓ రత్నా జరదా పాన్ తీసి నాకిచ్చి "స్టేషన్‌కు రాగానే మరిచిపోతానని ముందు చేసిన పని ఇదే" అన్నాడు. థాంక్స్ చెప్పాను పాన్ నములుతూ.

ఆటో వెళుతున్నప్పుడు బయటకు చూస్తున్నాను. జగదీష్ ఏదో చెబుతున్నాడు. ఇంతలో నన్ను చేత్తో కుదిపి "పెదనాన్నా సమోసాలు తెచ్చావా?" అనడిగాడు నా తమ్ముడి కొడుకు సూర్య. ఐదేళ్ళుంటాయి. సమోసాలంటే చాలా ఇష్టం వాడికి.

"వీడికెప్పుడూ సమోసాల ఆలోచనే" అన్నది నా తమ్ముడు భార్య సరోజ. నేను నవ్వి "తీసుకు వచ్చానురా, బ్యాగ్‌లో ఉన్నాయి, ఇంటికి వెళ్ళాక ఇస్తాను" అన్నాను. అప్పుడు వాడు వాళ్ళ నాన్న భుజానికి ఉన్న నా బ్యాగ్ మీద చేతులు వేసి ఆప్యాయంగా నిమిరాడు సమోసాలు ఉన్నాయని. అదిచూసి వాళ్ళమ్మ "ఇంత పిచ్చేమిట్రా నీకు" అన్నది మురిపెంగా. కొంతసేపటికి ఆటోలు ఆగాయి. అందరం మా చెల్లెలు ఇంటి ముందు దిగాం. నా రెండో తమ్ముడు శేఖర్ ఆటో వాళ్ళకు డబ్బులిచ్చి పంపాడు. అందరం లోపలికి వెళుతున్నప్పుడు పక్క పోర్షన్‌లోంచి దాదాపు నా వయసులో ఉన్న

**అతడు ఆ ఇంటికి పెద్ద కొడుకు. తల్లితో సహా తమ్ముళ్ళు, చెల్లెళ్ళు, వాళ్ళ పిల్లలు అందరూ రైల్వేస్టేషన్‌కెళ్ళి అతన్ని రిసీవ్ చేసుకుని ఇంటికి తీసుకెళ్ళారు. ఎంతో సంబరపడ్డారు. వాళ్ళ ఇష్టాలకు అనుగుణంగా గుంటూరు సమోసాలు, జీడిపాకం, బండమిఠాయి తెచ్చి ఇచ్చాడతను. ఆనందంగా అందరూ రెండు రోజులు సంతోషాలు పంచుకున్నారు. ఆ కుటుంబాన్ని చూసి ఎంతో ఉత్తేజితుడైన పక్కింటి పరబ్రహ్మం ఏంచేశాడు?**

ఒకాయన బయటకు వచ్చి "రైలు లేటా?" అనడిగాడు. "రైలు లేటు కాదు. మేమే లేటుగా వచ్చాం" అన్నాడు నా తమ్ముడు. మేము లోపలకు వెళ్ళే వరకూ ఆయన అలా చూస్తూండిపోయాడు.

"ఎవరాయన?" మా తమ్ముణ్ణి అడిగాను లోపలికి వెళ్ళాక. "ఆయన పేరు పరబ్రహ్మం. పక్క పోర్షనులో ఉండే కామేశ్వరిగారి అన్నయ్య, ఒంగోలు నుంచి నిన్ననే వచ్చాడు" అని చెప్పాడు. లోపలకు వెళ్ళి ముందు గదిలో కూర్చున్నాం. నేను కుర్చీలో కూర్చుంటే మిగిలిన వాళ్ళు నా చుట్టూ కింద కూర్చున్నారు. మా అమ్మ మాత్రం నా పక్కనే కుర్చీలో కూర్చుంది.

నా చెల్లెలు లక్ష్మి గబగబా కిచెన్‌లోకి వెళ్ళింది. ఎందుకో నాకు తెలుసు. నాకు టీ చేసి ఇవ్వాలని. లోపల కూర్చోగానే నా తమ్ముడి కొడుకు సూర్య సమోసాల గురించి గుర్తు చేశాడు. అప్పుడు ఆలస్యం చేయకుండా బ్యాగ్ తెరచి అందులోంచి సమోసాల పొట్లం బయటకు తీశాను. పెద్ద పొట్లాం. ముప్పై సమోసాలు. ఆ పొట్లం చూడగానే సూర్య కళ్ళు మెరిశాయి. వాడు చిన్నగా ఎగిరాడు సంతోషంతో. నా మూడో చెల్లెలు బుజ్జమ్మ నా చేతిలోంచి ఆ పొట్లం తీసుకుని అందరికీ సమోసాలు పంచడం మొదలు పెట్టింది. ముందుగా టెన్షన్ పడకుండా ఉండడానికి సూర్యకు నాలుగు సమోసాలు ఇచ్చింది. సమోసాలు పంచుతున్నప్పుడు పక్కపోర్షన్‌లో పరబ్రహ్మం నవ్వుకుంటూ వచ్చి నాకు కొంచెం దూరంగా ఉన్న కుర్చీలో కూర్చుంటూ "ఇక్కడ కోలాహలం వినపడుతుంటే లోపల కూర్చోలేక ఇలా వచ్చాను" అన్నాడు. "మా అన్నయ్య వస్తే సందడే సందడి" అన్నది మా మూడో చెల్లెలు. "నా పేరు పరబ్రహ్మం. ఒంగోలు జిల్లాపరిషత్ స్కూల్లో పనిచేస్తున్నాను" అని చెప్పాడు. స్థిమితంగా కూర్చుని నా గురించి వివరాలు చెప్పబోతుంటే, "వద్దండీ. మీ గురించి అంతా మీ వాళ్ళు చెప్పారు. వారం క్రితం మీరు ఫోన్ చేసి గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్నట్టు చెప్పారట. అప్పటి నుంచీ వీళ్ళంతా మీ కోసం ఎదురు చూస్తున్నారు" అన్నాడు పరబ్రహ్మం. "రాత్రి అమ్మ నిద్ర పోలేదురా. నిమిష నిమిషానికీ లేచి టైమెంత? అని అడుగుతూనే ఉంది" అన్నది మా చెల్లెలు లక్ష్మి. అలాగా అన్నాను. అంతా సమోసాలు తింటున్నారు. మా బుజ్జమ్మ అందరితోపాటు పరబ్రహ్మానికి కూడా రెండు సమోసాలు ఇచ్చింది. ఆయన మొహమాటపడుతూ తీసుకున్నాడు. తింటూ "గుంటూరు నుంచి తెచ్చారా? బావున్నాయి" అన్నాడు. "అవునండీ. మా సూర్యాగాడికి సమోసాలు ఇష్టం" అన్నాను.

"పిల్లాడికి ఇష్టమని మరిచిపోకుండా మీరు గుంటూరు నుంచి సమోసాలు తీసుకు వచ్చారంటే ఆశ్చర్యంగా ఉంది" అన్నాడాయన. "ఇష్టానికి పిల్లలేమిటి? పెద్దలేమిటి? ఎవరైనా ఒకటే. సులభంగా తీర్చగలిగిన కోరికలను వాయిదా వేయాల్సిన అవసరం లేదు. ఇదేమంత కష్టమైన పని కాదు. మా సూర్యాను చూడండి, ఎంత సంతోషంగా ఉన్నాడో. నాకు రత్నా జరదాపాన్ అంటే చాలా ఇష్టం. నా తమ్ముడు జగదీష్ స్టేషన్‌కు వస్తూ పాన్‌లు కట్టించుకుని వచ్చాడు. ఒక మనిషి మీద ప్రేమతోనూ, గౌరవంతోనూ మనం సంతోషం కలిగించాలనే ఆలోచన మనలో ఉండాలేగానీ అది అసాధ్యం కాదు" అన్నాను.

పరబ్రహ్మం నా వైపు ఆశ్చర్యంగా చూసి "ఇంతేనా? ఇంకా ఏమైనా తెచ్చారా?" అనడిగాడు.

"ఇంకా ఉన్నాయి. నా చెల్లెలు లక్ష్మికి జీడిపాకమంటే ఇష్టం. అందుకని నిన్న మా గుంటూరు దగ్గర చీరాల వెళ్ళాను. చీరాలలో జీడిపాకం బాగుంటుంది. చీరాల పక్కన వేటపాలెం జీడిపప్పుకు ప్రసిద్ధి. చీరాలలో తీసుకు వచ్చాను" అని బ్యాగ్‌లో నించి జీడిపాకం పొట్లం తీసి నా రెండో చెల్లెలు చేతికిచ్చాను. అది ముసి ముసిగా నవ్వుతూ "నువ్వు జీడిపాకం తెస్తావని నాకు తెలుసు" అన్నది. "అన్నయ్యా, నన్ను మరచిపోయావా?" అన్నది మూడో చెల్లెలు బుజ్జమ్మ.

"నిన్నెట్లా మరచిపోతాను బుజ్జమ్మా. ఇదిగో నీకు ఇష్టమైన బండ మిఠాయి" అంటూ బండ మిఠాయి పొట్లం తీసి బుజ్జమ్మకిచ్చాను. "బండ మిఠాయా?" ఆశ్చర్యంగా అడిగాడు పరబ్రహ్మం. "అవునండీ. మిఠాయిల్లో ఇదో రకం. మా గుంటూరు స్పెషల్. బాగుంటుంది" అని "బుజ్జమ్మా, పొట్లం విప్పినప్పుడు పరబ్రహ్మంగారిక్కూడా పెట్టు" అన్నాను.

## అవి చేయనంటోంది



కేథరిన్ త్రెస్సా హీరోయిన్‌గానే తెలుగువారికి పరిచయమైంది. అయితే కాలం కలిసి రాక ఇక్కడ ఓ హీరో సినిమాలో ఐటెంసాంగ్ చేసింది. దాంతో దాదాపు అలాంటి అవకాశాలే కేథరిన్ తలుపు తట్టాయి. ఐటెమ్ గాళ్‌గా ముద్రపడిన తరువాత తప్పు తెలుసుకున్నట్టుంది కేథరిన్. దాంతో ఇకనుంచి ఐటెంసాంగ్స్ చేయనని తెగేసి చెబుతోందట! తన మీద పడిన ముద్ర చెరిపేసుకోవడానికే కేథరిన్ అలా చెబుతోందని కొందరు అంటున్నా, అలాంటిదేమీ లేదని ఒక్క సాంగ్‌కు కోట్లు కుమ్మరిస్తే ఐటెంసాంగ్ చేయడానికి కేథరిన్ రెడీగా ఉంటుందని కొందరు చెబుతున్నారు.

"ఇప్పుడే పెడతాను" అని బుజ్జమ్మ పొట్లం విప్పుతున్నప్పుడు పరబ్రహ్మం చెల్లెలు కామేశ్వరి వచ్చింది. బుజ్జమ్మ మిఠాయి పొట్లం ఊడదీసి పరబ్రహ్మానికీ, కామేశ్వరికీ మిఠాయి పెట్టింది. కామేశ్వరి మిఠాయి నోట్లో వేసుకుని "చాలా బాగుంది. ఈసారి గుంటూరు నుంచి వచ్చేటప్పుడు మాక్కూడా ఓ కిలో తీసుకురండి. వచ్చాక డబ్బులిస్తాను" అన్నది. "డబ్బులెందుకు లెండి. మీకు మా గుంటూరు మిఠాయి నచ్చింది గదా! తప్పకుండా తీసుకువస్తాను. మిమ్మల్ని కూడా హైదరాబాద్‌లో ఉంటున్న నా ఇంకో చెల్లెలనే అనుకుంటా" అన్నాను. కామేశ్వరి థాంక్స్ చెప్పి "వీళ్ళు ఎప్పుడూ మీ గురించే మాట్లాడుకుంటారండీ. ఎందుకో అర్థమయ్యేది కాదు" అన్నది కామేశ్వరి. "ఎందుకేమిటండీ? అయిన వాళ్ళం కదా" అన్నాను నవ్వి. "అయిన వాళ్ళా?" అన్నాడు పరబ్రహ్మం. "అంతే కదండీ" అన్నాను. నా చెల్లెలు లక్ష్మి జీడిపాకం ముక్క కామేశ్వరికి ఇచ్చి "మా అన్నయ్య వేటపాలెం జీడిపప్పుతో చేసిన ఈ జీడిపాకాన్ని నాకోసం తీసుకు వచ్చాడు, జీడిపాకమంటే నాకిష్టమని" గర్వంగా ఫీలవుతూ చెప్పింది. "నువ్వు అదృష్టవంతురాలివి లక్ష్మీ" అన్నది కామేశ్వరి కొంచెం అసూయగా. మా అమ్మ గోడవైపు తిరిగి పమిట చెంగుతో కళ్ళు ఒత్తుకోవడం గమనించాను. గర్వం కలిగింది. నా వాళ్ళను ప్రేమగా చూసుకుంటున్నందుకే అమ్మకు ఆనంద బాష్పాలు వస్తున్నాయనుకున్నాను. మా చెల్లెలు అందరికీ టీ ఇచ్చింది. టీ తాగి కప్పులు కింద పెట్టగానే మా తమ్ముడు ఒక రత్నాపాన్ తీసి నాకిచ్చాడు. టీ తాగిన తర్వాత రత్నాపాన్ నమలడం నాకు అలవాటు. అది వాడికి తెలుసు.

వాడు బాల్కనీలో కుర్చీ వేశాడు.

బాల్కనీలో కూర్చుని పాన్ నములుతున్నప్పుడు పరబ్రహ్మం వచ్చి నా దగ్గర నిలబడి "మిమ్మల్ని చూస్తుంటే ఆశ్చర్యంగా ఉంది. ఒక మనిషి ఇంత మందికి ఇష్టమైన వాడిగా ఉండడం కొంచెం అరుదు అనుకుంటాను" అన్నాడు. నేను నవ్వి "అరుదుగా కాదు. నిజానికి అది మన ఆలోచనా విధానాన్ని బట్టి ఉంటుంది" అన్నాను. "ఆలోచనా విధానమా?" అన్నాడు పరబ్రహ్మం. "అవును. అంతా నాకు అయిన వాళ్ళు కావాలి, అందరికీ నేను అయిన వాడిని కావాలి అనే ఆలోచన మనలో ఉండి ఎదుటివాళ్ళకు ఇబ్బంది కలగని రీతిలో వాళ్ళకు ఇష్టమైన విధంగా మనం ప్రవర్తించినప్పుడు ఏదీ అసాధ్యం కాదు. నేనలాగే ఉంటాను. ఎదుటి మనిషి పట్ల మనం చూపే ప్రేమ, ఇష్టం, అభిమానం ప్రధానం" అన్నాను. అప్పుడు పరబ్రహ్మం జేబులోంచి సిగరెట్టుపెట్టె తీసి "నాకు ఈ అలవాటు ఉంది" అన్నాడు సిగరెట్టు వెలిగించబోతూ. నేను నవ్వి "కాల్చుకోండి. నాకు పాను, మీకు సిగరెట్టు" అన్నాను. "వాడికి ఆకలవుతుందేమో భోజనం పెట్టండి" అన్నది అమ్మ నా చెల్లెలుతో.

అప్పుడు వాళ్ళలో చలనం మొదలైంది. పరబ్రహ్మం, కామేశ్వరి లేవబోయారు. "పరబ్రహ్మం గారూ, ఇప్పుడు మీరు కూడా మాతో కూర్చుని భోజనం చెయ్యాలి. మనందరం అయిన వాళ్ళం" అన్నాను. పరబ్రహ్మం థాంక్స్ చెప్పి, తర్వాత నా పక్కనే భోజనానికి కూర్చున్నాడు. కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు ముగించాం. భోజనం అనంతరం చిక్కడపల్లి వెళ్ళి ఓ స్నేహితుడిని కలిసి వచ్చాను. రాత్రి భోజనం అనంతరం డాబామీద కూర్చుని పొద్దుపోయేదాకా కబుర్లు చెప్పుకున్నాం. రెండు రోజులు ఉన్నాను. పరబ్రహ్మం కూడా నాలాగే అప్పుడప్పుడు చెల్లెలు కామేశ్వరి ఇంటికి వస్తూ ఉంటాడట. సెలవు అయిపోయిందనీ, మర్నాడు వెళతాననీ చెప్పాను. మళ్ళీ సెలవు చూసుకుని వస్తానని ఆరోజు బయలుదేరాను. నాతో కలిసి ప్రయాణం చెయ్యడానికి పరబ్రహ్మం కూడా ఒంగోలు ప్రయాణం పెట్టుకున్నాడు. గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌లో నాతో పాటు నా తమ్ముడు జగదీష్ కూడా బయల్దేరాడు. మేం బుకింగ్ దగ్గరకు వెళుతున్నప్పుడు "ఇప్పుడే వస్తాను" అని పరబ్రహ్మం ఎందుకో బయటకు వెళ్ళొచ్చాడు. రైలు బయలుదేరుతోంది. నా తమ్ముడు జగదీష్ నాతోనే ఉండడంతో "మీ తమ్ముడు కూడా గుంటూరు వస్తున్నాడా?" అనడిగాడు పరబ్రహ్మం. నేను నవ్వి, "గుంటూరు కాదు. నల్గొండ దాకా వచ్చి తిరిగి హైదరాబాదుకు వస్తాడు. వాడికి అప్పుడే నన్ను వదలాలని లేదు" అని చెప్పాను. అప్పుడు ఆయన ఆశ్చర్యపడి జేబులోంచి నాలుగు జరదాపాన్‌లు తీసి నాకిస్తూ "ఇదుగో మీకు ఇష్టమైన పాన్లు" అన్నాడు. "మా తమ్ముడు తెచ్చాడండీ. మీరెందుకు తీసుకున్నారు?" అన్నాను ఆశ్చర్యంగా. "మీకు ఇష్టమన్నారుగా. మీ దగ్గర ఉన్నాయో లేదోనని తీసుకున్నాను" అన్నాడు పరబ్రహ్మం. రైలు వెళుతున్నంత సేపూ పరబ్రహ్మం మాట్లాడుతూనే ఉన్నాడు. నల్గొండలో రైలు ఆగినప్పుడు నా తమ్ముడు దిగాడు. వెళ్ళబోతూ పర్సులోంచి ఐదువందల రూపాయల నోటు తీసి నాకివ్వబోయాడు.

"ఇప్పుడు డబ్బెందుకు? నా దగ్గరున్నాయి" అన్నాను. "నీ దగ్గర లేవని కాదు. నా తృప్తి కోసం. ఈసారి వచ్చేటప్పుడు ఏమైనా తీసుకురా" అని ఆ నోటు నా జేబులో పెట్టి వెళ్ళిపోయాడు. "ఏమైనా మీరు అదృష్టవంతులు" అన్నాడు పరబ్రహ్మం రైలు కదిలాక.

నిర్ణీత సమయానికి గుంటూరులో ఆగింది రైలు. నేను బ్యాగ్ భుజానికి తగిలించుకుంటున్నప్పుడు పరబ్రహ్మం లేచి నిల్చున్నాడు. ఆయన కూడా నాతో డోర్ దగ్గరకు వచ్చి దిగే ముందు నాతో కరచాలనం చేసి "మీతో కలిసి ప్రయాణించడం నాకు చాలా ఆనందంగా ఉంది. ఇప్పుడు నేనుకూడా మీకు ఆయినవాణ్ణి" అని చిన్నగా రైల్లో నించి దిగాడు ఒంగోలు వెళ్ళడానికి.

*సెల్: 88977 75291*

## కాటూరి వెంకటేశ్వరరావు హాస్యం

*ఒకరోజు అడవి బాపిరాజు, కాటూరి వెంకటేశ్వరరావుగారికి మధ్య జరిగిన సంభాషణ:*



***బాపిరాజు:*** *రావుగారూ మీరు, నేను, విశ్వనాథ మన్మథనామ సంవత్సరంలో పుట్టాం. ముగ్గురం కపులమయినాం. ఎంత చిత్రంగా ఉందో.*

***కాటూరి:*** *నా ముఖంలాగున్నది. మన్మథనామ సంవత్సరంలో పుడితే అందంగా ఉండాలి గానీ కపులు కావడం ఏం ఖర్మ. (ఈ ముగ్గురిలో కాటూరి వారే అందగాడు. ఇదే ఇక్కడ ధ్వని)*

***-సేకరణ: ఎన్.తారకరామారావు***





మస్తానమ్మ మాత్రమే. అంతేకాదు యూట్యూబ్ నడిపించే ఎల్డర్స్‌ను చూస్తే, ప్రపంచంలోనే అత్యధిక వయసుగల యూట్యూబర్ ఆమే. కంటి చూపు సరిగ్గా లేకపోయినా ఆమె వంటల రుచి మాత్రం తగ్గదు. ఇటీవల ఆమె పుట్టినరోజు నాడు ఎంతోమంది యూట్యూబ్ చందాదార్లు బహుమతులు పంపించి తమ ప్రేమ చాటుకున్నారు. ఆమె వంటలకు ఇంత పాపులారిటీ ఎందుకొచ్చింది? అసలు ఆవిడ వండేదేమిటి? అనుకుంటున్నారా? వెజ్, నాన్‌వెజ్ వంటకాలను

## యూట్యూబ్ మహారాణి

# వంటల మస్తానమ్మ

**పాశ్చాత్య వంటకాలన్నింటికన్నా మన భారతీయ వంటకాల రుచి, అందులోనూ మన తెలుగువంటకాల రుచి చాలా డిఫరెంట్. ఎన్ని రుచులు తిన్నాసరే మన ఇంట్లో అమ్మ చేతివంట రుచే అమోఘం. పాతతరం జ్ఞాపకాలెప్పుడూ ఎంతో విలువైనవే.**

'మా అమ్మమ్మ చేతివంట ఎంత కమ్మగా ఉంటుందో, నానమ్మ వంటరుచి ఎంత బాగుందేదో... అవన్నీ తినే మేం ఇంత దృఢంగా ఉన్నాం.. ఇప్పటికాలం పిల్లలకు ఇవేవీ పట్టవు' అంటూ ఇంట్లో పెద్దలు ఆనాటి కబుర్లు చెబుతూ పిల్లల్ని ముద్దుగా విసుక్కోవడం చూస్తూనే ఉంటాం. ఇప్పటి తరం అలాంటి వంటలు నేర్చుకోవాలని కోరుకున్నా నేర్పించే వాళ్ళేరీ? అని ప్రశ్నిస్తారు. మహత్తరమైన నాటి రుచుల వంట నేర్చుకునేదెలా? అని నిజంగా మీరు బెంగపడుతున్నారా! అయితే ఇప్పుడు మీకాబెంగేమీ అక్కర్లేదు. జస్ట్ యూట్యూబ్‌లో ఓ బామ్మ వండే మన తెలుగు వంటలు చూడండి. నాటితరం వంటలన్నీ నేర్చేసుకోండి! ఇంతకీ ఎవరీ బామ్మ ఏమిటా కథ అని తెలుసుకోవాలనుకుంటున్నారా... అయితే చదివేసేయండి మరి!

### ఎనర్జెటిక్ లేడీ!

ఈ కాలంవారికి చిన్నవయసులోనే రకరకాల అనారోగ్య సమస్యలు. ఎక్కువ కష్టపడలేం, చేతకావట్లేదు అని చేతులెత్తేవారు కోకొల్లలు. సాధారణంగా యాభై, అరవై ఏళ్ళు రాగానే శరీరాన్ని ఒకరకమైన నిస్సత్తువ ఆవరిస్తుంది. కానీ ఆ శతాధిక వృద్ధురాలు మాత్రం ఇలాంటి వాటన్నింటికీ అతీతం. ఇటీవలే 106వ పుట్టిన రోజు చేసుకున్న మస్తానమ్మ కాలంతో పరుగెత్తే మనిషి. తనకింకా వయసు మీరిపోలేదని నిరూపిస్తోంది. నేను యంగ్ లేడీనే అంటోంది.

కృష్ణాజిల్లా గుడివాడకు చెందిన ఈ బామ్మ యూట్యూబ్ ప్రపంచానికి ఇప్పుడు సుపరిచితురాలు. తన వంటలతో దేశ విదేశీయులను కట్టిపడేస్తూ తనదైన ప్రపంచం సృష్టించుకుంది. ఆమె ఛానల్ పేరు కంట్రీఫుడ్స్. ఈ ఛానల్‌కి ఇప్పటివరకు రెండులక్షల యాభైవేలమంది చందాదార్లు చేరారు.

### మనవడి సహాయం

అంతవయసు వచ్చినాసరే మస్తానమ్మ ఎంతో ఉత్సాహంగా ఉంటుంది. ఎవరిపైనా ఆధారపడకుండా తనంతట తానే రోజువారి కార్యక్రమాలు కూడా పూర్తి చేసుకుంటుంది. 22వ ఏటనే భర్తను కోల్పోయిన మస్తానమ్మ స్వతంత్రంగా జీవించింది. ఐదుగురు సంతానం. వారిలో నలుగురు మరణించారు. అయినా ధైర్యం కోల్పోలేదు. ఇంకా చెప్పాలంటే ఏడాదిక్రితం వరకు ఆమె పొలం పనులు కూడా చేసేదట. కుటుంబసభ్యుల కోరిక మేరకు ఈ ఏడాది నుంచి ఆ పొలం పనులు మానేసింది. కుటుంబసభ్యులు తమ దగ్గర ఉండమని బలవంతం చేసినాసరే ఒప్పుకోలేదు. ఊళ్ళో ఉన్న తన గుడిసెలో ఉండేందుకే ఇష్టపడుతుంది మస్తానమ్మ. ఆమె మనవడి వృత్తి వీడియో ఎడిటింగ్. యూట్యూబ్‌లో మస్తానమ్మ వంటల ఛానల్ ప్రారంభించాడు. ఓసారి బామ్మని చూద్దామని సొంతూరు వచ్చాడు. తన బామ్మచేత సరదాగా ఒక వంట చేయించి ఆ వీడియోని యూ ట్యూబ్‌లో పెట్టాడు. మొదటి వీడియోకే మంచి స్పందన రావడంతో మనవడు సరికొత్త ఆలోచన చేశాడు. బామ్మతో వంటలు చేయించడం, ఆ వీడియోలు అప్‌లోడ్ చేయడం ప్రారంభించాడు. దీంతో అప్పటికి వందల్లో ఉన్న ఆ ఛానల్ చందాదారులు లక్షల్లోకి చేరిపోయారు. అలా మనవడి సహాయంతో ఆ బామ్మ ఫేమస్ అయిపోయింది.

### మస్తానమ్మపై బీబీసీ డాక్యుమెంటరీ

యూట్యూబ్‌లో వంటల ఛానల్స్ బోలెడున్నాయి. యూట్యూబ్‌లో మరికొంతమంది బామ్మలు వంటలు చేస్తున్నా అందరిలోనూ పెద్ద వయస్కురాలు పూర్తి సహజసిద్ధంగా మన పల్లెటూళ్లలో ఎలా వండుతారో అలా చేసి చూపించడం ఈ బామ్మ ప్రత్యేకత. వంటలు చేయడమే కాదు, తను చేసిన వంటకాలను అందరికీ కొసరి కొసరి వడ్డించడంలోనూ ఈబామ్మ ముందుంటుంది. ఇంత పెద్దవయసులో రుచికరమైన వెరైటీ వంటకాలు చేయగల పనితనం మస్తానమ్మకే చెల్లింది. అందుకే ఆమె 106 ఏళ్ళ వయసులోనూ రారాణిగా యూట్యూబ్‌ను ఏలుతోంది. అందుకేనేమో బీబీసీవారు సైతం ఆమెపై ఒక డాక్యుమెంటరీ తీశారు.

– నివేదిత



# సౌభాగ్య చక్రం

జూలై 19 నుంచి
జూలై 25 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, విద్య, కుటుంబ వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 20, 21 తేదీల్లో విద్యార్థులు పట్టుదలతో కృషి చేసి లక్ష్యాలు సాధిస్తారు. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లలో నిరుత్సాహ కరంగా ఉంటుంది. 22, 23 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. విద్యాసంస్థల్లో ప్రవేశానికి అనుకూలం. 24, 25 తేదీల్లో సృజనాత్మ కంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారులు, ప్రియతముల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది.



## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, విద్య, బదిలీలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. విద్యార్థులకు శుభప్రదం. ఒక శుభవార్త అందుకుంటారు. 20, 21 తేదీల్లో విలువైన పత్రాలు అందడంలో ఇబ్బందులు ఎదురవుతాయి. ఫీజులు, బిల్లులు చెల్లిం చేందుకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 22, 23 తేదీల్లో విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ప్రయాణాలు, చర్చల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. 24, 25 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారికి అనుకూలం. కుటుంబ సభ్యుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది.



## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, క్రయవిక్రయాలు, విద్యా విషయాలకు ఈ వారం ప్రాధా న్యం ఉంటుంది. బుధవారం దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక విషయాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 20, 21 తేదీల్లో పెట్టుబడులపై ఆచితూచి నిర్ణయం తీసుకోవాలి. విలువైన వస్తువులు కొను గోలు చేస్తారు. 22, 23 తేదీల్లో విలువైన పత్రాలు అందుకుంటారు. విద్యా విషయా లకు అవసరమైన నిధులు సకాలంలో అందక ఇబ్బంది పడతారు. 24, 25 తేదీల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు అనుకూల సమయం. స్టేషనరీ, ఏజెన్సీ, విద్యారంగాల వారికి ప్రోత్సాహకరం.



## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

ఆర్థిక సంస్థలతో పనులు, విదేశీ వ్యవహారాలు, పెట్టుబడులు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం బృందకార్యక్ర మాల్లో పాల్గొంటారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 20, 21 తేదీల్లో మన శ్శాంతి లోపిస్తుంది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో కీలక నిర్ణయాలు తీసుకుం టారు. 22, 23 తేదీల్లో ఆర్థిక వ్యవహారాల్లో కీలక నిర్ణయాలు వాయిదా వేయండి. వ్యక్తిగత సౌకర్యాల కోసం ఖర్చు చేస్తారు. 24, 25 తేదీల్లో డిపాజిట్లపై మంచి ప్రతి ఫలం అందుకుంటారు. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు.



## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

ప్రముఖులతో సమావేశాలు, విదేశీ వ్యవహారాలు, కీలక నిర్ణయాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. గౌరవ పదవులు అందుకుంటారు. 20, 21 తేదీల్లో ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. స్నేహానుబంధాలు బలపడతాయి. 22, 23 తేదీల్లో కీలక నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది. ఉన్నత విద్య, విదేశీ వ్యవ హారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. 24, 25 తేదీల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది.



## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

ప్రేమానుబంధాలు, పెట్టుబడులు, బృంద కార్యక్రమాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం సోదరీ సోదరుల వ్యవహారాలు మన స్తాపం కలిగిస్తాయి. 6, 7 తేదీల్లో ప్రియతముల రాకతో ఇల్లు సంద డిగా ఉంటుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారు జాగ్రత్తలు పాటిం చాలి. 8, 9, 10 తేదీల్లో వేడుకలు, శుభకార్యాల్లో పాల్గొంటారు. బంధుమిత్రుల కల యిక ఆనందం కలిగిస్తుంది. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రేమానుబం ధాలు బలపడతాయి. 11న బంధుమిత్రులతో విందుల్లో పాల్గొంటారు. కొత్త పరిచ యాలు లక్ష్య సాధనకు ఉపకరిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం.



## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

పెద్దల ఆరోగ్యం, వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, పెట్టుబడులకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం పెద్దల ఆరోగ్యం మెరుగవుతుంది. పెన్షన్, గ్రాట్యుటీ, బీమా వ్యవహారాలకు అనుకూలం. 20, 21 తేదీల్లో వృత్తి వ్యాపారాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. కొత్త వ్యూహాలు అమలు చేసి సత్ఫలితాలు సాధి స్తారు. 22, 23 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా నిరుత్సాహకరంగా ఉంటుంది. వేడుకల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 24, 25 తేదీల్లో బృంద కార్యక్రమాలు ఉల్లాసం కలిగిస్తాయి. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు పూర్తవుతాయి.



## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, పెట్టుబడులు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి సారి స్తారు. బుధవారం శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. వేడుకల్లో పాల్గొంటారు. 20, 21 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. రుణప్రయత్నాలు ఫలించే అవకాశం ఉంది. ఆర్థికపరమైన చర్చలు లాభి స్తాయి. 22, 23 తేదీల్లో సమావేశాలు, చర్చల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 24, 25 తేదీల్లో ఆర్థిక విషయాల్లో పెద్దల సహ కారం అందుకుంటారు. వృత్తిపరమైన సమావేశాలకు అనుకూలం.



## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

ఆరోగ్యం, పెట్టుబడులు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఆరోగ్యం మెరుగుపడుతుంది. 20, 21 తేదీల్లో భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగి స్తుంది. స్పెక్యులేషన్లు, పోటీల్లో విజయం సాధించే అవకాశం ఉంది. 22, 23 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన నిర్ణయాలకు తగిన సమయం కాదు. బంధుమిత్రుల ఆరోగ్యం కలవరపెడుతుంది. 24, 25 తేదీల్లో వృత్తిపరమైన అంచనాలు ఫలిస్తాయి. పెద్దలతో చర్చలు లాభిస్తాయి. రాజకీయ, సినీ రంగాల వారికి అనుకూలం.



## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

చిన్నారుల విషయాలు, పెట్టుబడులు, షాపింగ్, ఆరోగ్య విషయాలకు ఈ వారం అనుకూలం. బుధవారం ప్రేమానుబంధాలు బలపడతాయి. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. 20, 21 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపిం చాలి. కృషి రంగంలో కొత్త పరిచయాలు లాభిస్తాయి. 22, 23 తేదీల్లో స్పెక్యులేషన్లలో నష్టం సంభవం. విలువైన వస్తువుల కొనుగోలులో నాణ్యత గమనించాలి. 24, 25 తేదీల్లో రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. వాయిదా పద్ధతిలో వస్తువులు కొనుగోలు చేస్తారు. బ్యాంకులతో పనులు పూర్తవుతాయి. సంస్మరణల్లో పాల్గొంటారు.



## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

బదిలీలు, ప్రేమానుబంధాలు, వేడుకలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం బదిలీలు, మార్పులకు అను కూలం. విందు, వినోదాలకు ఏర్పాట్లు చేస్తారు. 20, 21 తేదీల్లో చొరవ లోపించడం వల్ల వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధించలేకపోతారు. చిన్నారుల విష యాల్లో శుభపరిణామాలు సంభవం. 22, 23 తేదీల్లో విందు వినోదాల్లో ఖర్చులు అధికం. భాగస్వామి సహకారం లోపిస్తుంది. 24, 25 తేదీల్లో ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. పెట్టుబడుల్లో సత్ఫలితాలు సాధి స్తారు.



## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

విద్యా విషయాలు, వేడుకలు, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం విద్యార్థులకు శుభప్రదం. కమ్యూనికేషన్లు, బోధన రంగాల వారికి ప్రోత్సాహకరం. 20, 21 తేదీల్లో ప్రియతములు, చిన్నారుల వైఖరి ఆవే దన కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ప్రోత్సాహకరం. 22, 23 తేదీల్లో ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 24, 25 తేదీల్లో విందు వినోదాల్లో పాల్గొంటారు. సన్నిహితుల ఆరోగ్యం మెరుగవుతుంది. కృషి రంగంలో లక్ష్యాలు సాధిస్తారు.






## చాక్లెట్ బాయ్ చదువు అంతేనా?

ప్రస్తుతం సినీరంగంలో పేరున్న హీరోహీరోయిన్లు కనీసం డిగ్రీ అన్నా పూర్తి చేస్తున్నారు. కొందరయితే ఉన్నత చదువులు చదివిన వారూ ఉన్నారు. కానీ బాలీవుడ్ చాక్లెట్ బాయ్ ఇమేజ్ సంపాదించుకున్న రణబీర్ కపూర్ మాత్రం టెన్త్ వరకే చదువుకున్నాడట! ఈ విషయాన్ని తన సినిమా ప్రమోషన్ సమయంలో బయటపెట్టాడు. అంతే కాకుండా ఇత గాడు మాత్రమే తమ కుటుంబంలో ఎక్కువ చదువుకున్నాడట! తండ్రి రిషికపూర్ ఎనిమిదో తరగతితోనే చదువుకు ఫుల్‌స్టాప్ పెట్టేస్తే రణబీర్ మాత్రం టెన్త్‌లో 56 శాతం మార్కులు తెచ్చుకోగలిగాడట! అన్ని మార్కులు వచ్చినందుకే తన తండ్రి తనను చూసి పొంగిపోయాడంటూ రణబీర్ చెప్పిన మాటలు విని అక్కడున్న వారు షాక్ తిన్నారట! అయితే చాలా మంది రణబీర్ మాటలను నమ్మడం లేదట! ఏదో పబ్లిసిటీ కోసం చెబుతున్నాడే తప్ప అందులో నిజం ఉండకపోవచ్చ నేది చాలా మంది అభిప్రాయం.

## ఆ సినిమాల లెక్క రాదట!



ఏదైనా తెలియని విషయాన్ని నిజాయి తీగా ఒప్పుకునే సంస్కారం కొద్దిమందికే ఉంటుంది. అలాంటి సంస్కారాన్నే చాటుకున్నారు టాలీవుడ్ లెక్కల మాస్టారు సుకుమార్. ఇటీవల జరిగిన 'ఫిదా' ఆడియో వేడుకలో తను 'బాహుబలి', 'హ్యాపీడేస్' వంటి సినిమాలు తీయలేనని నిజాయితీగా ఒప్పుకున్నారు. అలాంటి సినిమాలు తీయడం తన వల్ల కాదు అనేశారు. 'హ్యాపీడేస్' సినిమా లాంటి ప్రేమకథను తీయాలన్న ఉద్దేశంతో '100% లవ్' సినిమా మొదలుపెట్టాడట కానీ, చివరికి తన పంథాలోనే పూర్తి చేయవలసి వచ్చిందంటూ చెప్పుకొచ్చారు. ఆ ఆడియో వేడుకకు వచ్చిన వారందరూ మాస్టారి నిజాయితీకి ఫిదా అయిపోయారట!

## నష్టపరిహారం చెల్లిస్తున్న కండలవీరుడు



బాలీవుడ్ కండల వీరుడు సల్మాన్‌ఖాన్ తన సినిమా నిర్మాతలకు నష్టపరిహారం చెల్లించబోతున్నాడన్న వార్త ఇప్పుడు బాగా హల్‌చల్ చేస్తోంది. సల్మాన్ తాజా సినిమా 'ట్యూబ్‌లైట్' బాక్సాఫీసు వద్ద ఏమాత్రం వెలుగులు చిందించలేకపోయింది. దాంతో ఆ సినిమా నిర్మాతలకు భారీ ఎత్తున నష్టం వాటిల్లింది. ఈ విషయాన్నే వారు సల్మాన్ దృష్టికి తీసుకెళ్ళగా, తన వంతుగా 55 కోట్లు చెల్లిస్తానని సల్మాన్ వారికి ప్రామిస్ చేశాడట! ఇప్పుడు ఇదే న్యూస్ బాలీవుడ్‌లో బాగా హల్‌చల్ చేస్తోంది. సినిమా ఫ్లాపులతో హీరో హీరోయిన్లకి ఎలాంటి సంబంధం లేకపోయినా, సల్మాన్ పెద్ద మనసుతో నష్టపరిహారం చెల్లించడం చూసి మిగతా వారు కూడా ఇదే బాట పడితే మంచిది అంటున్నారు సినీ జనాలు.

## తాగితే అన్నీ మరచిపోతుందట!

సినిమా వారికి తాగుడు పెద్ద విషయం కాదు. వాళ్ళల్లో చాలా మంది తాగుతారన్న సంగతి అందరికీ తెలిసిందే! అలా తాగిన వారు ఎవరూ రోడ్డు మీద కానీ, పబ్లిక్ స్థలాల్లో కానీ గొడవ సృష్టించరు. కానీ ఒకప్పటి హీరోయిన్, ఇప్పటి క్యారెక్టర్ ఆర్టిస్టు ఊర్వశి తాగితే అన్నీ మరచిపోయి గొడవ గొడవ చేస్తుందట! తాజాగా ఓ మలయాళ టీవీ ఛానల్‌లో తాగొచ్చి గొడవ చేసినందుకు తన సంసారమే కూలిపోయిందంటూ ఓ బాధితురాలు పోలీసులను ఆశ్రయించిందట! అసలు సంగతేమిటంటే.... ఈ టీవీ కార్యక్రమాన్ని ఊర్వశి హోస్ట్ చేస్తోంది. ఈ కార్యక్రమానికి తాగొచ్చి నోటికొచ్చినట్టు మాట్లాడడంతో తన భర్తతో విభేదాలు ఎక్కువైపోయాయన్నది ఆ బాధితురాలి వాదన.



ఊర్వశి ఇలా గొడవ చేయడం ఇదే మొదటిసారి కాదనీ, గతంలో చాలా సార్లు ఇలాగే ప్రవర్తించిందనీ మాలీవుడ్ జనాలు అంటున్నారు. ఊర్వశి కుటుంబ కలహాలతో బాగా కలత చెంది తాగుడికి బానిస అయిందని కొందరు చెబుతున్నారు. ఎన్ని గొడవలున్నా ఇలా తాగొచ్చి బహిరంగ స్థలాల్లో గొడవ చేయడం ఏమిటని? కొందరు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు.

## దిద్దుబాటు చర్యల్లో తులసి



మొన్నటికి మొన్న 'మా' అధ్యక్షుడు, నటుడు శివాజీ రాజా మీద మాజీ హీరోయిన్ తులసి నోరు పారేసుకున్న సంగతి తెలిసిందే! ట్విటర్ సాక్షిగా ఆ నటుడిని అనకూడని మాటలన్నీ అనేసింది. తులసి నోటి దురుసుతనంపై మండిపడిన శివాజీరాజా చట్టపరమైన చర్యలకు సిద్ధమైపోయాడు. శివాజీరాజా నిజంగా న్యాయస్థానాన్ని లేదా పోలీసులను ఆశ్రయిస్తే తులసికి చిక్కులు తప్పవన్న వార్తలు బాగా హల్‌చల్ చేస్తున్నాయి. దీంతో తులసి దిద్దుబాటుచర్యలు మొదలెట్టేసింది. ఆ ట్విటర్ తనది కాదనీ, ఎవరో తన పేరు మీద క్రియేట్ చేసి శివాజీరాజాను అనరాని మాటలు అన్నారనీ, ఇందులో తనకెలాంటి పాపమూ తెలియదనీ చెబుతోంది. కావాలంటే తన ట్విటర్‌ను పరీక్షించుకోవచ్చని కూడా అంటోంది. ఇంత వివాదానికి కారణమైన ఆ ట్విటర్ మెసేజ్ ఇప్పుడు కనిపించకుండా పోయిందట!

మూడు 'అ'లు కలిస్తే స్టార్ హీరోయిన్ నయనతార అవుతుంది. ఎలాగంటారా...అందం, అభినయం, అదృష్టం మూడూ కలిసిన ఏకైక హీరోయిన్‌గా నయనతారను చెప్పుకోవచ్చు. మామూలుగా హీరోయిన్లు ఓ ఐదారు సంవత్సరాల పాటు ఓ వెలుగు వెలిగి ఆ తరువాత నెమ్మదిగా కనుమరుగవుతూ ఉంటారు. కానీ నయనతార మాత్రం దాదాపు పదిహేను సంవత్సరాలుగా హీరోయిన్‌గా కొన సాగుతూనే ఉంది. టాలీవుడ్, కోలీవుడ్, మాలీవుడ్ రంగాలలో లవ్ క్యారెక్టర్లు, సీరియస్ పాత్రలే కాకుండా హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమాలకి కేరాఫ్ అడ్రస్‌గా మారిన నయనతారతో....

# దానికోసం ఏదైనా చేస్తా

## -నయనతార

**దాదాపు పదిహేను సంవత్సరాలుగా హీరోయిన్‌గా కొనసాగుతున్నారు కదా, మీ సక్సెస్ రహస్యం?**

పెద్ద రహస్యం అంటూ ఏమీ లేదు. అదృష్టం కలిసి వచ్చింది అంతే! అసలు నాకన్నా అందగత్తెలు, నాకన్నా బాగా నటించేవారు చాలా మందే ఉన్నారు. వారికి లేని అదృష్టం నాకు ఉంది అంతే! అదృష్టంతో పాటు కష్టపడి పనిచేయడం నాకు కలిసి వచ్చింది. అదృష్టం ఉంది కదా అని పనిచేయడం మానేస్తే సినిమాలు ఉండవు. కష్టే ఫలి అన్న సూక్తిని నమ్ముతాను. అదే నా సక్సెస్ రహస్యం. టైం బాగుంటే అంతా బాగుంటుంది. ప్రస్తుతం నా టైం బాగుంది.

**వరుసగా హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమాలే చేయడానికి కారణం?**

అలాంటి సినిమాలు చేయడానికి ఇదే సరైన టైమ్. దాదాపు పది సంవత్సరాల పాటు గ్లామర్ పాత్రలే ఎక్కువ చేశాను. ఓ విధంగా చెప్పాలంటే ఆ పాత్రలంటే విసుగు అనిపించింది. ఓ సమయంలో సినిమాలు మానేద్దామా అని కూడా అనిపించింది. అలాంటి సమయంలో హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమాలో అవకాశం వచ్చింది. నా అదృష్టం కొద్దీ ఆ సినిమా మంచి విజయం అందుకోవడంతో వరుసగా అలాంటి సినిమాలే వస్తున్నాయి. అలాగని అన్నీ ఒకే రకమైన సినిమాలు చేయడం లేదు. డిఫరెంట్ కథల్నే ఎంచుకుంటున్నాను.

## దర్శకుడితో లవ్‌లో ఉన్నారన్న వార్త గురించి....

ప్రేమ మీద నాకు బోలెడంత నమ్మకం, గౌరవం ఉన్నాయి. దాని కోసం ఏదైనా చేయడానికి నేను ఎప్పుడూ సిద్ధమే! ప్రేమ గురించి దాచుకోవలసిన అవసరం నాకు లేదు. ప్రేమలో పడితే బహిరంగంగా మాట్లాడడానికి సంకోచించను. మీరన్నట్టు దర్శకుడితో ప్రేమలో పడితే ఆ విషయం అందరితో పంచుకుంటాను. ప్రేమలో నేను ఫెయిల్ అయిన మాట వాస్తవమే. అంత మాత్రాన ప్రేమ మీదా, వ్యక్తుల మీదా నాకు నమ్మకం పోలేదు. ఉంది.



**హీరోయిన్‌గా స్టార్ హీరోలతో చేశారు. కమెడియన్లతో కూడా జత కట్టడానికి కారణం?**

స్టార్ హీరో అయినా, కమెడియన్ అయినా బేసిక్‌గా నటులే కదా! హీరో అయినా, కమెడియన్ అయినా సినిమాలో నా పాత్ర ఎలాంటిదో చూసుకుంటాను. అది నేను చేయగలిగిన పాత్ర అయితే ఎవరితో చేయడానికి అయినా ఎలాంటి అభ్యంతరం లేదు.

**పారితోషికం ఎక్కువ ఇస్తే చిన్న నటులతో అయినా చేస్తారట నిజమేనా?**

చిన్న నటుడా? పెద్ద నటుడా? లేక కొత్త నటుడా? అని సినిమా తీసేవారు, దర్శకత్వం వహించేవారే చూసుకోవడం లేదు. కోట్లు పెట్టుబడి పెట్టి సినిమా తీసేవారే హీరో మీద అంత నమ్మకం ఉంచితే నేను ఎందుకు వారిని నమ్మకూడదు? అయినా సినిమాల్లోకి వచ్చిన కొత్తల్లో నేను చిన్న నటినే! ఆ సమయంలోనే రజనీకాంత్ సార్ సినిమాలో నటించే అవకాశం వచ్చింది. నేను చిన్న నటిని అని ఆయన నాతో చేయడం మానలేదు కదా? అంత పెద్ద స్టార్‌కే లేని పట్టింపు నాకు ఎందుకు? ఇక పారితోషికం అంటారా? మీరే అన్నారు కదా....పదిహేను సంవత్సరాలుగా ఈ ఫీల్డులో ఉన్నాననీ! మరి మిగతా హీరోయిన్లతో పోల్చుకుంటే నేను సీనియర్నే! సీనియర్‌కి కొంచెం ఎక్కువ పారితోషికం ఇస్తే తప్పేంటి? మిగతా ఉద్యోగాల్లో సీనియర్లకి ఎక్కువ జీతాలుండవా? మాకూ అంతే! అయినా నాకు ఎంత ఇవ్వాలో నా దర్శకనిర్మాతలకు బాగా తెలుసు. నేను అడిగాను కదా అని నాకు కోట్లు ఇవ్వరు కదా?

**కోలీవుడ్ సినిమాకి అసిస్టెంట్ డైరెక్టర్‌గా మారారట?**

ఇది పూర్తిగా అబద్ధం. సినిమాకి దర్శకత్వం వహించే ఉద్దేశం నాకు లేదు. నటన గురించి తప్ప సినిమా గురించి చాలా తక్కువ తెలుసు. సినిమా గురించి తెలియని విషయాలు తెలుసుకుంటున్నాను తప్ప సినిమా నిర్మించే ఉద్దేశం కానీ, దర్శకత్వం వహించే ఆలోచన కానీ నాకు లేవు, రావు.



**మిగతా హీరోయిన్ల మాదిరి సినిమా ప్రమోషన్లకు రాకపోవడానికి కారణం?**

ఈ విషయంలో ఇప్పటికే చాలా వివరణలు ఇచ్చాను. అయినా ప్రమోషన్లకి రాకపోవడానికి నా కారణాలు నాకుంటాయి. ఈ విషయాన్ని ముందుగానే నా దర్శకనిర్మాతలకు చెబుతాను. అందుకు ఇష్టపడిన వారే నాతో సినిమాలు చేస్తారు. నా పాలసీ నాది. దాన్ని నేను బ్రేక్ చేయలేను. అలాగే ఇంటర్వ్యూలు కూడా! వీటి వలన గతంలో చేదు అనుభవాలు ఎదురయ్యాయి. నేను ఒకటి చెబితే మరొకటి వచ్చేది. తిరిగి వాటిని ఖండించాల్సి వచ్చేది. ఇదంతా ఎందుకు? మీడియాకి దూరంగా ఉంటే సరిపోతుంది కదా అనిపించింది. అందుకే ఇంటర్వ్యూలకు దూరంగా ఉంటాను. ఎప్పుడో తప్ప ఇవ్వను. దాంతో నయనతారకి పొగరు అన్న బిరుదు కూడా ఇచ్చేశారు. అనవసరంగా గొడవల్లో ఇరుక్కుని తలనొప్పి తెచ్చుకునే కన్నా ఇలాంటి బిరుదులు పొందడం మంచిదే అనిపించింది.

**'ఉయ్యాలవాడ'లో చేయబోతున్నారట?**

దీని గురించి ఇప్పుడే చెప్పలేను. తరువాత మాట్లాడతాను.

**బాలీవుడ్‌లో చేసే ఉద్దేశం లేనట్టుంది?**

దక్షిణాదిన నాకు సౌకర్యంగానే కాదు, మంచి గుర్తింపు కూడా ఉంది. వీటిని వదులుకుని బాలీవుడ్‌కి వెళ్ళడం అంటే నీటి కోసం ఎండమావుల వెంట పరిగెత్తడం లాంటిదే!

**బాలీవుడ్ ఎండమావి లాంటిదా?**

పోలిక చెప్పాను కానీ, ఎండమావి అనలేదు కదా! బాలీవుడ్ వాతవరణం నాకు సరిపడదు.

**ఇన్ని సంవత్సరాల సుదీర్ఘ ప్రయాణంలో ఈ రంగంలో నేర్చుకున్నది?**

ఎన్నికష్టాలు ఎదురైనా ఎంత నష్టం వాటిల్లినా ఆత్మవిశ్వాసం కోల్పోకూడదు. ముందుకు సాగుతూ పోవాలి. మన పని మనం చేసుకోవాలే తప్ప అనవసర విషయాల గురించి మాట్లాడకూడదు. ముఖ్యంగా మనకు తెలియని విషయాల గురించి ఎంత మౌనంగా ఉంటే అంత మంచిది.

**సినిమాల్లోకి రాకపోయుంటే....?**

మంచి డ్యాన్సర్‌గా గుర్తింపు తెచ్చుకునేదాన్ని. మంచి ఇల్లాలుగా పేరు సంపాదించేదాన్ని.

**ఖాళీ సమయాల్లో...**

పార్టీలంటూ పబ్‌ల వెంట తిరగడం నాకు ఇష్టం ఉండదు. ఇంట్లోనే కూర్చుని పాత పాటలు వింటూ ఉంటాను. అమ్మ చేత నాకు ఇష్టమైనవి చేయించుకుని తింటాను. అయినా ఇటీవలి కాలంలో నాకు తీరిక అంటూ దొరకడం లేదు. వరుస సినిమాలు చేస్తూనే ఉన్నాను.

**కాబోయే భర్త గురించి...**

ఈ రంగానికి చెందిన వ్యక్తి అయితే బాగుంటుందని నా అభిప్రాయం. నా అభిరుచులనూ, నా వృత్తినీ గౌరవించే వ్యక్తి అయి ఉండాలి. నాతో పాటు నా కుటుంబ సభ్యులను కూడా ప్రేమగా చూసుకోవాలి. ఇవి కాకుండా చాలా లక్షణాలు కలిగి ఉండాలి. అవన్నీ చెబితే చాలా పెద్ద లిస్టే అవుతుంది.

**నయనతారకు కోపం ఎక్కువంటారు. ఎంత వరకు నిజం?**

వాస్తవాలు మాట్లాడితే అలాగే అనిపిస్తుంది. నా మాటలను నిదానంగా ఆలోచిస్తే వాటి అర్థం బోధపడుతుంది. నేను ఎలా ఉన్నా నన్ను విమర్శించేవారు విమర్శిస్తూనే ఉంటారు. వారి గురించీ వారి మాటల గురించీ పట్టించుకోను.

**ఈ రంగంలోకి వచ్చిన తరువాత బాధపడిన సందర్భం?**

దాదాపు లేదనే చెప్పాలి. వృత్తిపరంగా బాధపడలేదు. కానీ వ్యక్తుల కారణంగా బాధపడ్డాను. అది నా వ్యక్తిగతం. దానికీ, సినిమాలకీ ముడిపెట్టడం మంచిది కాదు.

–స్పందన రెడ్డి

ఇంటర్వ్యూ



**తన నాట్యంతో ప్రేక్షకులను ఉర్రూత లూగించిన నటి, డ్యాన్సర్ అనురాధ. తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ, హిందీ భాషల్లో నాలుగు దశాబ్దాలుగా 700 చిత్రాల్లో నటించారామె. మంచి కుటుంబ కథా చిత్రాలు రావాలనీ, టెక్నాలజీ ఒక్కటే చాలదు, హెల్దీ చిత్రాలు కూడా రావాలనీ అంటారామె. చక్కటి భాష, ఉచ్చారణ తెలిసిన పాత నటులను యువ దర్శకులు గుర్తించి అవకాశాలిచ్చి ఆదుకోవాలంటున్న అనురాధ ఇంటర్వ్యూ.....**

మా నాన్నగారి పేరు ఎం.కె.కృష్ణకుమార్. అమ్మ సరోజ. చెన్నై కోడంబాకంలో జన్మించాను. అక్కడే థర్డ్‌క్లాస్ వరకు ఫాతిమా కాన్వెంట్‌లో, టెన్త్ వరకు సరస్వతి విద్యాలయంలో చదువుకున్నాను. బాల్యంనుండి నాట్యం నేర్చుకున్నాను. భరత నాట్యంలో నా గురువు మా నాన్నగారే. ఆయన దగ్గరే నాట్యంలో ప్రావీణ్యం సంపాదించాను. చదువు కునేరోజుల్లోనే మొదటిసారి నాకు సినిమా అవ కాశాలు వచ్చాయి. నేను సినిమాల్లో నటించడం అమ్మానాన్నలకు ఇష్టమే.

# యువ దర్శకులు పాత నటుల్ని గుర్తించాలి

## –డ్యాన్సర్ అనురాధ

### మలయాళ చిత్రం

మలయాళచిత్రంతో సినిమారంగంలోకి అడుగు పెట్టాను. నా మొదటి చిత్రం 'ఇని అవళ్ ఉరన్‌గట్టె'. ఈ చిత్రంలో అవకాశం ఎలా వచ్చిందంటే, ప్రముఖ మలయాళ దర్శకులు, రచయిత కె.జి.జార్జి గారు. కేరళ రాష్ట్ర ప్రభుత్వం నుండి వివిధ చిత్రాలకు తొమ్మిది అవార్డులు పొందిన దర్శకులు. ఆయన నన్ను ఒక ఫంక్షన్‌లో చూసి, 'నేను నిర్మించే చిత్రంలో నటిస్తావా?' అని అడిగారు. వెంటనే ఒప్పుకున్నాను. ఈ చిత్రంలో సుకుమారన్ హీరో. గోపీమీనన్‌గారు నిర్మాత. 1978లో ఈ సినిమా విడుదలైంది.

అమ్మా నాన్న నాకు పెట్టిన అసలు పేరు సులోచన. జార్జ్‌గారు నా పేరును అనురాధగా మార్పు చేశారు. అలా మార్పు చేయడం నాకు ఎంతగానో నచ్చింది. మొదటి సినిమాతోనే నా పేరు అనురాధగా మారిపోయింది.

### తెలుగు చిత్రం పంచకల్యాణి

నేను నటించిన మొదటి తెలుగు చిత్రం 'పంచకల్యాణి'. తమిళంలో ఇది సూపర్‌హిట్ చిత్రం. తెలుగులో రీమేక్ చేశారు. చంద్రమోహన్, నాగభూషణం, నూతన ప్రసాద్, రమాప్రభ నటించారు. ఎస్.ఎస్.రాజు దర్శకత్వం. 1980లో విడుదలైంది.

ఆ రోజుల్లో నేను నటించిన వాటిల్లో ఎన్నో మంచి చిత్రాలున్నాయి. కౌబాయ్ నెంబర్ 1, గంధర్వ కన్య, లవ్ ఇన్ సింగపూర్. తమిళంలో కూడా ప్రేక్షకులు నా నటనను ఎంతగానో ఆదరించారు. హిందీలో 'హైసియత్', 'బలిదాన్', 'ప్యార్ కర్‌కే దేఖా', 'మచ్లీ జవాని' ప్రేక్షకులు మెచ్చినచిత్రాలు. 1990–2010 మధ్యకాలంలో తెలుగులో విడుదలైన చిత్రాల్లో మగమహారాజు, మహారాజు, రేపటిపౌరులు, ఒరేయ్ రిక్షా చిత్రాల్లో నా నటన నాక్కూడా ఎంతో నచ్చింది. వాటిని మరచిపోలేను. ముఖ్యంగా దాసరి నారాయణరావుగారి దర్శకత్వంలో వచ్చిన 'ఒరేయ్ రిక్షా'లో నాకు చాలా మంచి పాత్ర ఇచ్చారు. ఆర్. నారాయణమూర్తిగారు నా నటనను ప్రత్యేకించి ఎంతో మెచ్చుకున్నారు. 2010లో విడుదలైన 'మాయా బజార్' చిత్రం కూడా మరువలేనిది.

### ఈలలతో థియేటర్లు దద్దరిల్లేవి

ఇప్పటివరకు పలు భాషల్లో 700 చిత్రాలకు పైగా నటించాను. ప్రేక్షకుల ఈలలతో సినిమా హాల్స్ దద్దరిల్లే రోజులవి. ఇప్పటికీ నాకు గుర్తే. నేను నటించిన రెండు మూడు చిత్రాలు చెన్నై థియేటర్లో చూశాను. ప్రేక్షకులు ఈలలువేస్తూ, హర్షధ్వానాలు చేయడం, కలర్స్ జల్లడం, చిల్లర పైసలు విసరడం లాంటివి నేను చూశాను. ఆ దృశ్యాలు నాకు గుర్తుకు వచ్చినప్పుడల్లా ఎంతో సంతోషంగా ఉంటుంది. నా వ్యాంప్ పాత్రల్ని ఆదరించిన ప్రేక్షకులకు ధన్యవాదాలు.

### సమయపాలన ముఖ్యం

షూటింగ్ విషయంలో నేను సమయం పాటిస్తాను. అరగంట ముందే షూటింగ్ స్పాట్‌కి చేరుకునేదాన్ని. నా కెరీర్‌లో షూటింగ్‌కు ఎప్పుడూ లేటుగా వెళ్ళలేదు. దర్శకులతో ఎన్నడూ మాటపడలేదు. సమయం పాటించాలనేదే నా సెంటిమెంట్. ఒకసారి బెంగళూరులో ఒక కన్నడచిత్రం షూటింగ్ చేశారు. చెన్నైలో విమానాశ్రయానికి వెళ్ళేసరికి విమానం

వెళ్ళిపోయింది. ఇక నేను తిరిగి ఇంటికివచ్చి నా సొంత కారు డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళిపోయాను. కరెక్టుగా షూటింగ్ సమయానికి బెంగళూరు చేరు కున్నాను. అయితే దర్శకుడు మాత్రం వాయిదా వేసేవాణ్ణికదా అన్నారు. లక్షలు ఖర్చు చేసి సెట్టింగ్స్ వేసుకుంటారు కదా? మనం వాళ్ళని ఇబ్బంది పెట్టకూడదనేదే నా పాలసీ. తర్వాత నన్ను తిరుగు ప్రయాణంలో విమానంలో పంపారు. డ్రైవర్‌తో కారు ఇంటికి పంపించారు దర్శకుడు సోమశేఖర్‌గారు.

### నటి సావిత్రి నాకెంతో ఇష్టం

పరిశ్రమలో చాలామంది దర్శకుల చిత్రాల్లో నేను వ్యాంప్ పాత్రలు, క్యారెక్టర్ పాత్రలు చేశాను. ముఖ్యంగా దర్శకశిఖరాలు రాఘవేంద్రరావు, దాసరి నారాయణరావు, కోదండరామిరెడ్డి, క్రాంతికుమార్, విజయబాపినీడు, రవిరాజా పినిశెట్టిగార్ల చిత్రాల్లో నటించాను.

అన్నింటికంటే ముఖ్యంగా చెప్పాల్సింది మహా నటి సావిత్రిగారి గురించి. ఆవిడ ఒక లెజెండ్. ఆవి డకు నేను పెద్ద అభిమానిని. మా అమ్మగారితో షూటింగ్‌కు వెళుతున్నప్పుడు నేను ఆమెను చూస్తూ ఉండేదాన్ని. ఎంతో ఆప్యాయంగా మా అమ్మను ఆవిడ పలకరిస్తూ ఉండేది. నన్ను ఎంతో ఆదరంగా చూసేది. సావిత్రిగారు నటించిన 'నాదీ ఆడజన్మే' ఒక అద్భుతచిత్రరాజం. ఇప్పటికీ ఆ చిత్రాన్ని మరువ లేను. ఆమెతో నటించే అవకాశం వస్తే బాగుం డును అనుకున్నాను. కానీ నాకా అవకాశం రాలేదు. అదెప్పుడూ నా దురదృష్టంగా భావిస్తాను.

### ఇదే తన చివరిచిత్రం అన్నారు టి.కృష్ణ

ప్రముఖ హీరో గోపీచంద్ తండ్రిగారు, దివం గత ప్రముఖ దర్శకులు టి.కృష్ణగారి చిత్రం 'రేపటి పౌరులు'లో నేను నటించాను. అప్పటికి ఆయన కేన్సర్‌తో బాధపడుతున్నారు. నన్ను తల్లిపాత్ర పోషించమని మా తల్లిగారిని వచ్చి కోరారు. అప్పుడు ఆయన చెప్పిన మాటలివి, "ఇదే నా చివరి చిత్రం. నాకు కేన్సర్ వచ్చింది. ఈ విషయం కొద్ది మందికే తెలుసు. ఎలాగైనా ఈ చిత్రాన్ని పూర్తి చెయ్యాలి. మీ అమ్మాయి అనురాధకు ఈ పాత్రతో మంచి పేరు వస్తుంది, తల్లి పాత్ర అని ఆలోచించ వద్దు" అని అభ్యర్థించారు. అమ్మ వెంటనే అంగీక రించింది. వెంటనే నేనూ ఒప్పుకున్నాను. ఆయన హాస్పిటల్‌లో ఉంటూ మధ్య మధ్యలో షూటింగ్‌కు వచ్చి వెళుతూ, డైలాగ్ ఇలా కాదమ్మా, అలాగ అంటూ గైడెన్స్ ఇచ్చివెళ్ళేవారు.

### తల్లిపాత్ర

రేపటిపౌరులు చిత్రంకోసం టి.కృష్ణ గారు చేసిన కృషి ఇప్పటికీ నేను మరువలేను. కేన్సర్‌తో బాధపడుతూ కూడా ఎంతో చిత్తశుద్ధితో ఆ చిత్రం పూర్తిచేసి తన దృఢదీక్ష నిరూపించుకున్నారు టి.కృష్ణ. ఆ చిత్రం ఎంతో విజయవంతంగా ఆడటమేకాదు, నా పాత్రను కూడా ప్రత్యేకించి అభినందించారు పరిశ్రమలో ఎంతోమంది. నేను తల్లిపాత్ర చేసిన మొదటి చిత్రం అదే. అలా నేను క్యారెక్టర్ పాత్రల్లోకి ప్రవేశించాను. ఈ చిత్రాన్ని ఎన్నటికీ మరువలేను. పి.వెంకటేశ్వరరావుగారు నిర్మాత. రాజశేఖర్, కోట శ్రీనివాసరావు, సుత్తివేలు, రాళ్ళపల్లి, పి.ఎల్.నారా యణ, విజయశాంతి తదితరులు నటించిన ఈ చిత్రం 1986లో విడుదలైంది.

### సీనియర్ నటుల స్ఫూర్తి

ప్రముఖ నర్తకీమణులు జ్యోతిలక్ష్మి, విజయ లలిత నా కంటే బాగా సీనియర్లు. నర్తకిగా నాకు బాగా పేరు రావడానికి కారణం వారి స్ఫూర్తి. మరో ముఖ్యమైన డ్యాన్సర్ డిస్కోశాంతి. ఆమె నాతోపాటే నటించేది. మేమిద్దరం కలిసిమెలిసి అన్యోన్యంగా ఉండేవాళ్ళం. శ్రీహరి మరణంతో ఆమె జీవితంలో తీరనిలోటు ఏర్పడింది. వారిది ప్రేమ వివాహం. హైదరాబాద్ వచ్చినప్పుడల్లా తప్పకుండా డిస్కోశాంతిని కలిసివెళ్ళేదాన్ని. ఆమెను నా చెల్లెలులా చూసుకుంటాను. షి ఈజ్ వెరీ నైస్ లేడీ. మనసులో ఏదీ దాచుకోదు. అన్నీ ఓపెన్‌గా చెబుతుంది. మేమిద్దరం చాలా క్లోజ్‌గా ఉండేవాళ్ళం.

### టీవీ సీరియల్స్

ప్రస్తుతం టీవీ సీరియల్స్‌లో నటిస్తున్నాను. తమిళంలో ఇప్పటికే సీరియల్స్‌లో నటించాను. 'ముత్తారమ్', 'దేవి అమగల్ సీరియల్స్‌లో నా నటనకు మంచి పేరు వచ్చింది. ప్రస్తుతం తమి ళంలో 'గంగ' సీరియల్‌లో నటిస్తున్నాను. ఇందులో నా నటనకు ప్రేక్షకుల నుండి మంచి రెస్పాన్స్ వస్తోంది.

### పసలేని సన్నివేశాలు

ఇది డిజిటల్ యుగం. టెక్నాలజీ పరంగా సినిమా రంగంలో అద్భుతమైన మార్పులు వచ్చాయి. అప్ప టికీ ఇప్పటికీ చాలా మార్పు వుంది. డైలాగ్ డెలి వరీకోసం అప్పట్లో ముందే ఏర్పాట్లు ఉండేవి. ఇప్పుడు ఆన్ ద స్పాట్‌లోనే డైలాగ్స్ ఇస్తున్నారు. గతంలో షూటింగ్, డెవలపింగ్, ఎడిటింగ్ చాలా శ్రమతో కూడుకునేవి. ఇప్పుడన్నీ సులభంగా అవు తున్నాయి. కాకపోతే ఈనాటి చిత్రాల్లో సబ్జెక్ట్ ఉండ టంలేదు. ప్రేమ, పగ, ద్వేషం అంతే. కుటుంబ కథా చిత్రాలకు ప్రాముఖ్యం ఇవ్వాలని కోరుకుంటు న్నాను. క్యారెక్టర్లు నిర్ణయించడంలో కూడా దర్శ కులు సరిగ్గా ఆలోచించడంలేదనిపిస్తుంది. పసలేని సన్నివేశాలతో కాలం వెళ్ళదీస్తున్నారు. ఏవో రెండు మూడు కుటుంబ కథా చిత్రాలు తప్ప అన్నీ ఫ్లాప్ దారి పడుతున్నాయి. టెక్నాలజీ పెరగడంవల్ల ఈ నాటి దర్శకులు బ్రెయిన్‌కి పదునుపెట్టడం తగ్గించా రనిపిస్తుంది. భవిష్యత్తులో యువ దర్శకులు ఉత్తమ చిత్రాలు అందిస్తారని ఆశిస్తున్నాను. హెల్దీ టెక్నా లజీ ఉంటే సరిపోదు, హెల్దీ సినిమాలు రావాలి. అదే నేను మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

### పాత నటుల్ని గుర్తించాలి

పాత తరం నటులు చెట్టుకొకరు, పుట్టకొకరుగా ఉన్నారు. వారిలో చాలామంది సరైన ఇల్లు కూడా లేని పరిస్థితుల్లో జీవితాలు గడుపుతున్నారు. అందువల్ల వారికి ప్రస్తుత చిత్రాల్లో తగిన పాత్రలు ఇచ్చి ప్రోత్సహించాలని యువ దర్శకులను కోరు కుంటున్నాను. మంచి నడవడికతో ఇచ్చిన అవ కాశాలు సద్వినియోగం చేసుకోగల శక్తి సామ ర్థ్యాలు, చక్కటి భాష, ఉచ్చారణ గల నటులు ఎందరో ఉన్నారు. వారికి అవకాశాలు లేవు. యువ





దర్శకులు వారిని గుర్తించి అవకాశాలు ఇస్తే ఆనాటి నటులకు న్యాయం చేసినవారవుతారు.

### కుటుంబం

మావారి పేరు సతీష్‌కుమార్. మాకు ఇద్దరు పిల్లలు. అమ్మాయి అభినయ. అబ్బాయి కాళిచరణ్. అభినయ సినిమా నటి. కొరియోగ్రఫీ చేస్తోంది. అబ్బాయిని ఇంట్లో అందరం కెవిన్ అని పిలుస్తాం. ప్రస్తుతం తమిళ చిత్రాల్లో నటిస్తున్నాడు. నాకు ఇష్టమైన ఆహారం మటన్ ఫిష్. కానీ నా ఫేవరెట్ మాత్రం మటన్.

**–కె.హరనాథ్**

**సెల్: 97035 42598**



# నూరుకట్ల పిశాచం కథలు ③

-వసుంధర

**అనగా అనగా వింధ్యారణ్య ప్రాంతాల్లో ఓ పల్లెటూరు. ఆ ఊళ్లో శివుడు, పార్వతమ్మ అనే దంపతులున్నారు. వారికి ఎంతకాలానికీ బిడ్డలు కలగలేదు. అప్పుడు ఆ దంపతులు వింధ్యారణ్యంలోనికి వెళ్ళి, వెతికి వెతికి ఓ ఋషిని కనుగొన్నారు. అతడికి తమ బాధ చెప్పుకున్నారు. ఋషి బాగా ఆలోచించి, "బిడ్డలు కలగాలని బ్రహ్మదేవుడు మీ నొసట వ్రాయలేదు. కొంతవరకూ సాయపడగలను కానీ నా శక్తి పరిమితమైనది. అందు వల్ల, బాగా ఆలోచించుకుని చెప్పండి. అప్సరసలా ఉండి, పదహారేళ్ళు మాత్రమే బ్రతికే కూతురు కావాలా, పరమ వికారంగా ఉండే మహా బలుడూ, చిరాయువూ అయిన కొడుకు కావాలా మీకు?" అన్నాడు.**

దంపతులిద్దరూ బాగా ఆలోచించి, "కాకిపిల్ల కాకికి ముద్దంటారు. ఎలా ఉంటేనేం, కలకాలం బ్రతికే కొడుకునే కోరుకుంటున్నాం!" అని చెప్పారు. "తథాస్తు" అన్నాడు ఋషి. వాళ్ళు తిరిగి తమ ఊరికి వెళ్ళి గడపసాగారు.

ఆ దంపతులు తమ కొడుక్కి మహాబలుడు అని పేరు పెట్టారు. పేరుకు తగ్గట్టే వాడిది అమిత బలం. వట్టి చేతుల్తో సింహాన్ని లొంగదీసేవాడు. ఆ అన్నాడు.

తండ్రి మాటలు వినగానే మహాబలుడికి ఆవేశం పొంగుకొచ్చింది. పరుగునవెళ్ళి గ్రామాధి కారిని అటకాయించాడు.

# బుల్లిపెట్టెలో రాక్షసుడు

పోయారు.

కొంతకాలానికి ఆ దంపతులకు ఓ కొడుకు కలి గాడు. ఋషి చెప్పినట్లే శిశువు ముఖం చాలా వికా రంగా ఉన్నది. ఊళ్లో వారందరూ ఆ శిశువు గురించి విడ్డూరంగా చెప్పుకున్నారు. విషయం గ్రామాధి కారికి కూడా తెలిసింది. ఆ దంపతులకూ, గ్రామాధి కారికీ చాలాకాలంగా గొడవలున్నాయి. అందుకని ఆయన వాళ్ళింటికి వెళ్ళి ఆ శిశువును బాగా పరిశీ లనగా చూసి, "ఇలాంటి శిశువు పుట్టడం ఊరికి అరిష్టం. ఈ శిశువు రాక్షస సంజాతుడు. కాబట్టి మీరు ఈ శిశువును అడవిలోనైనా వదిలి పెట్టండి. లేదా మీరు ఈ గ్రామం వదిలి వెళ్ళిపొండి. ఇది నా శాసనం" అన్నాడు.

ఆ శిశువును చూడగానే రాక్షస సంజాతుడనే అనిపిస్తుంది. శిశువు కురూపే కాదు, భయంక రంగా కూడా ఉన్నాడు. అందుకని ఈ విషయంలో ఊళ్లో చాలామంది గ్రామాధికారిని సమర్థించారు. చూస్తూచూస్తూ, ఏ తల్లిదండ్రులు తమబిడ్డను వదులుకుంటారు? అందులోనూ లేకలేక కలిగిన బిడ్డ కదా! అందుకని ఆ దంపతులు తమ బిడ్డను తీసుకుని అరణ్యానికి వెళ్ళిపోయారు. అక్కడ ఓ కొండగుహలో నివాసం ఏర్పరచుకుని, అడవిలోని కందమూలాలూ అవీ తెచ్చుకుని తింటూ కాలం

అడవిలో జంతువులన్నీ వాడంటే భయపడిపోతూ ఉండేవి.

శివుడు చిన్నప్పటినుంచీ మహాబలుడికి ఎందరో రాజకుమారుల విచిత్ర గాథలు చెప్పాడు. అవన్నీ విని, తానూ అంత గొప్పవాడినని అనుకునేవాడు మహాబలుడు.

శివుడికి చిత్రకళ తెలుసు. ఆయన బొమ్మలు గీసి రాజకుమారులు ఎలా ఉంటారో కొడుక్కి చూపించేవాడు. మహాబలుడికి తానెలాగుంటాడో తెలియదు. తానెలా ఉంటానో చెప్పమని తండ్రిని వేధిస్తుంటే, ఆయన అందమైన ముఖంతో బొమ్మ వేసి, "నువ్విలాగుంటావు" అన్నాడు. మహాబలుడు అదే తన రూపం అనుకున్నాడు. ఆ రూపం వాడి మనసులో హత్తుకుపోయింది. తన అందాన్ని తలు చుకుని తెగ మురిసిపోయేవాడు. ఒకరోజు మహా బలుడు తండ్రితో కలిసి అడవిలో తిరుగుతుండగా, దూరంగా ఓ వ్యక్తి తటస్థపడ్డాడు. అతడే శివుణ్ణి గ్రామంనుంచి తరిమివేసిన గ్రామాధికారి!

శివుడు మహాబలుడితో, "ఆ కనిపించేవాడు ఒకప్పుడు మనం ఉండే ఊరికి గ్రామాధికారి. పరమ దుర్మార్గుడు. మనకి శత్రువు. వాడి మూలం గానే మనం మనుష్యుల మధ్య కాక, ఇలా అడవిలో ఉండాల్సివచ్చింది. వాణ్ణి నా దగ్గరకు తీసుకుని రా"

గ్రామాధికారి చేతిలో చిన్న సంచీ ఉన్నది. ఆయన మహాబలుడి భయంకర రూపం చూచి హడలిపోయి, కెవ్వున కేకవేసి, తన చేతిసంచీని జారవిడిచాడు. అప్పుడు అందులోంచి అద్దం ఒకటి కింద పడింది. సూర్యరశ్మి పడి అద్దం తళతళ లాడింది.

మహాబలుడు అద్దాన్ని ఎప్పుడూ చూడలేదు. అతడు చటుక్కున చూస్తే, అందులో అతడి ప్రతి బింబం కనిపించింది. అంతటి భయంకర రూపాన్ని మహాబలుడు ఎప్పుడూ చూచి ఉండకపోవటంతో కెవ్వుమని అరిచాడు.

గ్రామాధికారి అప్పటికే తేరుకున్నాడు. తన ఎదురుగా ఉన్న భయంకర రూపుడు దేన్నో చూచి భయపడ్డాడని గ్రహించి కాస్త ధైర్యం తెచ్చుకుని, "ఏమైంది?" అనడిగాడు.

"ఇందులో మహాభయంకరమైన రాక్షసుడున్నాడు. వాణ్ణి నువ్వు ఎలా దాచావు?" అనడిగాడు మహా బలుడు.

"రాక్షసుడూ లేడు, నా బొందాలేదు. నీ ముఖమే నీకు కనిపించి ఉంటుంది?" అన్నాడు గ్రామాధికారి.

"అదేం కాదు, నా ముఖం ఎంతో అందంగా ఉంటుంది" అన్నాడు మహాబలుడు గర్వంగా.

అలాగని ఎవరు చెప్పారని గ్రామాధికారి అడి



గితే, "మా నాన్న!" అని బదులిచ్చాడు మహాబలుడు. మొత్తంమీద గ్రామాధికారి మహాబలుణ్ణి మాటల్లోపెట్టి వాడిద్వారా, జరిగినదంతా తెలుసుకున్నాడు. "నాకు అర్థమౌతోంది. ఈ బుల్లిపెట్టెలో మాయారాక్షసుడు ఉన్నాడు. వాడి సాయంతోనే నువ్వు గ్రామాధికారివయ్యావు" అన్నాడు మహాబలుడు చివరికి.

అది వినగానే గ్రామాధికారి తలలో ఏదో ఆలోచన తళుక్కుమని మెరిసింది. ఆయన ఇలా అన్నాడు. "నువ్వు చాలా తెలివైనవాడివి. అందుకే నిజం తెలుసుకోగలిగావు. నాదగ్గరున్న బుల్లిపెట్టెలో రాక్షసుడు నేనెలా చెబితే అలా వింటాడు. నువ్వు నాదారి అడ్డుకోనప్పుడు వాడు నీకు కనిపించడు. నువ్వు నేను చెప్పినట్టల్లా విన్నావా, సరేసరి! లేదా, వాడిని నీ మీదకు వదుల్తాను. రాక్షసుల ముందు, మనుషుల బలం ఏ మాత్రం పనికిరాదు."

దేనికీ భయపడని మహాబలుడు అద్దంలోని తన ప్రతిబింబానికి భయపడ్డాడు. అతడు గ్రామాధికారి చెప్పినట్లు వినటానికి సిద్ధపడ్డాడు. అప్పుడు ఇద్దరూ కలిసి శివుడి దగ్గరకు వెళ్ళారు. గ్రామాధికారి శివుణ్ణి పక్కకు పిలిచి, "నీ కొడుకు చాలా అందగాడినని అనుకుంటున్నాడు. నా దగ్గర అద్దంలోని ప్రతిబింబం చూసి వేరెవరో అనుకుని భయపడ్డాడు. వాడికి నిజం చెప్పేయమంటావా? నేను చెప్పినట్లు వింటావా?" అన్నాడు.

"నువ్వు చెప్పినట్లే వింటాను. కానీ, నాకొడుక్కి తనరూపం గురించిన నిజం ఎప్పటికీ తెలియనివ్వనని నాకు మాటివ్వాలి" అన్నాడు శివుడు.

ఒకరి షరతుకి ఒకరు ఇద్దరూ ఒప్పుకున్నారు. తర్వాత గ్రామాధికారి ముందుగా తాను ఒక్కడూ తన గ్రామం చేరుకున్నాడు.

తర్వాత ఆయన ఊళ్లో ముఖ్యుల్ని సమావేశపరచి, "మన దేశ రాజుగారు ఒక కొత్తశాసనం చేశారు. ఆ ప్రకారం కొంతకాలంపాటు మన గ్రామంలో అద్దం అనేది ఉండకూడదు. ఈ శాసనానికి కారణం నాకు తెలియదు. కానీ ఎవరింట్లోనైనా అద్దం కనబడితే, వాళ్ళకు మరణశిక్ష విధించడం జరుగుతుంది. ఈ విషయం పరిశీలించడానికి, నాలుగురోజుల్లో రాజుగారు మన ఊరుకి వస్తున్నారు" అన్నాడు.

ఈ వార్త విని, ఊరంతా గగ్గోలెత్తి పోయింది. ఊళ్లోని అద్దాలన్నీ గ్రామాధికారి ఇంటికి చేరాయి. ఆయన వాటినన్నింటినీ పిండిపిండి చేయించి గోతుల్లో పోయించాడు. నాలుగు రోజుల తర్వాత అడవికివెళ్ళి మహాబలుడినీ, వాడి తలిదండ్రుల్నీ వెంటబెట్టుకుని గ్రామానికి తీసుకొచ్చాడు.

**భయంకర రూపంతో జన్మించాడు ఆ బాలుడు. అడవిలోనే పెరిగి పెద్దవాడయ్యాడు. ఒకనాడు ఓ బాటసారిని అటకాయించాడతను. బాటసారి దగ్గరున్న అద్దంలో తన రూపం చూసుకుని కెవ్వుమని కేకపెట్టాడు. ఆ బుల్లిపెట్టెలో రాక్షసుడున్నాడని భయపడ్డాడు. బాటసారి మెల్లిగా భయం నుండి తేరుకుని ఆ భయంకరరూపి వివరాలన్నీ రాబట్టాడు. ఆనక తెలివిగా ఒక పథకం వేశాడు. ఏమిటా పథకం? అసలెవరా బాటసారి?**



శివుడి కుటుంబానికి గ్రామాధికారి ఇంటనే వసతి ఏర్పాటైంది. ఆ రోజునుంచీ గ్రామాధికారి ఆ గ్రామానికి చండశాసనుడయ్యాడు. గ్రామస్థులు అందరూ గ్రామాధికారి ఏం చెబితే అది చేయాలి. ఆయన ఏది ఇమ్మంటే అది ఇవ్వాలి. ఆయన నృత్యం చేయమంటే, ఆ ఊళ్లో ఆడవాళ్లు కూడా కాదనకుండా నృత్యం చేయాలి. చెప్పిన మాట వినకపోతే, గ్రామాధికారి మహాబలుడిచేత వారిని శిక్షింపజేసేవాడు. మహాబలుడి పేరు చెబితేనే గ్రామస్థులు భయంతో విపరీతంగా వణికి పోసాగారు.

మహాబలుడి అండతో గ్రామాధికారి మంచిపనులు చేసి ఉంటే ఎంతో బాగుండేది. ఆయన వాడిని అన్నీ చెడ్డపనులకే ఉపయోగించుకున్నాడు. ఊళ్లో ఉన్న ముసలివాళ్ల మధ్య కుస్తీ పోటీలు పెట్టేవాడు. మనిషికీ తోడేలుకీ పోటీలుపెట్టి వినోదించేవాడు. ఈ దుష్కృత్యాలు మహాబలుడికీ నచ్చాయి. ఒకోసారి గ్రామాధికారి చెప్పకుండానే వాడు తనకి తానుగా వెళ్ళి ప్రజల్ని హింసించేవాడు. ఈ బాధలు ఎలా తట్టుకోవాలో ప్రజలకు తెలియకుండాపోయింది. అనుకోని ఉపద్రవంగా ఊళ్లోకి వచ్చిపడ్డ మహాబలుడిని అందరూ తిట్టుకోసాగారు.

జరుగుతున్నదంతా శివుడికి తెలుసు. ఇదంతా ఆయనకి చాలా బాధ అనిపించింది. తన కొడుకు ప్రజలను బాధించడం ఒక ఎత్తయితే ఆయనకు అంతకంటే ఎక్కువ బాధ కలిగిస్తున్న విశేషం మరొక్కటుంది. ఏ గ్రామాధికారివల్లనైతే తమ జీవితం అడవుల పాలైందో, ఆయనకే తన కొడుకు పూర్తిగా బానిసగా మారిపోయాడు. తన కొడుకు సర్వశక్తి సంపన్నుడై ఉండి కూడా తన శత్రువుకు ఊడిగం చేస్తున్నాడు.

కొన్నాళ్లయ్యేక ఇక ఊరుకోలేక, శివుడు ఓసారి కొడుకుని రహస్యంగా పిలిచి నిజం చెప్పేయాలని అనుకున్నాడు. అది తెలిసిన శివుడి భార్య పార్వతమ్మ భర్తతో, "ఇప్పుడైతే గ్రామాధికారి వీణ్ణి ఎంతోకొంత అదుపు చేస్తున్నాడు. వీడికి తన బలం గురించి తెలిస్తే, రాక్షసుడి భయం పోతే, పూర్తిగా ప్రజాకంటకుడైపోతాడని నాకు భయంగా ఉంది" అని హెచ్చరించింది.

శివుడు భార్య మాటలు లెక్క చెయ్యలేదు. "ఇప్పటికే మనవాడు ప్రజాకంటకుడయ్యాడు. వాడు బానిసగా కాక కనీసం స్వతంత్రంగానైనా బ్రతకాలని నా ఆశ. త్వరగా వాడికి నిజం చెప్పాలి" అన్నాడాయన.

ఆ తర్వాత, శివుడు ఓ రోజున గ్రామాధికారి నుంచి తెలివిగా అద్దాన్ని తస్కరించాడు. ఆ ఊళ్లో ఉన్న అద్దం అది ఒక్కటే! ఎప్పుడైనా మహాబలుడు ఎదురుతిరిగితే, గ్రామాధికారి ఆ అద్దం చూపించి బెదిరిస్తూండేవాడు.

ఓరోజు గ్రామాధికారి లేని సమయంచూసి

శివుడు కొడుకుని పిలిచాడు. "నాయనా, ప్రపంచంలో బలముంటే ఏమైనా చేయవచ్చు. బలవంతుడికి, అందం లేకున్నా వచ్చే ఇబ్బంది ఏం లేదు. గ్రామాధికారి బుల్లిపెట్టెలో రాక్షసుడున్నాడని నిన్ను బెదిరిస్తున్నాడు. కాని, అది అద్దం. అందులో ఎవరు చూసుకుంటే వారి ముఖం కనిపిస్తుంది. ఇంతకాలం నీ ముఖం చూసుకుని నువ్వే భయపడుతున్నావు. ఈ నిజం తెలుసుకుని, ముందు గ్రామాధికారిని మట్టుపెట్టు. తర్వాత హాయిగా, స్వేచ్ఛగా, ఈ గ్రామానికి మహారాజువై జీవించు" అన్నాడు.

"నీ మాటలు అబద్ధం. నేను అందగాణ్ణి. నేను గ్రామాధికారి జోలికి వెడితే, ఆ బుల్లిపెట్టెలో రాక్షసుడు నా ప్రాణం తీస్తాడు" అన్నాడు మహాబలుడు భయంగా.

అప్పుడు శివుడు కొడుక్కి అద్దం ఎలా పనిచేస్తుందో తెలియడానికి అద్దం ముందు ఒకో వస్తువే ఉంచి, అదే కనబడుతున్నట్లు గ్రహించేలా చేశాడు. ఆ తర్వాత, మహాబలుడు తండ్రి ముఖాన్నీ, తల్లి ముఖాన్నీ కూడా అద్దంలో చూశాడు.

"అయితే, ఈ పెట్టెలో ఉండే మాయా రాక్షసుడు మాయమై ఉంటాడు. ఇక నా అందమైన ముఖం కూడా ఎలాఉంటుందో చూసుకుంటాను" అంటూ ఉత్సాహంగా అద్దంలో తన ముఖం చూసుకున్నాడు మహాబలుడు.

అప్పుడు అద్దంలో భయంకర రూపం కనబడింది. అది తనదేనని గ్రహించి, కెవ్వుమని అరచి విరుచుకుని పడిపోయి ప్రాణాలు విడిచాడు మహాబలుడు.

మహాబలుడు చనిపోయాడని తెలియగానే ఊళ్లో జనం తిరగబడి గ్రామాధికారిని చంపేశారు. తర్వాత జరిగినకథంతా తెలుసుకుని గ్రామస్థులు శివుణ్ణీ, పార్వతమ్మనూ ప్రాణాలతో వదిలిపెట్టారు.

ఆ దంపతులిద్దరూ వింధ్యారణ్యంలోకి పోయి, మళ్లీ ఆ ఋషిని వెతికి పట్టుకుని జరిగినదంతా చెప్పి ఏడ్చి, "మా బిడ్డ ఆయుష్మంతుడు అవుతాడని చెప్పారు. కానీ, అర్థాంతరంగా చనిపోయాడు. ఇలా ఎందుకు జరిగింది స్వామీ!" అని అడిగారు.

ఋషి ఒక్క క్షణం మౌనంగా ఉండిపోయాడు. ఆ తర్వాత వాళ్ళను చూసి, "అందవికారంగా ఉన్న మీ బిడ్డకు ఆ విషయం మీరు చెప్పలేదు. ఆ కారణంగా మీ బిడ్డ ప్రజాకంటకుడు అయ్యాడు. ఎందరో మీ బిడ్డ చావాలని శాపనార్థాలు పెట్టారు. అవి మీ బిడ్డ ఆయువును తగ్గించేశాయి. మంచివాళ్ళ ఉసురు ముందు, బ్రహ్మ పోసిన ఆయువు కూడా నిలబడదు. ఇంక నా శక్తి ఏమాత్రం? బిడ్డలు పుట్టాక ఆ బిడ్డల్ని జాగ్రత్తగా పెంచి, కాపాడాల్సింది తల్లిదండ్రులే కాని, దేవుడు కాదు. చేజేతులా మీరే మీ బిడ్డను చంపుకున్నారు" అన్నాడు.

వినయశీలుడు కథ ముగించగానే మహారాణి నవ్వి, "వినయశీలా, నీ కథ గొప్పగా ఉంది. మంచివాళ్ళ ఉసురు పోసుకునే ప్రమాదం గురించి నేనూ ఆలోచించాలి. ఈలోగా నువ్వు ఇంకో మంచి కథ ఆలోచించి, రేపు నాకు చెప్పాలి" అంది.

నూరుకట్ల పిశాచానికి రెండోకట్టు విడిపోయింది. తన ఒంటికి మిగిలిన మిగతా తొంభై ఎనిమిదికట్లనూ తల్చుకుంటూ, "ఇంకా రేపేం కర్మ! తొంభై ఎనిమిది రోజులు వరుసగా కథలు చెబుతాను. ఆ తర్వాత, నా దారి నాది. వినయశీలుడి కర్మ అతడిది!" అని అనుకుంటూ తనలో తనే ఎంతో ఆనందపడింది.

మర్నాడు, వినోదప్రదర్శనకు ముందు యథాప్రకారం కథ వినడానికి మహారాణి మళ్ళీ వచ్చింది. వినయశీలుణ్ణి ఆవహించి ఉన్న పిశాచం మరో కథ ప్రారంభించింది.

## సుధామ పదగారడి-323

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ❖ | 3 | ❖ | 4 | 5 |
| | ❖ | | ❖ | 6 | | 7 | ❖ | |
| | ❖ | 8 | | | ❖ | 9 | | |
| 10 | 11 | | ❖ | 12 | 13 | | ❖ | |
| ❖ | 11 | ❖ | 14 | ❖ | | ❖ | 15 | ❖ |
| 16 | ❖ | 17 | | 18 | ❖ | 19 | | 20 |
| 21 | | | ❖ | 22 | | | ❖ | |
| | ❖ | 23 | 24 | | ❖ | | ❖ | |
| 25 | | ❖ | | ❖ | 26 | | | |

### ఆధారాలు

**అడ్డం**

1. శివాజీకి బిరుదు (4)
4. ప్రభువు (2)
6. అటుగా చిలిపి (3)
8. అదాటున తాను అనను వెళ్ళిపోయింది(3)
9. గవాక్షము (3)
10. అటుగా మామిడిలోని కోతపళ్ళు కానివి(3)
12. కవి సోమసుందర్ ఇంటిపేరు (3)
17. మేలైన చిత్రాసనము (3)
19. ఉత్తానపాదుడి భార్య(3)
21. అబలకాదు ధీర అనే! (3)
22. అర్జునుడు (3)
23. ఉత్తరరామాయణం చంపూకావ్యంగా రాసిన 18వ శతాబ్దపు పాపరాజు ఇంటిపేరు (3)
25. తోలుసంచీ (2)
26. పాలగుమ్మి పద్మరాజుకు అంతర్జాతీయ ఖ్యాతితెచ్చిన కథ (4)

**నిలువు**

1. సినారె సభలో బాగా వేసేవారు (4)
2. పంచదార కన్న ఈమె తీపియట! (4)
3. శుల్కము, కట్నం (2)
5. స్త్రీలు చెవులకు పెట్టుకునేవే (4)
6. కపి తాను ఆడు-కనుడు అంటే మాయం! (3)
7. రోగానికి వైద్యుడు చేసేది (3)
11. సంవత్సరం (2)
13. మురళి (2)
14. అగ్నిపర్వతం చిమ్మునది (2)
15. గ్రామము (2)
16. పార్టీలలో అంతర్గతంగా నాయకుని పట్ల చెలరేగేది (4)
17. బొట్టు (3)
18. తిమిరము (3)
19. అధికారులు ఒక్కోసారి చేసే పర్యటనను దీనితో పోలుస్తారు (4)
20. '....పాల్గారు పసి బుగ్గలు". ఏమి చేస్తేనట? (4)
24. కుత్తుక (2)

### పదగారడి-322 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 అం | ■ | 2 నా | 3 గ | పం | 4 చ | మి | ■ | 5 పు |
| 6 ద | గ్గు | ■ | జ | ■ | లి | ■ | 7 ఉ | ట్టి |
| ము | ■ | 8 దా | ని | మ్మ | కా | య | ■ | న |
| ■ | 9 ము | ■ | మ్మ | ■ | లం | ■ | ■ | రో |
| 10 ర | క్క | సి | ■ | ■ | ■ | 11 త | 12 రా | జు |
| జ | ■ | ■ | 13 చి | ■ | 14 గు | ■ | జి | ■ |
| కు | ■ | 15 ఆ | త్రే | గా | డ | కి | ■ | 16 క్షీ |
| 17 రా | ట్నం | ■ | లే | ■ | బ | ■ | 18 మ | ర |
| లు | ■ | 19 సు | ఖ | సం | సా | రం | ■ | ము |

Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**

